# మహిళ



ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ
పదవ రచయిత్రుల మహాసభల
సాహిత్య సంచిక




ప్రచురణ

...ప్రదేశ్ సాహిత్య అకాడమి
...భవన్ - సైఫాబాదు,
...హైదరాబాదు-4

# మహిళ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

పదవ రచయిత్రుల మహాసభల

సాహిత్య సంచిక






ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్ - సైఫాబాదు,

హైదరాబాదు-4

MAHILA- A magazine consisting of essays presented and poems recited by Telugu women writers at the tenth women writers conference, sponsored by the Andhra Pradesh Sahitya Akademi at Machilipatnam during the year 1980.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాదు-500 004

ప్రచురణ : 335

ప్రథమ ముద్రణ : 1982

ప్రతులు : 1,000

వెల : రూ. 5-00

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి,
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాదు-500 004

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్,
హైదర్‌గూడ,
హైదరాబాదు-500 001.



Paper used for the printing of this book was made available by the Government of India at concessional rate.

తెలుగు రచయిత్రుల పదవ మహాసభలు

# ఆహ్వాన సంఘము

| అధ్యక్షులు | ఉపాధ్యక్షులు |
|---|---|
| శ్రీమతి ఎ. ఇందిరారెడ్డి | శ్రీమతి దుళ్ళ వెంకటరమణమ్మ |

కార్యదర్శి
శ్రీమతి అక్కూల సరస్వతీదేవి బాబురావ్

సభ్యులు
శ్రీమతి కె. వసుంధరాదేవి
కుమారి ఎస్. శ్రీలక్ష్మి
శ్రీమతి యద్దనపూడి కళావర్ధని
,, వి. ఇందిరాదేవి
,, జి. వి. సుజాతాదేవి
,, దాలిపర్తి లలిత
,, పోలవరపు ఆదిలక్ష్మి
,, పి. ఇందిర
,, జి. రాజ్యలక్ష్మి
,, పి. సీతాగోవిందరావ్
,, ఆకునూరి రామామణి
,, తరగా సీతారామమ్మ
,, ఆర్జా సత్యవతి
కుమారి పి. మైత్రేయి
కుమారి మంగళగిరి ప్రమీలాదేవి
,, విన్నకోట సుశీలాదేవి
శ్రీమతి జంధ్యాల కిరణ్మయి
,, కె. నాగరాజకుమారి
,, ఎమ్. సర్వలక్ష్మి
కుమారి శిరం సుశీలాబాయి
శ్రీమతి టి. రాఘవకుమారి
కుమారి కె. జానకి
,, బి. లలితకుమారి
శ్రీమతి టి. మంగతాయారు
కుమారి బి. రాజేశ్వరి
శ్రీమతి మల్లాది రుక్మిణీదేవి
,, అరుణాప్రపుల్లకుమార్
,, మొగిలిశెట్టి స్వరాజ్యలక్ష్మి
,, శ్రీమతి బి. సరోజినీరాజు

# విషయానుక్రమణిక

## వ్యాసాలు

## క వి త లు

# తొలి పలుకు

1980 జూన్‌లో మచిలీపట్నంలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ తెలుగు రచయిత్రుల మహాసభలను నిర్వహించింది. తెలుగు దేశంలోని పలు ప్రాంతాలనుంచీ రచయిత్రులు పాల్గొన్నారు. ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయ మూర్తులు శ్రీమతి అమరేశ్వరిగారు ఈ సభలను ప్రారంభించినారు. విజయవాడ మాంటిస్సొరి మహిళా కళాశాల ప్రిన్సిపాల్ శ్రీమతి వి. కోటేశ్వరమ్మ అధ్యక్షత వహించినారు. ఈ మహాసభల సందర్భంగా అకాడమి ప్రచురణల ప్రదర్శనను అకాడమి ఉపాధ్యక్షులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు ప్రారంభించినారు. అకాడమీ అధ్యక్షులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు సభలలో పాల్గొని తమ ఆశీస్సులను అందించినారు.

మచిలీపట్నం పురమందిరంలో ఈ ఉత్సవాలు మూడు రోజుల పాటు జరిగినవి. చర్చా గోష్ఠులు, కవయిత్రీ సమ్మేళనం సభలకు ఎంతో ప్రాముఖ్యాన్ని సంతరించి పెట్టినవి.

గోష్ఠుల సందర్భంగా రచయిత్రులు చదివిన వ్యాసాలను, కవయిత్రీ సమ్మేళనంలో చదివిన కవితలను సాధ్యమైనంతవరకు సేకరించి 'మహిళ' అనే సాహిత్య సంచికగా మలచి తెలుగు పాఠకలోకానికి అందిస్తున్నాము. వ్యాసాలను, కవితలను అందజేసిన రచయిత్రులకు, కవయిత్రులకు మా కృతజ్ఞతలు.

మచిలీపట్నంలోని స్పందన సాహితీ సమాఖ్యవారి సహకారంతో ఈ సభలు జయప్రదంగా నిర్వహింపబడినవి. ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీమతి ఎ. ఇందిరా రెడ్డిగారికి, ఆహ్వాన సంఘ కార్యదర్శి శ్రీమతి అక్కాల సరస్వతీ బాబూరావుగారికి, స్పందన సాహితీ సమాఖ్య కార్యదర్శి, శ్రీ గుత్తికొండ సుబ్బారావుగారికి ధన్యవాదాలు.

ఇరివెంటి కృష్ణమూర్తి

కార్యదర్శి.

# ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
# రచయిత్రుల సలహాసంఘ సభ్యులు

1. డాక్టర్ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ (కన్వీనర్)
2. డాక్టర్ తెన్నేటి హేమలత
3. డాక్టర్ నాయని కృష్ణకుమారి
4. డాక్టర్ పి. యశోదారెడ్డి
5. శ్రీమతి బి. లక్ష్మీకాంతమ్మ
6. డాక్టర్ సి. ఆనందారామం
7. శ్రీమతి కొండముది రుక్మిణీదేవి
8. శ్రీమతి కోడూరి లీలావతీదేవి
9. శ్రీమతి యస్. శమంతకమణీ కృష్ణమోహన్
10. శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి
11. శ్రీమతి మాలతీచందూర్
12. శ్రీమతి లలితా పీటర్స్
13. శ్రీమతి శారదా అశోకవర్ధన్
14. శ్రీమతి ఏ. లక్ష్మీరమణ
15. శ్రీమతి పరిమళాసోమేశ్వర్
16. డాక్టర్ రావి భారతి
17. కుమారి వాసిరెడ్డి సీతాదేవి

# స్వాగతోపన్యాసము

తెలుగు రచయిత్రుల పదవ మహాసభలకు విచ్చేసిన సాహితీమూర్తులకు సాహితీమిత్రులకు, సాహితీప్రియులకు స్వాగతం !

గత రెండుదశాబ్దాలుగా చారిత్రకంగా పేర్కొనదగిన వివిధ ప్రదేశాల్లో జరిగిన యీ రచయిత్రుల మహాసభలు యిప్పుడు చారిత్రకంగానూ సాంస్కృతికం గానూ మాత్రమేకాక సాహితీపరంగా బంగారం పండించిన బందరు గడ్డమీద జరగటం ఎంతో ముదావహం. గతాగతసాహిత్యాలకు వారధిగా నిల్చిన సాహితీ మూర్తి చెళ్ళపిళ్ళ స్వామి విహరించిన గడ్డ యిది. శ్రీయుతులు విశ్వనాథ, పింగళి, కాటూరు వంటి మహానుభావులు తెలుగు సాహితిని సేవించి తరించిన భూమి యిది. ఇంకా మధురకవి శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి, అద్భుత కథా కారుడు, గీత రచయిత శ్రీ పింగళి నాగేంద్రరావు, హాస్యప్రసంగాల శ్రీ జల సూత్రం రుక్మిణీనాథశాస్త్రి యీవూరివారే. నేడు కవులుగా, రచయితలుగా విరాజిల్లుతున్న వారి గురించి ప్రత్యేకం చెప్ప నవసరం లేదు. అందరూ లబ్ధప్రతిష్ఠులే.

ఇక పోతే, మన దేశంలో మహిళలపాత్ర మొదటినుండి కేవలం కుటుంబ జీవితానికే పరిమితం కాలేదు. భారతీయ సంస్కృతి, రాజకీయ సాహిత్య కళా రంగాల్లో స్త్రీకి యివ్వబడిన వున్నతస్థానం అందరికీ తెలుసు. తెలుగుదేశంలో అన్నిరంగాల్లోనూ స్త్రీలు ముందంజవేస్తూనే వున్నారు. నాగమ్మవంటి రాజనీతి జ్ఞులు, రుద్రమ్మవంటి వీరవనితలు, మాంచాల, చానమ్మలవంటి వీరపత్నుల వివరాలు చెప్పనవసరంలేదు. మొల్ల, ముద్దుపళని వంటి సాహితీమూర్తులు తెలుగు సారస్వతాన్ని మరింత శోభాయమానం చేశారు. పదగాంభీర్యంతో పెద్దలకు మాత్రమే ముచ్చట చేస్తున్న సాహిత్యాన్ని మొల్ల సామాన్యులస్థాయికి మళ్ళించింది. సరస శృంగార వచోవైభవంతో తెలుగుసాహిత్య రసలోకాన్ని అలరించింది 'ముద్దుపళని'.

ఇదంతా గతం. ఈ గతం వుజ్వలమైనదే. ఐతే మధ్యయుగాల్లో మహిళల సాహిత్య కృషి కొరవడింది. 'ఎక్కడ స్త్రీ గౌరవింపబడుతుందో అక్కడ దేవతలు నాట్యం చేస్తార'ని చెప్పుకున్నచోటే స్త్రీకి స్వాతంత్ర్యం యివ్వరాదనే అంక్ష! అయితే ఈ అవ్యవస్థ ఎక్కువకాలం మనలేదు. ఆధునిక యుగంలో మళ్ళీ అనేకమంది కవయిత్రులు, రచయిత్రులు వుదయించారు. తెలుగు భాష అందచందాల్ని, తెలుగు సోయగాన్ని, సౌకుమార్యాన్ని, సంస్కృతీ సంప్రదాయాలను చక్కగా చిత్రించారు తెలుగు రచయిత్రులు. ఇందులో అతిశయోక్తి లేదు.

ఇది నవలాయుగం. పత్రికలద్వారానేమీ, ప్రచురణకర్తలద్వారానేమీ నేడు అసంఖ్యాకంగా నవలలు వెలువడుతున్నాయి. వీటిలో అనేకం రచయిత్రులవేనంటేనూ, పాఠకలోకాన్ని వుర్రూతలూగిస్తున్నవంటేనూ అతిశయోక్తి కాదు. సామాన్య పాఠకులను యీ నవలలు ఆకర్షించినంతగా మరేదీ ఆకర్షించటం లేదు. చౌకబారు పుస్తకపఠనం నుంచి తెలుగు పాఠకులు, ముఖ్యం వనితలు, కొంచెం మంచిపుస్తకాలు చదివే ఆరోగ్యవంతమైన పరిణామాన్ని సాధించగలిగిన నవలా రచన చేస్తున్న తెలుగు రచయిత్రులను తప్పక అభినందించాలి.

నేటి సభల్లో పాల్గొనేందుకు వచ్చిన రచయిత్రులు ఎవరి ప్రత్యేకతతో వారు, ఎవరి శైలీసంవిధానంతో వారు పాఠకులను ఆకట్టుకున్నవారే. తెలుగు సాహితీలలామను వివిధాలంకారం చేస్తున్న రచయిత్రులందరినీ పేరుపేరునా పేర్కొనటం అసాధ్యమే. ఐనా యీ మహాసభల్లో వుత్తమ రచనారీతుల్ని వెలయించేందుకు, ఆదర్శవంతమైన నిర్ణయాలు తీసుకునేందుకుగాను వివిధ చర్చాగోష్ఠులలో పాల్గొనేందుకు మీరంతా ఒకే వేదికమీదకు రావటం ఎంతో ఆనందించవలసిన విషయం.

పనుల వత్తిడిలోనైనా, రాష్ట్రం నలుమూలలనుండి, పవిత్రమైన సాహిత్యజిజ్ఞాసతో సభల్లో పాల్గొనేందుకు వచ్చిన మీ అందరికీ మా హృదయపూర్వకమైన స్వాగతం.

ఈ మహాసభలకు ప్రత్యేక అతిథులుగా వచ్చి సభలకు గౌరవం కలిగించిన ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ కె. అమరేశ్వరిగారికి, సభలకు అధ్యక్షత వహించేందుకు విచ్చేసిన విజయవాడ మాంటిస్సోరి మహిళా కళాశాల ప్రిన్సిపల్ శ్రీమతి వి. కోటేశ్వరమ్మగారికి ఆహ్వాన సంఘం తరపున ప్రత్యేకం స్వాగతం పలుకుతున్నాను.

మచిలీపట్నంలో ఈ మహాసభలు జరిపేందుకు అనుమతించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, కార్యదర్శి డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తిగార్లకూ, యితర కార్యవర్గ సభ్యులకూ, సభా నిర్వహణ కార్యక్రమాన్ని వుత్సాహంతో చేపట్టిన మచిలీపట్నం స్పందన సాహితీ సమాఖ్యులకూ, ఆహూతులైన పురప్రముఖులకూ—ఇంకా సోదరీ సోదరులందరికీ ఆహ్వాన సంఘం పక్షాన సుస్వాగతం !

చరిత్రాత్మకమైన మచిలీపట్నంలో, ఈ మహాసభా ప్రాంగణంలో జరిగే సాహిత్యనిర్ణయాలు మన భాషా సాహిత్యాలను తీర్చిదిద్దగలవని, రచనారంగాన్ని మరింత తేజోమయం చేయగలవని, తెలుగు పాఠకలోకాన్ని యింకెంతో ప్రభావితం చేయగలవని ఆశిస్తూ, ఆకాంక్షిస్తూ మరోసారి మీ అందరికీ హృదయపూర్వకమైన స్వాగతం చెబుతున్నాను.

ఎ. ఇందిరారెడ్డి
అధ్యక్షులు, ఆహ్వానసంఘం.

# ఆహ్వాన సంఘ

# కార్యదర్శి నివేదిక

వేదిక నలంకరించిన పెద్దలకూ, మహాసభలకు విచ్చేసిన సాహితీ మిత్రులకు శుభాభినందనలు.

1976 నవంబరులో జరిగిన కృష్ణాజిల్లా రచయితల నాల్గవ మహాసభల తరువాత, తిరిగి నాలుగేళ్ళకు ఘనంగా ఈ తెలుగు రచయిత్రుల పదవ మహాసభలు జరుపుకునే అదృష్టం మచిలీపట్నానికి కలిగింది. క్రితంసారిలాగానే ఈ పర్యాయంకూడా స్పందన సాహితీ సమాఖ్య యీ మహాసభల నిర్వహణ బాధ్యతని సంతోషంగా స్వీకరించింది.

సాహిత్యసేవ అనేది వో యజ్ఞంలాంటిది. అందులోనూ పుస్తక ప్రచురణ బృహత్తరమైనది పుస్తక ప్రచురణ వో ముఖ్యోద్దేశంగా వున్న స్పందన పెరిగిపోతోన్న పేపరు ధర, ప్రింటింగ్ ఖర్చులతో ఎన్నో యిబ్బందుల్ని ఎదుర్కొంటోంది. అయితే యిన్ని యిబ్బందుల్ని సహృదయులయిన స్నేహితులు, సాహితీ మిత్రుల అండదండలతో అధిగమిస్తోంది. ఆ అచంచల విశ్వాసంతోనే అనేక ఆర్థిక యిబ్బందులున్న యీ సమయంలో కూడా యీ మహాసభలను నిర్వహించే భారాన్ని సంతోషంగానూ, సగర్వంగానూ స్వీకరించింది స్పందన.

స్పందన సాహితీ సమాఖ్య ఉపాధ్యక్షురాలిగా కాక, తెలుగు రచయిత్రుల పదవ మహాసభల ఆహ్వాన సంఘ కార్యదర్శిగా కొన్ని విషయాలు చెప్పవలసిన బాధ్యత నాకు వుంది.

ప్రపంచ సాహిత్యంలో రచయితలతో పాటు రచయిత్రులూ విశిష్ట స్థానాన్ని ఆక్రమించారు. కవయిత్రుల మాట అటుంచి ఆధునిక యుగంలో ధృవతారలనదగు రచయిత్రులు చాలమంది దర్శనమిస్తారు. అమెరికన్ బానిసత్వ నిర్మూలనకి కారణమైన మార్గరెట్ మిచెల్, పద్దెనిమిదవ శతాబ్దపు మధ్యతరగతి జీవితాన్ని చక్కగా చిత్రించిన జేన్ ఆస్టిన్, ప్రపంచ సాహిత్యాన్ని కలవరపెట్టిన ఎమిలీ జోలా, వినూత్న రచనా సంవిధానంతో వినుతికెక్కిన వర్జీనియావూల్ఫ్ - యిలా చాలామందిని వుదాహరించవచ్చు. భారతీయ

# అధ్యక్షోపన్యాసం

# సాహిత్యకళోపాసన

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

చతుష్షష్టి కళలలో ఆలోచనామృతమైన సాహిత్య కళయు, ఆపాత మధురమైన సంగీత కళయు ఉత్తమోత్తమములైనవి.

ఆనంద సబ్రహ్మచారియైన ఉత్తమ రసానందానుభూతి కల్గుటకు సాధనాభూతమై, పఠితలకు ఉత్తమ వివేచనాధికారము కల్గించుట ద్వారా, మానవుని ఉన్నతుని జేయగల్గు శక్తి కల్గినదగుటచేతనే కవిత్వ కళ ఉత్తమోత్తమము కాగల్గినది.

కావుననే కవిత్వకళకు గల సాధనా మార్గము దురత్యయమైనదని పెద్దలు నుడివి యున్నారు.

ఉత్తమ రసానందానుభూతియే కళయొక్క ప్రధాన ప్రయోజనమైనను, కళాసృష్టి వలన ఇతరములైన లౌకిక ప్రయోజనములు కూడ తప్పక కలుగుచునే యుండును.

ముఖ్యముగా కావ్యకళవలన అనేక ప్రయోజనములు సిద్ధింపగలవని—

''కావ్యం, యశసేఽర్థకృతే, వ్యవహారయుజే శివేతరక్షతయే
కాన్తా సమ్మితతయా, సద్యఃపర నిర్వృతయే"

అనే శ్లోకమువలన కావ్యకళ వలన లౌకికములైన యశస్సు, అర్థ సంపాదన, వ్యవహార ప్రయోజనములే కాక, శివేతరక్షతి రూపమైన లోక కళ్యాణము, కాన్తా సమ్మితమగుటచే సద్యఃపర నిర్వృతియు గల్గునని తెలియుచున్నది.

ఈ విధముగా మన ప్రాచీన భారతీయ కావ్యకళ, సద్యఃపర నిర్వృతి దాయకమై, లోకకళ్యాణమునకు హేతుభూతమై విరాజిల్లి యుండినది. ఆనాటి కావ్యమింత ప్రయోజనవంతమైనదగుట చేతనే ప్రాచీనాలంకారికులు కూడ ఆ విధముగనే కావ్యకళకు లక్షణము నిర్వచించియుండిరి.

మన ప్రాచీన కావ్యములైన రామాయణ, భారత భాగవతాది మహాకావ్యములకిట్టి పరమార్థమును సంభావించియే ఋషికల్పులైన వాల్మీకి వ్యాసాదులు సాహిత్యకళను తపస్సుగా సాధించి, లోకహితార్థము ప్రపంచించి యుండిరి.

తరువాత రానురాను కావ్యకళా ప్రయోజనము నందు లౌకికానందాను భవమే ప్రధానముగా తలంపబడుట చేతను, ఆయా కాలముల యందలి ప్రభువుల చిత్తవృత్తి ననుసరించి కావ్య ప్రయోజనము నందు కొంత తప్పనిసరి పరిమితు లకు స్థానము కల్పింప వలసి వచ్చినది.

ఈ మార్పు ముఖ్యముగా మన ఆంధ్ర సాహిత్యమున ప్రబంధయుగము నుండి కొట్టవచ్చినట్లు కనబడగలదు.

ముఖ్యముగా ఆంధ్ర సాహిత్యమున నిట్టి మార్పులు తప్పనిసరియైనను, ఆంధ్ర కవయిత్రీలోకము మాత్రము, ఒక్క ముద్దు పళని తప్ప మిగిలిన వారందరును సాహిత్యము, హితాత్మక మైనదను భావము నుండి తొలంగకయే కావ్యసృష్టి గావించి, సరస్వతి నారాధించుట మనము గమనింప దగిన ముఖ్యాం శము. ఆదికవి నన్నయ, సోమయాజి తిక్కన మొదలైన మహాకవుల ఒరవడి యందే మహిళావాఙ్మయ రచనము సాగినదని మనమీ శుభ సమయము నందు స్మరించుట, మన మహిళా లోకమునకు ఉత్కర్షాదాయకము.

ఐతే కవితా రచనకు ప్రధానాలంబనమైన ఛందో పద్ధతి మాత్రము, కాలానుగుణముగానే కవయిత్రులు చేపట్టి యున్నారు.

ఇంతవరకు పద్య, గేయ రూపమైన మహిళా సాహిత్యమును గూర్చి నేను పై రెండు మాటలను చెప్పి యున్నాను.

ప్రస్తుతము రచనా రంగమున ప్రాధాన్యము వహించిన, నవల కథ, కథానికల విషయమై తప్పనిసరిగ కొంత ముచ్చటించవలసి యున్నది.

మహిళా వాఙ్మయమున సీరము సుభద్రయాంబగారి అనువాద నవల 'జాగిలము' ప్రథమ రచన. తరువాత చాలా కాలము వరకు మరల రచ యిత్రులు నవలా ప్రక్రియను చేపట్టనే లేదు.

కాని ప్రస్తుతము సుమారు రెండు దశాబ్దముల నుండి నవలా రచనమున మహిళలే సుప్రసిద్ధురాంద్రుగా కనబడుచున్నారు ఇది మిక్కిలి ఆనంద హేతువు.

కాని నవలా రచనము నందలి ఇటీవలి పరిణామములు సాహితీవేత్తలనే కాక, యావదాంధ్ర లోకమునే కలవర పెట్టునవిగా ఉండుట మిక్కిలి శోచ నీయము.

కావ్య ప్రయోజనమునందు పూర్వులు పేర్కొనిన యశస్సు, యశస్సు కంటె ముఖ్యముగా అర్థ కృతియే ప్రధానములై నవలా రచనము పేరుదారులు ద్రొక్కుచుండుట అందఱెఱింగినదే. దీనిచే సాహిత్య రంగమున వాసికంటె రాసికే ప్రధాన స్థాన మీయబడుచున్నది.

'సాహిత్యము సమాజ ప్రతిబింబము' అను నినాదమునకు ప్రాధాన్యమిచ్చి, సమకాలీన స్పృహయను నొక భ్రమకు రూపకల్పన చేసి, అంతఃకరణకు నైతిక ప్రమాణ స్థాయినుండి దిగజారి, అధః పతనము చెందుచున్న సమాజము నందలి నీచాభిరతిని, హేయ భావములను మాత్రమే ఇతివృత్తముగా తీసుకొని, సమాజమునందలి బలహీనతలను రెచ్చగొట్టుచు సొమ్ము చేసుకొనుచున్న నేటి నవలా, కథా రచనము మహితమైన మహిళా వాఙ్మయమున కొక మాయని మచ్చయని చెప్పక తప్పదు. సమాజమున గల నీచాభిరతిని బయట పెట్టుట కొంత మాత్రమే జరిగి, ఆ సమస్య యొక్క ఉత్తమ పరిష్కారమునకు ప్రాధాన్య మీయకపోవుట శోచనీయము.

పత్రికలవారును డబ్బు కొఱకే రచయిత్రులను ఇట్టి రచనలకు ప్రోత్సహించుటయు, సినీమాలు కూడా ఈ హేయ, నగ్న, అసభ్య ప్రదర్శనమునకు ముఖ్య స్థానములైన రచనలనే తీసుకొనుటయు, వాటికి తగినంత అసభ్యములైన ప్రకటనలకే ప్రాధాన్య మిచ్చుటయు నేటి సమాజము యొక్క దుస్థితికి, అధోగతికి ప్రబలోదాహరణము.

బాధ్యతా రహితమైన తమ రచనల వలన నేటి సంఘమున పెచ్చు పెరిగిపోయి, చెలరేగుచున్న మహిళల మానభంగములు, ఆత్మహత్యలను, నైతికముగా దిగజారి క్రుళ్లిపోయిన సమాజ దుస్థితిని గ్రహించియైనను, రచయిత్రులు తమ రచనా సంవిధానమును మార్చుకొని, లోక హితంకరముగా, నిరపాయ పద్ధతిలో రచనలను కొనసాగించు టత్యంతావశ్యకము. అట్టి ఉత్తమ భావన రచయిత్రులకు కల్గనిచో భావి తరము వారిని పాడు చేయుటయే కాక, కళంక పూర్ణమైన భారతీయ చరిత్రకు వీరే కారకురాండ్రగుదురు. ఇది మిక్కిలి గమనార్హము.

ఇక గేయ రచనలో నేటి రచయిత్రులు ముందంజ వేయుచుండుట ప్రశంసార్హము.

ఈ విధముగా ఉత్తమ సాహిత్య కళోపాసన చేయుచున్న సోదరీమణుల కళ్యాణ వ్యవసాయము నభినందించుచు విరమించుచున్నాను.

# నేటి కవిత - మహిళలు

ఎ. లక్ష్మీరమణ

నేటి కవిత అంటే నిన్నటి కవిత, రేపటి కవిత కూడాను. ఎందువల్లనంటే అసలైన కవిత్వానికి నిన్న, నేడు, రేపులు లేవు కనుక. కవిత అన్నది సర్వకాలీనమైంది. అమెరికన్ కవి Ralph Waldo Emerson "Every word was once a poem" అన్నప్పటికీ, అసలు మాట కన్న ముందే–మనిషి కదిలినప్పుడే కవిత కదలటం ప్రారంభించిందనిపిస్తుంది. మలయ పవనం వీచినపుడు, నిప్పు రాజుకున్నపుడు, నెమలి పింఛం విప్పి ఆడ నేర్చినపుడు- ఆ ఆనంద పారవశ్యంలోనే కవిత జనించింది. ఆనాటి నుండి నేటి వరకు గల గలా ప్రవహించే సెలయేరులా, సాగుతూనే వుంది. రేపు, మాపులు దాటి జగత్తు వూపిరిపీల్చుకున్నంత కాలం జీవం పోసుకునే వుంటుంది.

మానవ హృదయం భావప్రపూర్ణమైనపుడు, రసార్ద్రమైనపుడు కవిత ఉదయిస్తుంది. ప్రతి యుగంలోనూ ఆనాటి ఉద్యమాల ప్రభావంవల్ల మహా కావ్యాలు కవులు సృష్టించటం జరిగింది. కవులు అనగా కవయిత్రులకు కూడా వర్తిస్తుంది. A man includes women in law. "ముదితల్ నేర్వగ రాని విద్య కలదే ముద్దార నేర్పించినన్" అన్నారు చిలకమర్తి కవి. లలిత కళల విషయంలో ఆ మాట మరింత నిజం. లలితకళలన్నింటిలోనూ కవిత్వం గొప్పదేమో!

మానవ విజ్ఞానం నానాటికీ అభివృద్ధి చెందుతోంది, విజ్ఞాన రంగంలో ఎన్నెన్ని మార్పులు జరుగుతున్నా, మానవ స్వభావంలోని మౌలిక గుణాల్లో అంతగా మార్పు రాలేదు. దైవభీతి, దేశభక్తి, పాపపుణ్యాలు, రాగద్వేషాలు, ఆశా నిరాశలు, ధనాకాంక్ష, అధికార కాంక్ష లాంటి ఆకాంక్షలు నాడూ నేడూ

మనిషి మనసుపైన పెత్తనం చెలాయిస్తూనే వున్నవి. విజ్ఞానం పెరిగినంత మాత్రాన మానవుడు నవ రసాలకు అతీతుడు మాత్రం కాలేదు.

సూర్యుడు సనాతనుడు, నిత్య నూతనుడు కూడాను. అదే విధంగా కవిత్వం కూడా అతి పురాతనం, నిత్యనూతనం. వివిధ రచయితలు, రచయిత్రులు ఒకే వస్తువులో భిన్న విభిన్న రూపాలను, గుణాలను, సత్యాలను దర్శిస్తారు. ఈ దర్శనమే కవితారూపం దాల్చుతుంది. ఒక్కొక్క కవితలో ఒక్కొక్క నూతన అనుభూతి ఆవిష్కరించబడుతుంది.

And up from India glances
The silver sail of dawn.

ఇక్కడ dawn అన్నది కవి దృష్టిలో ఓడ. అదే కవి దర్శనం.

కవి - కవయిత్రి హృదయంలో ఒక విధమైన వుత్సాహం జనించినపుడు, ఉద్వేగం కలిగినపుడు, కరుణ హృదయంలో నిండినపుడు, బాధతో మనసు క్రుంగినపుడూ కవిత్వం పుడుతుందనవచ్చును. ముఖ్యంగా ఆనంద సౌందర్యాలు కవితకు ప్రత్యేక లక్షణాలుగా అగుపిస్తవి.

"Poetry sometimes Crowns the search
for happiness. It is itself a search
for happiness"-Wallace Stevens.

లోక కళ్యాణంతో బాటు ఆనందానుభూతి సాహిత్య ప్రయోజనంగా ఎందరో కవయిత్రులు వర్ణించారు. "నేను సౌందర్యోపాసనా వర్గానికి చెందిన దాన్ని" అని శ్రీమతి సరోజినీదేవి చెప్పుకున్నారు.

ప్రేమ హృదయంలో పెల్లుబికినపుడు కవిత జాలువారుతుంది. ఆ ప్రేమ భావన అనంతమైంది, అది దైవప్రేమ, మాతృప్రేమ, మరే విధమైన ప్రేమగానైనా రూపొందవచ్చును.

కృష్ణ గీతావళిని గూర్చి "ఎందరికి తెలుసు రాజా మహెమ్మగారు రాజ మన్నారు గారి సతీమణి అని, కమనీయ గీతికా రచనలో రవ్వలు రాల్చిన శేష కీర్తి అని" అన్నారు. అద్వితీయమైన ప్రేమభావాన్ని గానం చేస్తూ శ్రీమతి అప ధూత జ్ఞానమాంబగారు-

"ప్రేమకేమైన రూపమ్ము పెట్టినామె!
ప్రేమ నెఱుగని వారలీ పృథివి గలరె?"

అంటూ ప్రశ్నించారు. 'సాకేత సార్వభౌమ' లో శ్రీమతి నిడుమోలు ప్రసూన గారు ఆ సీతారాములకు అక్షర సుమార్చనలర్పించారు.

జీవితం విభిన్న రసాలకు నిలయమైంది. జీవిత విధానంలో ప్రేమతో పగ, కరుణతో కక్ష, శాంతితో అశాంతి పోటీ పడుతూనే వుంటాయి. జీవితం వలెనే సాహిత్యం కూడా నవరసాత్మకమైంది.

ముఖ్యంగా సమకాలిక సంస్కృతి, ఆదర్శం, నైతిక, మానసిక, విప్లవ శక్తుల ప్రభావం రచయితలమీద పడకమానదు. ఈ జీవిత సంఘర్షణలో ఒక భావన కవయిత్రికి స్ఫురిస్తుంది. అందులోని నూతనానుభూతిని కవితలో జత జేర్చి చెబుతుంది. తనదైన వ్యక్తిత్వం, తాను ఎన్నుకున్న వస్తువు ప్రభావ పరిణామ ఫలితం కలిసి ఆ కవయిత్రి సృష్టిగా రూపొందుతుంది.

కవులు-కవయిత్రులు స్వతంత్రులు, నిరంకుశులు. మీరు ఈ విషయం గురించి లేక యీ తీరుగా వ్రాయవలెనని ఎవ్వరూ ఆజ్ఞాపించలేరు. "నా యిచ్ఛయే గాక నాకేటి వెఱపు...మాయమయ్యేదను నా మధుర గానమున" అని రచనలో స్వేచ్ఛాభావాన్ని చాటి చెప్పినవారు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు. కవితా భావాన్ని గౌరవించటం సహృదయుల లక్షణం. ఈ స్వతంత్రత వల్లనే వివిధ రచయిత్రులు వివిధ రీతులలో మనోహర సామగ్రిని సాహిత్యంలో సమకూర్చ గలుగుతున్నారు. నవ్యత, స్వీయ ప్రతిభ ప్రదర్శించే యీనాటి కవితలే రేపటి కవిత్వానికి పునాదులని కూడా చెప్పవచ్చును.

ప్రతిభావంతులైన రచయిత్రుల రచనలు కొన్ని వెల్వడుతున్నప్పటికీ ఈ పరిమితి కాలంలో సూచనాప్రాయంగా అందులో కొన్ని మాత్రమే పేర్కొనగలుగుతున్నాను. శ్రీమతి కె.రామలక్ష్మిగారి 'రచయిత్రుల సమాచార సూచిక' లో కొందరి రచయిత్రుల, కవయిత్రుల జీవిత విశేషాలు తెలుపబడినవి. Dr. నాయని కృష్ణకుమారి గారు, శ్రీమతి ముక్తేవి భారతి వంటి వారు కవితా విమర్శన లెన్నో రచించారు. కళాప్రపూర్ణ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ గారి 'ఆంధ్ర కవయిత్రులు' అన్న గ్రంథంలో మరికొందరి కవయిత్రుల ప్రతిభా విశేషాలు పేర్కొన్నారు. శ్రీమతి లక్ష్మీకాన్తమ్మ గారి 'కాంతి శిఖరాలు', మహిళా విక్రమ సూక్తము, 'మన సాహితి మధుభారతి', మొదలైన కావ్యాలు నిర్దుష్ట భాషాభూషితాలని చెప్పవచ్చును. వీరి 'కన్యకమ్మ నివాళి' సున్నితమైన వ్యంగ్య ధోరణిలో సాగింది. సహజ సాంప్రదాయ రీతిలో సాగే ఆమె రచనలకు నూతనత్వం జోడించిన తీరుతెన్నులు ఇందులో గోచరిస్తున్నవి. నా కవితాసంపుటి 'సూర్యముఖి'లో ఆత్మ నివేదనపరమైన కవితలతో బాటు సమకాలికసమాజంలోని పరిస్థితులు ప్రస్ఫుటించబడ్డవి. మరి నా 'స్నేహచిత్రా'లలో స్నేహాన్ని అన్ని కోణాల నుండి దర్శించి కవితలో చిత్రించాలని ప్రయత్నించాను. స్నేహాన్ని గూర్చి కొన్ని కథా కవిత లల్లుకున్నాను.

డా॥ నాయని కృష్ణకుమారి 'అగ్నిపుత్రి' కవితా సంపుటిలో తన అంతరంగావిష్కారం చేస్తూ, కవిత్వమంటే జీవితమనీ, అనుభవాల తామర తంపర అనీ విశ్వాసాన్ని వ్యక్తపరిచారు. భావనాప్రతిభ గల శ్రీ జ్యోతిర్మయి ప్రతి 'భావనలో' నవచైతన్యం నాట్యమాడుతోంది. 'దీప్తి'గా 'దివ్వెలుగా' ఛెళ్ళున వెలుగు దూసుకుపోతోంది. శ్రీమతి శారదా అశోకవర్ధన్ శారదా కృతులలో మొగ్గతొడిగిన ప్రతిభ క్రమంగా వికసించి, యీనాడు 'సుషుప్తినుండి మేల్కొ' లిపి 'భావరాగిణి'గా సాగిపోతోంది. శ్రీమతి బుద్ధరాజు సులోచన 'చీకటి పూలు' విరబూయించారు.

శ్రీమతి అనసూయ గారి 'స్నేహాభిరామం'- ఎదనిండిన వేదనను అక్షరమాలగా అర్పించారు. వృత్తిరీత్యా ఇంజనీర్ అయిన కుమారి జంధ్యాల సుబ్బ

లక్ష్మిగారు సంప్రదాయ సిద్ధమైన చక్కని పద్య కావ్యం 'శ్రీ విజయ చంద్రహాసము' రచించటం అభినందించదగ్గ విషయం. గంగరాజు సుశీలగారి వచన కవితలన్నీ ప్రత్యేకతతో శోభిల్లేవి. ప్రకృతిలో వ్యక్తి ప్రాధాన్యత గురించి 'ఆలాపన'గా గేయసంపుటి రచించిన వారు డా॥ వాసా ప్రభావతిగారు.

కవితా సంపుటాలుగా రూపొందించకపోయినా గుండెబలం, కండబలం దండిగా చేర్చుకొని కవితలతో కూర్చిన కవయిత్రులు మరెందరో! డా॥ పి. యశోదారెడ్డి, కళాప్రపూర్ణ లత, కుమారి వాసిరెడ్డి సీతాదేవి, శ్రీమతి వేదవతి, డా॥ సుమతి, ముక్తేవి భారతిగారు, భాషా ప్రవీణ మందరపు హైమవతి గార్ల కవితలు ఆ కోవకు చెందినవే.

కవిత్వం అనంతమైన ఆత్మానందాన్ని కలిగించేది, ఆత్మ స్పందనానికి దారి తీసేది కూడాను. ఒక్కొక్కమారు అది సామాజిక ప్రయోజనాలను సాధించే ఆయుధంగా రూపొందుతుంది. విచార సాగరంలో మునిగిన మనోవేదనకు తెప్పలా తగిలి ఆదుకుంటుంది. Poetry sure Captures many moods, reflects many moods.

మార్పు అన్నది వాఙ్మయలక్షణం కనుక కవితలో కూడా నూతన రీతులు చోటు చేసుకోవటం సహజం.

కొత్తనీటిని చేర్చుకొని తర
గెత్తు నదివలె ఎట్టి జాతియు
ముందుకేగిన యంత కాలము
మూడు పూవులు, ఆరు కాయలు.

డా. సి. నారాయణరెడ్డి గారి 'సమ దర్శనం' కావ్యంలోని సమన్వయ భావమిది. ఈ విధమైన సమన్వయ భావంతో యీనాడు మనం ఒకే వేదికపై కలుసుకున్న కవయిత్రులం. తీరులు వేరైనా, కవితా గమ్యం అందరిదీ ఒక్కటే. We all live in poetry. కవయిత్రుల కలయికే ఒక విశ్వశక్తి స్వరూపం. "వ్యక్తికి బహువచనం శక్తి'' అన్నారు శ్రీశ్రీ.

# నేటి కవిత–మహిళలు

డా॥ పి. సుమతి నరేంద్ర
యం. ఏ; పి.హెచ్.డి.

ఆధునిక యుగంలో కథలకు, నవలలకు ఉన్న ప్రాచుర్యం కవితకు లేదు. ప్రజా బాహుళ్యానికి సులభంగా అర్థమయ్యే రచనా ప్రక్రియలలో కథలకు, నవలలకు అగ్రస్థానము లభించగా, ఆ తరువాత నిలిచేదే కవిత-అది కూడ పద్య కవిత కాదు - వచన కవిత మాత్రమే. ఇక గేయకవిత పద్య వచన కవితలకు మధ్యే మార్గంగా నిలిచియున్నది. ఈనాడు కవిత అనే మాట చాలవఱకు వచన కవితకే పరిమితమై ప్రయోగింపబడుతున్నది. ఆధునిక కాలంలో మహాకవులుగ ఎన్నదగిన వారు కూడ ఈ వచన కవితపట్లనే మొగ్గు చూపడం మనం గమనింప వచ్చును. కాల గమనంలో అన్ని రంగాలలో వచ్చినట్లే సాహిత్య రంగంలో కూడ వచ్చిన వేగం ఈ పరిణామానికి ఒక కారణం. చదివిన వెంటనే భావం స్ఫురించాలి అనేది నేటి పాఠకులలో ఎక్కువ మంది యొక్క అభిప్రాయం. కాగా ఆ భావం స్ఫురించకపోవడమనేది కూడ పరిపాటియైపోయింది ఆధునికుల రచనలలో. అది వేరే సంగతి. దానికో ప్రత్యేక చర్చా వేదిక అత్యవసరము.

ఇక ఈ ఆధునిక కవితలలో ఉన్న కవితా వస్తువులను పరిశీలిస్తే అవి ఎక్కువగా సమాజాన్ని విమర్శించేవిగానే ఉంటున్నాయి. రచయితల వ్యక్తిగత అభిరుచులను, అనుభూతులను ప్రతిబింబించేవి చాల తక్కువ. ఇది రచయిత్రులకు వర్తించదు. రచయిత్రులలో చాలవఱకు కథ, నవలా రచనకే మొగ్గు కనిపిస్తున్నది. కవితా ప్రక్రియను చేబట్టిన వారిలో కూడ చాలమంది

మౌలికంగా నవలాకారులే అయి ఉండడం విశేషం. కొద్దిమంది ప్రతిభాగరిష్ఠులైన విదుషీమణులు కూడ ఇటీవల కవితా వ్యాసంగాన్ని చేబట్టారు. రచయిత్రుల కవితలలో మాత్రం భావ ప్రాధాన్యత (Emotional element) కొరవడలేదనే చెప్పాలి. కవి వృషభులలో భావుకత కంటె సామాజిక స్పృహ ఎక్కువగా ఉంటున్నది - అది సహజంగా ఉండడం కూడ కాదు- వారు ప్రయత్నించి చొప్పించడం. ఇది ఇప్పుడిప్పుడే రచనలు చేస్తున్న యువ కవులలో వెర్రి తలలు వేసేంతవరకు కూడ వచ్చినది. ఇది ఆలోచించాల్సిన విషయం.

కవిత్వమంటే ఏమిటి, అది ఏ విధంగా అవిర్భవిస్తుంది అని ఆలోచించి చూస్తే, అది హృదయ స్పందనను వ్యక్తపరిచే ఒక భావం అని తెలుస్తుంది. 'Spontaneous overflow of over-charged feelings' అని కవితకు పాశ్చాత్యుల నిర్వచనం. అలాంటప్పుడు కవి కవనంలో సామాజిక స్పృహ ఉండి తీరాలనడం హాస్యాస్పదం. కవి సమాజంలో ఒక భాగం - అతని కవితలో సామాజిక స్పృహ ఉండటం తప్పనిసరి అనవచ్చు. కాని తానీ సమాజంలో ఒక భాగం అని ఆలోచిస్తూ ఏ కవీ కవిత్వం చెప్పడు. దానికి భిన్నంగా పోవాలని ఒక్కొక్కప్పుడు ప్రయత్నిస్తాడు. అదిగో, అలాంటప్పుడు వ్రాసిన కవితలలో సామాజిక స్పృహ ఉండకపోవచ్చు. అది లేనంత మాత్రాన ఆ కవిని బాధ్యతారహితునిగ, అతని కవిత్వాన్ని పనికిరానిదిగా భావింపరాదు. దీనికి ఒక ఉదాహరణ కీ.శే. దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు. నాటికీ, నేటికీ వారి కవిత ఆకట్టుకొన్నంతగా పఠితలను మరెవ్వరి కవిత ఆకర్షించలేదు. సామాజిక స్పృహ అనేది సహజంగా ఉండాలి,సహజంగా రావాలి కాని తెచ్చిపెట్టుకొన్నట్లుగా కాదు. కవిని, ఆ మాటకు వస్తే ఏ కళాకారుడినైనాసరే, స్వేచ్ఛగా వదిలేస్తే హృదయాన్ని స్పందింప జేయగల ఉత్తమ కళావిర్భావం జరుగుతుంది- గిరిగీసి నిలబెడితే పరిధిని దాటలేకఆతనిలోని, ఉత్తేజం అణగారిపోతుంది, లేదా కృత్రిమ రూపంలో వెలువడుతుంది. తన అనుభూతిని సరిగా వెలువరించలేని కవి అంతరంగం కల్లోల జలధి. అందులో కమ్మని కవితామృతం కాక మ్రింగుడు పడని హాలాహలం పుడుతుంది. ప్రాచీన కాలంలో కవులను ఛందోఽలంకార నియ

మాలతో, వ్యాకరణ సూత్రాలతో నియమిస్తే, ఆధునిక కాలంలో కవులను, సామాజిక స్పృహ, సమాజంపట్ల కవి బాధ్యత అనే అంకుశాలతో అనుక్షణం శాసిస్తున్నారు విమర్శకులు-ఉత్తమ కవితా సృష్టికి విఘాతం ఏర్పడుతున్నది.

విషయాన్ని సూటిగా చెప్తే అది శాసనం అవుతుంది. హేతుబద్ధంగా విమర్శిస్తే శాస్త్రమవుతుంది. లలితంగా సుందరంగా విమర్శిస్తే అది కవిత్వ మౌతుంది. ఆధునిక కవితలతో మాధుర్యం కాదుగదా, లాలిత్యం కూడ కరువై పోయింది, బజారులో నిత్యావసర వస్తువులలాగ. ఇక కవిత్వం అంటే నినాదం అనే రోజుకూడ వస్తుంది కాబోలు అనిపిస్తుంది. వస్తున్న మార్పులను చూస్తే బుద్ధితో ఆలోచించి బుద్ధితో వ్రాసే కవిత్వం బుద్ధిమంతులనే కదిలిస్తుంది కాని హృదయాన్ని కదిలించే శక్తి దానికి ఉండదు. ఆర్ద్రత లేనిది, అది ఉత్తమ కవిత్వం కానేకాదు. కనుక యువ కవులు, కవయిత్రులు నినాదాల కవిత్వమే కవిత్వం, ఆకలి అరుపులే సామ్యవాదం అని భ్రమపడక, అనుభూతి ప్రధానమైన కవితను ఆదరిస్తే మంచిది. రచయిత్రులలో ఈ ఆర్ద్రతా భావం బాగా కనుపిస్తుంది. అందమైన అక్షరాలు ఆనందపు కందరాలు (ఒక్క చిన్నదివ్వె) నందన బృందావనాలు, నాద కళా సుందరాలు, శారదా మందిరాలు ప్రధానమైన కవితను ఆదరిస్తే మంచిది. కావ్య ప్రయోజనాలు ఆనందం సందేశం.

ఇక్కడ ఒక విషయం బాధాకరంగా ఉంటుంది. అది కవితలపట్ల చదువరులకు ఆదరం లేకపోవడం. రచనా వ్యాసంగంలో గడిదేరినవారు కూడ కవిత్వాన్ని చులకనగా చూడడం. మన ఉద్దేశాన్ని సూటిగా, క్లుప్తంగా చెప్పడానికి కవితకన్న మించిన సాధనం మరొకటి లేదుగదా! నేటి కవితకు రచనారీతి సౌలభ్యం, స్పష్టమైన భావ ప్రకటన అవసరము. అది కొరవడినపుడు కవి ఏం చెప్పదలచిందీ పాఠకులకు అవగతం కాదు. అంతకన్న దౌర్భాగ్యం కవికి మరొకటి లేదు. ఈ విషయాన్ని ముమ్మందుగా గుర్తించి అర్థమయ్యే ఆధునిక కవిత్వాన్ని నవ కవులు వెలువరిస్తే మంచిది.

నేటి కవితా స్వరూప స్వభావాలను సమీక్షించాక మహిళలకు గల పాత్రను పరిశీలిద్దాము. మహిళలలో అటు రచయిత్రులకు, ఇటు పాఠకులకు

కూడ కథ, నవల ప్రధానమైన వ్యాసంగాలు. కవిత వాటి సమీపానికి కూడ రాలేకపోతున్నది. కారణాలు ఎన్నో ఉన్నా ప్రధానమైనది స్త్రీల మనస్తత్వం. వారు పురుషులవలె ఆవేశపడడం జరగదు. కవితకు, ఆవేశానికి కొంత అవినాభావ సంబంధమున్నది. ఆవేశపడటం జరిగినా స్త్రీలలో సంయమన శక్తి కొంత అధికం. అందువలన వారి ఆవేశానికి ఆలోచన జతపడుతుంది. అప్పుడు వివరంగా వారి అభిప్రాయాలు వెల్లడించడం జరుగుతుంది. విపుల రచనకు కవిత్వం కంటె ఇతివృత్తంతో కూడిన కథ, నవల ఎక్కువ అనుకూలం. అందుకే రచయిత్రులు కవితకన్న కథను ఎన్నుకుంటారనిపిస్తుంది. తమ అభిప్రాయాలను ఊహలతో మేళవించి వ్రాస్తున్నారు రచయిత్రులు. కవితలు పూర్వపు పద్య కావ్యాలవలె దీర్ఘంగా ఉండడానికి వీలులేదు. నేటి పాఠకుల అభిరుచిని బట్టి చూస్తే ఆ పద్య కావ్యాల ప్రముఖ స్థానాన్ని నేడు నవలలు ఆక్రమించాయి. చదువరులైన స్త్రీలు కవితల నాదరించకపోవడానికి మరో ముఖ్య కారణం - అందులో కథగాని, నిర్దుష్టమైన ఒక వస్తువుగాని లేకపోవడమే ననిపిస్తుంది. ఇక రచయిత్రులలో కూడ చాలమందిలో వ్యుత్పత్తికంటె ప్రతిభ, పాండిత్యం కంటె సృజనాశక్తి అధికం కావడం వలన కవితలకంటె నవలకే తమ ప్రతిభను కేటాయిస్తున్నారు. తాము చెప్పదలచుకున్న భావాలను తాముగా కాక తమ పాత్రలచేత పలికిస్తున్నారు.

అలా అని రచయిత్రులలో కవయిత్రులు అసలే లేరనికాదు. పూర్వ కాలంతో పోల్చిచూస్తే ఆధునిక యుగంలోనే కవయిత్రుల సంఖ్య అధికం. స్త్రీలలో విద్యావంతుల సంఖ్యకు తగినట్లు రచయిత్రుల సంఖ్యకూడ పెరిగింది. పెద్దగా భాషాపాండిత్యం లేని ఎందరో సోదరీమణులు చక్కని నవలలు వ్రాయ గల్గుతున్నారీనాడు. కవిత అనగానే పాండితీ ప్రకర్ష అవసరమనే అభిప్రాయంతో కాబోలు వీరిలో చాలమంది కవితా శక్తి కలిగి కూడ ఆ వ్యాసంగానికి దూరంగా ఉంటున్నారు.

ఆధునిక కాలంలోని కవయిత్రులలో ఎన్నదగిన వారు ఎందరో కలరు. డా. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ, డా. నాయని కృష్ణకుమారి, డా॥ పాకల

యశోదారెడ్డి, శ్రీమతి శారదా అశోకవర్ధన్, శ్రీమతి ఎ. లక్ష్మీరమణ, శ్రీమతి జ్యోతిర్మయి, శ్రీమతి దుర్గం తారాబాయి, యలమంచిలి తాయారు వీరిలో బాగా పేరు గాంచినవారు. ప్రచురించడానికి శక్తిలేని ఆసక్తిలేని రచయిత్రులు, కవయిత్రులు మరెందరో ఉన్నారు. కొందరి రచనలను మాత్రమే నేనిచ్చట సమీక్షించదలిచాను.

డా. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ గారి మన సాహితి - మధు భారతి మన తెలుగు సంస్కృతికి అద్దం పట్టిన రచన. వారి రచన కోమలం, భాష స్పష్టం. వారు తెలుగు భాషను గూర్చి—

'అందమెంతో, చందమంత
భావమెంతో, హావమంత
నాదమెంతో, హ్లాదమంత
రసమెంతో పసయునంత'—అని కీర్తించారు.

వారి కాంతి శిఖరాలు, మహిళా విక్రమ సూక్తము, కన్యకమ్మ నివాళి తప్పక చదువదగియున్నవి. కన్యకమ్మ నివాళిలో కూనలమ్మ పదాల ప్రభావం బాగా కనిపిస్తుంది. ఆధునికుల ధోరణిని వారిలా వ్యాఖ్యానిస్తారు ఒకచోట:

"పద్యకవితలు బూజు
పదకవిత్వమె మోజు
కథలు వ్రాస్తే ప్రైజు—ఓ కన్యకమ్మా"

అబల- బహుభావ శబల అను ఖండికలో స్త్రీ యొక్క బహుముఖాలను అలంకార యుతంగా పేర్కొన్నారు, ప్రాచీన పద్య కావ్యాలను చక్కగా అధ్యయనం చేసిన వీరిపై ఆ ప్రభావం ఎంతో కనిపిస్తుంది. డా. నాయని కృష్ణకుమారిగారి 'అగ్నిపుత్రి'లో నేనూ-సముద్రం అనే ఖండిక కోరిక యొక్క స్వరూపాన్ని తేటతెల్లం చేస్తుంది. వీరి కవిత సుస్పష్టం. కవయిత్రి అనుభవాలలో నుండి పుట్టినవే వారి కవితలు. 'నిత్య దుఃఖిత' అనే కవితలో బీదదైన మన భారత దేశం యొక్క అసలు స్వరూపాన్ని సాక్షాత్కరింప చేశారు వీరు.

'ఆవిడ గుండెల్లో ఉండీ లేనట్లు కునుకుతున్న
ఆశల చిరువత్తిని ఎగసనతొయ్యాలనుకుంటాను
ఆవిడ ముఖాన వెలుగుకోసం నేనే
కర్పూరంలా కరిగిపోతూ ఎఱ్ఱగా మండాలనుకుంటాను
ఇవన్నీ ఊహలు నా దేశాన్ని గురించి నాకిన్ని రిత్త ఊహలు''

అని తమ ఆవేశాన్ని, నిస్సహాయతను వెలిబుచ్చారు. 'కదులుతున్న అగ్ని' అనే ఖండిక ఊహాశక్తికి పరాకాష్ఠ. శ్రీమతి శారదా అశోకవర్ధన్ గారి 'శారదా కృతుల'లో భావ ప్రాధాన్యత కనిపిస్తుంది. 'వెన్నెలరాత్రి' ఖండిక ఇందులో మకుటాయమానం.

'ముళ్లు గుచ్చుకోకుండా గులాబీలు కోసుకోవాలి
చీకట్లు చిమ్మకుండా జీవితాన్ని దిద్దుకోవాలి"

అని 'మనిషిగా బ్రతకడం' అను కవితలో చెబుతారు వీరు. తెలుగు నేలలో వచ్చిన అలజడుల నుద్దేశించి ఇలా అంటారు:

'చిలిపిచేష్టల చిన్నవాడు చిచ్చుపెట్టాడు అమ్మ మదిలో
నా వాటా నాకిమ్మన్నాడు దద్దరిల్లింది తెలుగుదేశం
అదిరిపోయింది అమ్మ హృదయం'—అని. ఇది చక్కని

భావన. మన నిత్యానుభవంలో జరిగే ఒక ఘటన.

శ్రీమతి లక్ష్మీరమణగారి 'సూర్యముఖి'లో ఆర్ద్రత నిండుగా కనిపిస్తుంది. ఆ జంట అనే కవితలో వీరు "దానిమ్మ పండులో దాక్కున్న ఆ జంట పండు ఖాళీ చేసి వెళ్లిపోయింది'' అంటారు. కాపురమ్మొచ్చిన కన్నెపాపాయి ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయింది అన్న బసవరాజు అప్పారావు గారి గేయ ప్రభావం కనిపిస్తుందిచట. తన కవితను గూర్చి తానిలా వ్యాఖ్యానిస్తుందొక చోట:

'హృదయపు పోగుల ఆనందాలను, ఆవేదనలను
పదును పేకలుగా అల్లుతున్నానని అంటాను నేను.'

శ్రీమతి దుర్గం తారాబాయిగారి తారహారాలు సంఘంలోని అత్యాచారాలపై కురిసిన వడగళ్లు. తీవ్రమైన సామాజిక స్పృహ ఈమె కవితలలో ప్రతిఫలిస్తుంది. 'లోకం పోకడ'లో లోకం పోకడలను రెండు పదాలలో చెబుతారు వీరు.

'తన కూతురు విషయంలో కట్నం మాటెత్తవద్దు
కొడుకులకు పదివేలీకుంటే గడపకూడా తొక్కవద్దు.'
'పైవారి కాళ్లు పట్టుకుంటే పలుకుబడి దినదినానికి హెచ్చు
అప్పుడు కిందివాళ్ళ పిలకలు గుప్పిట్లో పెట్టుకోవచ్చు.'

ఇంత తీవ్రంగా వ్రాయగల ఈమెలో ఆర్ద్రత కూడ మెండుగానే ఉంది. 'పారిపోయిన పిల్లవాడు'లో తండ్రి అంటాడు: 'నిజంగా మనం కుక్కను పెంచుకుందాం. నేనే రాత్రుళ్ళు భోజనం మానేస్తాను-ఆ డబ్బు కుక్కకు పాలకు వెచ్చిస్తాను' అని. మధ్య తరగతి మానవులు తమ తీరని కోరికలతో ఎలా తల్లడిల్లిపోతారో! తప్పనిసరి పరిస్థితులలో ఆ కోరికల ఒత్తిడులకు ఎలా రాజీపడిపోతారో ఈ ఖండిక తెలుపుతుంది. గుండెను కదిలించే కవిత ఇది. 'ఇంకా పాపం పండాలి' అనే కవితలో సమాజంలో ఏర్పడిన అవకతవకలపై వీరి కసి బోధపడుతుంది. ఇంకా ఇంకా సత్యం ధర్మం అన్నవి సాంతం నశించిపోవాలి అని సమాజంలోని అసమానతలను, అన్యాయాలను పేర్కొని చివర 'రాక్షస రాజ్యం కావాలి, రాముడప్పుడే రావాలి' అనే కొస మెరుపుతో ముగిస్తారు. చివరివరకు నిరాశావాదం కనిపించి, ఈ కొసమెరుపుతో తిరిగి ఆశాభావం చిగురిస్తుంది.

కవిత శక్తిమంతమైన ఆయుధం కవులకు. ఒక నవల చెప్పదలచుకున్న సందేశాన్ని పదునైన పది మాటల కవితలో చెప్పవచ్చు ప్రతిభావంతుడైన కవి. ప్రజలలో చైతన్యం కలిగేటట్లు వ్రాయగలగాలి కవి. వారిలో ఉత్తేజాన్ని మేల్కొల్పాలి. తాను స్పందించడము కాదు, వారిలో తన భావాలకు తగిన స్పందనను కల్పించాలి. ఈ దృక్పథంతో, సమాజాన్ని సంస్కరించాలనే చిత్తశుద్ధితో వ్రాసిన కవిత్వం తప్పకుండ సమాజంలో అభ్యుదయాన్ని తీసికొని వస్తుంది. నిరాశా, నిస్పృహలు కారుమేఘాల వలె క్రమ్ముకుంటున్న ఈ తరుణంలో ఆశావాదం, చైతన్యస్ఫూర్తి అనే ప్రచండ పవనాలు వీచేటట్లు చేసే బాధ్యత కవులదే. మహిళలు ఈ అవసరాన్ని గుర్తించి తమ కలాలను కవితా సస్యాలను పండించడానికి ఉపయోగించాలి.

# నేటి మహిళలు - కవిత

శారదా అశోకవర్ధన్

సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్
ఏక మాపాత మధురం అన్యదాలోచనామృతమ్.

అన్నట్టు, గేయం, గీతం సమానార్థకాలే! పాడునది గీతం, లేదా గేయం. అంటే గాన యోగ్యమైన రచన గేయం, అన్నమాట. అది కవితా గంధబంధుర మైనప్పుడు, గేయ కవిత్వ మవుతుంది. సంగీత, సాహిత్యాలు సమపాళ్లలో నున్నప్పుడు, గేయ కవిత్వం, ఆపాతమధుర మేకాదు; ఆలోచనామృతం కూడా! 'కవిత్వానికి ఆపాతమాధుర్యం గానంవల్ల సిద్ధిస్తుంది. కవిత్వానికి గాన గుణం స్వాభావికమైనది. పాట ఆవేశానుభూతుల సమాహారాన్ని వ్యక్తీకరించ గల సామర్థ్యం కలది. అది ఒకే శృతిలో పాడేది' అని క్రిస్టోఫర్ కాడ్వెల్ 'ఇల్యూషన్ అండ్ రియాలిటీ' అనే పుస్తకములో, 'బర్త్ ఆఫ్ పొయట్రీ' అనే చాప్టర్‌లో చెప్పారు. కవిత్వం శ్రవ్యకళ. శ్రవ్యత ఛందస్సు వల్ల చేకూరుతుంది. ఛందస్సుకి నిత్యంగా ఉండవలసిన ధర్మం శ్రవ్యత. ఛందస్సుకి ఆంగ్లములో 'ప్రోసోడి' అని వాడుక.

అంటే, గేయాత్మకత, గాన యోగ్యత అని అర్థం. గానము, త్రాణము గాయత్రి లక్షణాలు! ఛందస్సును గాయత్రిగా చెప్పడంవల్ల ఛందస్సు తత్వము గేయత్వమని చెప్పవచ్చును. గానంవలె శృతిరమ్యమైన అక్షరబంధాన్ని ఛందస్సు అని భావించవచ్చును. ఛందస్సులో అక్షర ఛందస్సు అని, మాత్రా ఛందస్సు అని, రెండు ప్రధాన భేదాలు గోచరిస్తాయి. అక్షర ఛందస్సులు పఠన యోగ్యాలైతే, మాత్రా ఛందస్సులు గాన యోగ్యాలు. భరతుడు ఈ విషయాన్నే నాట్యశాస్త్రంలో చెప్పాడు. కనుక మాత్రా ఛందస్సు రూపంలో ఉన్న కవిత్వాన్ని గేయ కవిత్వమని భావించవచ్చును.

సంగీతాత్మకమైన ఆలోచన కవిత్వం. లయబద్ధమైన సౌందర్యసృష్టి కవిత్వం. ఛందోబద్ధమైన రచన కవిత్వం. ఛందోమయ భాషలో భావన, ఆలోచన, అనుభూతి - వీటి సముచిత వ్యక్తీకరణం వల్ల, ఆనందం పుట్టించే కళ కవిత్వం అన్నారు.

ఇటువంటి రస సృష్టి చేయడానికి బూనుకున్న మహిళామణులు నిజంగా అదృష్టవంతులు. స్త్రీలు కవితా రచనలకు పూనుకోవడం చాలా తక్కువ. ఈ గత యాభై సంవత్సరాల నుంచి కనిపిస్తున్న కొందరు కవయిత్రుల గురించి వివరిస్తాను. తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు, సౌదామిని - (ఈమె అసలు పేరు, బసవరాజు రాజ్యలక్ష్మి, బసవరాజు అప్పారావుగారి భార్య) చావలి బంగారమ్మ గారూ, ముగ్గురే దాదాపు పంథొమ్మిది వందల ముప్పై, నలభై, ఆ ప్రాంతానికి చెందిన కవయిత్రులు అని చెప్పవచ్చును.

తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు, పశ్చిమ గోదావరి జిల్లా ఉండి గ్రామంలో 1900 వ సం॥లో జన్మించారు. భర్త నరసింహశర్మగారితోపాటు బ్రహ్మ సమాజంలో సంఘ సంస్కరణోద్యమంలో పని చేశారు. 1921 నుంచి భర్తతో పాటు, కాంగ్రెసులో ప్రచారం చేశారు. 1930 జాతీయోద్యమములో జైలుకు వెళ్లారు. చాగల్లు గ్రామంలో 'ఆనంద నికేతనం' అనే ఆశ్రమం, భర్తతో కలిసి స్థాపించి, అస్పృశ్యతా నివారణకు కృషి చేశారు. అందరాని ఊహలను ఆశించే వ్యక్తి ఈమె. అందుచేతను భావ ప్రపంచం సరిహద్దులు దరికి మాత్రం తీసుకుపోతవి ఈమె గీతాలు. ప్రతి గీతంలోనూ, అవ్యక్తంగానైనా, ఒక వేదన గుండె చురుక్కుమన్న కోకిల కేకవలె ధ్వనిస్తుంది.

ఉదాహరణకి, 'ఒకరికొకరు' అనే గేయం :

నువ్వు నేనూ కలిసి
పువ్వులో తావిలా
తావిలో తలపులా !
నువ్వు నేనూ కలిసి

కోకిలా గొంతులా
గొంతులో కోర్కెలా
నువ్వు నేనూ కలిసి!
వెన్నెలా వెన్నలా
వెన్నలో వెలుగులా
నువ్వు నేనూ కలిసి!
నింగిలో నీడలా
నీడలో నిదరలా! - అంటూ వ్రాసిన గేయం.

'స్నేహ రుచి' అనే మరో గేయంలో స్నేహగుణం యొక్క కమ్మదనాన్ని గురించిన వర్ణన కనిపిస్తుంది.

చావలి బంగారమ్మగారు, 1897 లో జన్మించారు. మరణం 1960 లో. తెలుగు పుట్టింటి నుడికారం ఈమె గీతాలలోని ప్రత్యేక కమ్మదనం. తెనుగు కడుపున పుట్టి, చేవదేరిన నుడికారం ఈమె భాష పోకడలలోనూ, తాటాకు బొమ్మలకు ప్రాణం పోసి, కన్నబిడ్డగా చంకకు ఎత్తగలిగిన పసినాటి తెలుగు భావన, ఈమె ఊహా వీధిలోనూ, అగుపించడమేకాక, ఇంకా ఈమె ఊహా ప్రపంచంలో ఎంత గారడీ వున్నదో ఆనందించవలెనంటే ఉదాహరణకు, 'ఆ కొండ' అనే గేయంలోని చోద్యాన్నిబట్టి గ్రహించవచ్చును.

### ఆ కొండ

మంచులో మునిగింది
మాయమైపోయింది
ఆకాశమున గలసెనో - ఆ కొండ
అక్కడే పడి వుండెనో
తెలు లోపల నేను
రాబోతు వున్నాను

నను జూసి వెనుదిరిగెనో ఆ కొండ
నైజమే అటులుండెనో
చలియన్న జడవదే
పులియన్న వెరవదే,
మలయానిలుని దాచునే ఆ కొండ
మంచుకొండనిపించునే.

అంటూ తాచూచిన కొండని అద్వితీయంగా వర్ణించింది ఈమె. 'కప్ప తల్లి పెళ్లి' అనే గేయం అత్యంత మనోహరంగా వుండి హాయిగా నడిచిపోతుంది.

'కప్ప తల్లీ పెళ్లి నేడూ, చూడరే
కావెళ్ల నీళ్లంపినాడు,
వరుణ దేవుడు పంపినాడూ, ఓ చెలీ
వాడలన్నీ నింపినాడూ'

అంటూ చక్కగా పాడుకునే ధోరణిలో రచించివటువంటి గేయం యిది. అలాగే 'కార్తీక పూర్ణిమ' అనే గేయంలో ఒక చోట, ఈమె వేసిన ఉపమానం, ఎంతో రమ్యమైనది. 'గాలులు వీస్తున్నాయి', 'మబ్బులు సాగుతున్నాయి' అని చెప్పడానికి ఈ 'గాలి ఉయ్యాలలై కదులుతుండెడి మబ్బు' అని చెబుతుంది. ఎంత మధురమైన భావన !

'సౌదామిని' : ఈమె అసలు పేరు బసవరాజు రాజ్యలక్ష్మి. బసవరాజు అప్పారావుగారి సతీమణి. 1904 లో విజయవాడ వద్ద 'పటమట' గ్రామములో జన్మించారు. గుంటూరు శారదా నికేతనంలో 14 ఏండ్లు మేనేజర్‌గా పని చేశారు. వార్ధా మహిళాశ్రమంలో, మహాత్ముని వద్ద మూడేండ్లు శిక్షణ పొంది, సత్యాగ్రహంలో పాల్గొని జైలుకు వెళ్ళారు. మద్రాసు దక్షిణ హిందీ ప్రచార సభలో, మహిళా విద్యాలయం వార్డెనుగా ఉండి, హిందీ ప్రచారం చేశారు. అరవం, కన్నడం, గుజరాతీ, హిందీ, బెంగాలీ, మహారాష్ట్రం మొదలైన భాషల్లో బాగా

పరిచయం వుంది. కడు సున్నితమూ, మహా గంభీరము ఈమె హృదయము. నిరాడంబరానికీ, స్వచ్ఛతకూ ఈమె గీతాలు గొప్పవి. ఒక్కొక్క గీతం, ఒక్కొక్క హృదయ స్పందనం. సంతానంకోసం పరితపించి, ఎన్నో మొక్కులు మొక్కి, నోములు నోచి చివరకు కలిగిన సంతానం, ఇరువురు బిడ్డలను దక్కించు కోలేక పోగొట్టుకొన్నప్పుడు 'దురదృష్టం' అనే ఒక గేయం రాశారీమె. ఆ గేయం చదువుతూంటే, గుండె కరిగిపోతుంది. గుండెలోని బాధనంతా ఒక చోట మూటగట్టి కుమ్మరించినట్టనిపిస్తుంది.

తరువాత కవయిత్రి, కళాప్రపూర్ణ, ఆంధ్ర సరస్వతి, డా॥ ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు. ఈమె మధుర కవి నాళం కృష్ణారావుగారి పుత్రిక. 1917 లో రాజమండ్రిలో జన్మించారు. భర్త శ్రీ ఊటుకూరి హయగ్రీవగుప్త బాపట్లలో న్యాయవాదవృత్తిని చేబట్టారు.

'భాషా ప్రవీణ' గా 'తెలుగు మొలక' గా, 'విద్వత్కవయిత్రి' గా, 'బ్రాహ్మ్మ భూషణ'గా, 'సాహితీ రుద్రమ'గా, 'ధర్మ ప్రచార భారతి'గా సారస్వ తేయుల ప్రశంసలందుకున్నారు. ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు ఆమెను 'కళా ప్రపూర్ణ' బిరుదముతో సత్కరించింది.

1953 లో తెలుగు భాషా సమితివారి బహుమానము, గృహలక్ష్మి పత్రి కాధిపతుల స్వర్ణకంకణాలంకారము, కవిత్రయ జయంతి, మొల్ల జయంతి వారల సన్మానములు, తెలుగు ప్రపంచ మహాసభల సన్మానము, చెన్నపురి ఆంధ్ర మహా సభ వారొనర్చిన సత్కారాలూ, సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యత్వమూ, ఆమె వీణావాదన వైశద్యానికి, వక్తృత్వ శక్తికి మెచ్చి ఇచ్చిన స్వర్ణ పతకాలూ ఇంకా అనేకములైన బహూకృతులను పర్యావలోచనం చేస్తే, ఈ శతాబ్దంలో, శ్రీమతి లక్ష్మీకాంతమ్మ గారికి తప్ప, ఇన్ని ఘన సన్మానాలు, ఏ మహిళా రచయిత్రికీ లభించలేదని అనుకోవచ్చు. రచయిత్రిగా, కవయిత్రిగా, విదుషీమణిగా, మనస్వి

నిగా, కార్యదీక్షా దక్షురాలిగా ఆంధ్రోద్యమ, మహిళోద్యమ, సత్యాగ్రహోద్యమ, సాహిత్యోద్యమ, ధర్మ ప్రచారోద్యమములలో ప్రముఖ పాత్ర వహించిన శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారిని ఆంధ్రదేశానికి పరిచయం చేయడమంటే దివ్వెతో సూర్యుణ్ణి చూపినట్లే అవుతుంది. ఈమె రచనలు 'ఆంధ్ర కవయిత్రులు', 'అఖిల భారత కవయిత్రులు' 'శ్రీ కన్యకా పరమేశ్వరి సుప్రభాతము', 'దేవీ స్తవ తారావళి' 'జాతి పిత' 'మన సాహితి, మధు భారతి' 'కాంతి శిఖరాలు' 'కన్యకమ్మ నివాళి' 'మహిళా విక్రమ సూక్తము', 'సదుక్తి మంజరి', 'లజ్జాకిరీట ధారిణి', 'ఒక చిన్న దివ్వె' మొదలగునవి.

హిందీ భాషను పునీతం చేసిన సంతకవుల సూక్తులను, గీతానువాదంగా అమర్చి, తెలుగువారికి 'సదుక్తి మంజరి' ని ప్రదానం చేసింది. 'మన సాహితి-మధు భారతి' అను పేరుతో, తన జాతీయ సంస్కృతిపై గల ఎనలేని అభిమానమును అక్షరగతం చేసింది. 'కన్యకమ్మ నివాళి' వంటి కూనలమ్మ పదాలతో సరితూగు రచనలు చేస్తూనే, ప్రాచీనాలంకారిక శాస్త్ర లక్షణ లక్షితములైన ఛందోమయ కావ్య ప్రసూనాలను, 'లజ్జాకిరీట ధారిణి' అన్న మకుటం క్రింద వెలువరించి, ఆంధ్ర సాహితేయుల హస్తగతం చేసింది. వివిధ శీర్షికల క్రింద రచించిన పదిహేడు గేయముల కుసుమ గుచ్ఛము 'ఒక్క చిన్న దివ్వె' అను గ్రంథము. నిరాశా హత చేతస్కుడి భుజం తట్టి చెప్పిన ఒక్క చిన్నవాక్యం. నిరీహతో మసలుతున్న తరుణంలో పలికే ఒక్క ఉత్తేజకరమైన మాట, అజ్ఞానాంధకారంలో దారి తెరువు కనబడని వేళ ప్రసాదించిన ఒక్క కర దీపిక ఎట్టి మహోపకారం చేస్తయ్యో తెలుసుకున్నప్పుడు, 'ఒక్క చిన్న దివ్వె' యొక్క ప్రాధాన్యం తెలుసుకోవచ్చును అన్నారు, ఆ పుస్తకానికి పీఠిక వ్రాసిన శ్రీ జి.వి. జ్వాల నరసింహశాస్త్రి. ఇది అక్షరాలా నిజం. కాంతి శిఖరాలు అన్న ఖండ కావ్యంలోని గీతాలు హాయిగా గొంతెత్తి పాడుకోవడానికి అనువుగా ఉన్న అమృత గుళికలు. ఈమె కృతులు తెనుగు కవితా తోటను పరిమళింపచేయు అతి మనోహరమైన సుందర పుష్పాలు.

తెనుగు తోటలో విరిసిన మరో గేయ కవయిత్రి శ్రీమతి గంగరాజు సుశీలాదేవి. ఈమె కలం నుండి జాలువారిన కవితా ఖండికలు ఎన్నో ఉన్నాయి. ముఖ్యంగా 'ఆర్ద్ర హృదయం' అనే గేయ సంపుటి ఒక్కొక్క ముత్యాన్ని ఏరికోరి తీర్చిదిద్దిన మాలవంటిది. 'హిమగిరి శిఖరాల నుండి' అనే గేయం నుంచి 'సృష్టి లీలల వరకూ', మరే కాలం గురించి 'మరలదూ నా మనసూ' అంటూ రచించిన గేయాలు ఆణి ముత్యాలు. ప్రతి గేయంలోనూ ఈమె 'ఆర్ద్ర హృదయం' తొంగి చూస్తూనే ఉంటుంది.

తెలుగు కవితా తోటను విస్తరింపజేసి, మరిన్ని సుందర సుమధుర పరిమళ సుమగుచ్ఛాల నందించిన కవయిత్రి శ్రీమతి శారదా అశోకవర్ధన్. ఈమె రచనలు ఆకాశవాణి ద్వారా, వివిధ పత్రికల ద్వారా, సుపరిచితమే. 'శారదా కృతులు' 'భావరాగిణి' అనే గేయ సంపుటాలతోపాటు సుషుప్తి నుంచి మేలుకో' అన్న వచన కవితా సంపుటీ 'అన్వేషణ' 'వెంకన్న కాపురం' 'మల్లి మాట' 'పాత పండగేనా ?' అన్న సంగీత గేయ రూపకాలు కూడా ఎన్నో ప్రసంసలనందుకున్నాయి. ఈ సంపుటాలలోని వస్తువైవిధ్యం గమనించదగినది. 'మాధవగీతాలు' 'శివస్తుతులు' 'కలికిపాటలు', 'కార్మిక గీతాలు', పండగ పాటలూ, పడుచుదనం కలబోసుకున్న పలురకాల పాటలు, ఈ సంపుటాలలో పలుకరిస్తాయి. ఈమె కవిత్వం మనిషిని జాగృతి వైపుకి నడిపిస్తుంది. శారద వేళలవలె చల్లగా వుంటూనే, గుండెల్లో గ్రీష్మతాపాన్ని కురిపించి, నిద్ర లేపుతుంది. ఈమె రచించిన, గణేశ్ సుప్రభాతం, పద్యాలు తేటగీతిలో సాగిపోయినా, పాటగా పాడుకోవడానికి అనువుగా వున్నాయి.

వృత్తిరీత్యా ఇంజనీరు. కాని కవిత్వాన్ని చేబట్టిన కుమారి జె. సుబ్బలక్ష్మి గారు 'విజయ చంద్రహాసం' అనే అమూల్యమైన పద్యకావ్యాన్ని ప్రచురించారు.

భావకవితల గేయకవితల, పొరనుంచి బయటపడితే, అగుపిస్తుంది అభ్యుదయ కవితా పీఠం. జీవిత వాస్తవాన్ని చైతన్యవంతంగా అవగాహన

చేసుకుని, సాహిత్య రూపంగా లోకానికందివ్వడానికి, ఉపకరించే ప్రథమ సాధనం అది. వచన కవిత్వం. అందులో నిష్ణాతులు శ్రీమతి నాయని కృష్ణకుమారి గారు. వీరి అపూర్వ సృష్టి అగ్ని పుత్రి. వీరు వృత్తిరీత్యా ఉస్మానియా విశ్వ విద్యాలయంలో ఉపాధ్యాయిని. ప్రవృత్తిద్వారా, చక్కని కవితలల్లే కవయిత్రి. ఇందులో కూడా ఊడలమర్రి అన్న కవితలో మొదటి ఏడెనిమిది పంక్తుల్లో గేయలక్షణం అగుపిస్తుంది. 'ఊ...నీడలు పరచిన ఊడల మర్రికి. తోడుగనిచ్చె పక్షుల గుంపులు' ఇలా సాగుతుంది, రచనాగేయ ధోరణిలో.

మరో ఉత్తమ కవయిత్రి శ్రీమతి ఎ. లక్ష్మీరమణగారు. శ్రీమతి లక్ష్మీ రమణ ప్రధానంగా హృదయవాదిని. ఆమె కవితలకు అనుభూతి ఊపిరి. ఆవేశం జీవం. ఆమె కవితలు అనుభూతులకు అక్షరాకృతులు. ఆ ఆకృతులకు సంకల నలే ఈమె రచనలు, 'సూర్యముఖి' 'స్నేహచిత్రాలు' ఈమె కవితలు. వచన రచనలు కవితలే. కానీ వాటిలోనూ అక్కడక్కడ గేయరచనా స్వభావము అగుపడుతూ వుంటుంది. ఉదాహరణకు, సూర్యముఖిలోని—

నను గూడ నీ వెంట కొనిపోవె ఓడా !
అంతులేని కడలి అంచులను చూడ !

అంటూ రాసిన ఈ కవితలో లయ, తాళం అగుపిస్తాయి. ఇలాగే, 82 కవితలున్న ఈ సంకలనంలో, అక్కడక్కడా గేయ రచనా స్వభావం గోచ రిస్తుంది. ఈమె కవితలలోని ముగ్ధభావుకత ముచ్చటగొలుపుతుంది.

'సిగ్గు దొంతరల పెళ్లికూతురుకు ఎఱ్ఱని గాజులు ఎంతో అందం,
సింగారంగా సీమంతానికి, పచ్చని గాజులు పెడితే అందం,

అంటూ, ఇంపుగా, సొంపుగా సాగుతుంది రచన.

అభ్యుదయ కవితా వనంలో వెలసిన చేయి తిరిగిన మరో కవయిత్రి శ్రీమతి జ్యోతిర్మయి. అందరికీ అర్థమయ్యే రీతిలో, తన భావాలను సూటిగా చెప్పగలిగిన నేర్పుగల ఈమె రచనలు 'దీప్తి' 'భావన' వివ్వెలు భావనలో గేయ స్వరూపం చాలావుంది.

'నే మీటిన విపంచి తంత్రుల్లో
శతకోటి రాగాలు పలికాయి,
నా వీనుల సోకిన గాలులలో
పులకింతల పలుకులు కదిలాయి'

ఈ పంక్తులు రాగయుక్తంగా, సరిగమలు పలికిస్తాయి. దివ్వెలు బాల గేయాల సంపుటి.

'దివ్వెలు దివ్వెలం దీపావళి దివ్వెలం
చీకట్లను మరిపించే కాంతిపూల మాలలం'

ఇవి దివ్వెల పలుకులు, దీప్తి వచన కవితాసంపుటి. ఇక జంధ్యాల సుబ్బలక్ష్మి. ఈమె వృత్తిరీత్యా ఇంజనీరు. ప్రవృత్తి కవితాలోకానికి సోపానాలు వేసింది. ఛందోబద్ధంగా కవితలల్లి, పలువురి ప్రశంసల నందుకుంది. ఈమె కలంనుండి వెలువడిన కవితామాలిక 'విజయచంద్రహాసం'. వాసా ప్రభావతి శాస్త్రి గారు 'ఆలాపన' అనే వచన కవితా సంపుటాన్ని ప్రచురించారు. ఆకర్షణీయమైన కవితా సంపుటాన్ని ప్రచురించాలని, మినీ కవితలు సయితం ఇందులో చోటు చేసుకున్నాయి. అలాగే శ్రీమతి గాలి ప్రభావతిగారు, బుద్ధరాజు సులోచనగారు, చోడవరపు సత్యవతిగారు, వాణి రంగారావుగారు కూడా ఎన్నో చక్కని కవితలు రాసి ప్రజల హృదయాలలో చోటు చేసుకున్నారు. చోడవరపు సత్యవతి దేవిగారి ఆవకాయ కవిత్వం, వింటూంటేనే నోరూరిస్తుంది.

ఇంకా ఎందరో మహానుభావులు, అందరికీ నావందనాలు, ఈ నా వ్యాసంలో ఎవరినైనా నేను పేర్కొనడం జరగకపోతే, క్షమించగోరుతున్నాను. అది కేవలం నా దృష్టికి రాకపోవడం వల్లనేకానీ, మరే కారణము చేత కాదని సవినయంగా మనవి చేస్తూ, సాహిత్య అకాడమీ వారికీ, స్పందన సాహితీ సమితి వారికి కృతజ్ఞతలు తెలుపుతూ సెలవు తీసుకుంటున్నాను.

# నేటి కవిత-మహిళలు

డా॥ ముక్తేవి భారతి

నేటి కవిత - మహిళ అనే అంశాన్ని చర్చించబోయేముందు నవ్యకవితా రీతుల్ని సంక్షిప్తంగా తెలియజేయటం అవసరం. ఇరవయ్యో శతాబ్దిలో వచ్చిన కవితోద్యమాలలో ముఖ్యమైనవి భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం. నవ్య కవిత్వ లక్షణాలలో ముఖ్యమైనవి ఖండకావ్య ప్రక్రియ, ఆత్మాశ్రయరీతి, వస్తు, భావ, శైలీ, ఛందోనవ్యతలు. భావకవులు స్వేచ్ఛా ప్రియులు. సంప్రదాయాన్ని తిరస్కరించటం, అన్నిటా నవ్యత కోరటం పరిపాటి అయింది. ఈ విధమైన భావ కవిత్వం 1930 వరకు బాగాసాగింది. కానీ ఇందులో ఆత్మవ్యక్తీకరణంఎక్కువై, సాంఘిక దృక్పథం వెనకపడే సరికి, ఒక విధమైన తిరుగుబాటు అవసరమైంది. దాని రూపమే అభ్యుదయ కవిత్వం, పెట్టుబడిదారీ విధానాన్ని కూలదోయటం, వర్గరహిత సమ సమాజాన్ని సృష్టించటం దీని లక్ష్యం. దీనితోపాటు అన్నిటా నవ్యత మరోలక్ష్యం. భావకవితా యుగంలో వచ్చిన అన్నిరకాలైన నవ్యతలూ కొత్తరూపాన్ని సంతరించుకున్నాయి. ముఖ్యంగా ఛంధస్సులలో.

"నా ఈ వచనపద్యాలనే దుడ్డుకర్రలతో
పద్యాల నడుములు విరగితంతాను"

అన్న పఠాభి పలుకుల్ని ఇక్కడ గుర్తు చేసుకోవాలి.

ఇక్కడ వచనగేయం మొదలైంది. ఈగేయం మాత్రా ఛంధస్సులలో శబ్ద లయ, సంగీత లయ ముఖ్యంగా వుండేది. మాత్రాచంధస్సుల నియమమే కాకుండా మాత్రాఛందస్సులగతి కూడా లేకుండా నిలిచేది వచన గేయం. దీంట్లో ముఖ్య మైంది అంతర్లయ. ఇది పదాల విరుపు. కాకువు, ఊనిక వల్లవచ్చేది. అనవస

మైన శబ్దార్భటి లేకుండా, చెప్పదలచుకున్న దాన్ని సూటిగా గుండెల్లో గుచ్చు కునేట్లు చెప్పటం వచన గేయలక్షణమైంది.

ఈ అభ్యుదయ కవిత్వంలో కూడా అతినవ్యతా ధోరణులు బయల్దేరడం, అంతతో ఆగక క్షీణిస్తున్న విలువలపై తిరుగుబాటు తత్వం బయల్దేరటం జరి గింది. విప్లవ కవిత్వం తర్వాత దిగంబర కవిత్వంతో కవిత మరో మలుపు తిరిగింది.

ఇవన్నీ చెప్పటంలో ఉద్దేశం కవితారూపాల క్రమవికాసాలను చూపించి, నేటి కవితను చేపట్టిన మహిళల కవితను విశదీకరించటం మాత్రమే.

కవిత చెప్పిన కాంతామణులు అలనాటి చానమ, ప్రోలమలతో మొదలైనా, ఆధునిక యుగం వరకు కేవలం వేళ్ళమీద లెక్కించే వారుగా మాత్రమే మిగిలారు. అయినా కవిత చెప్పిన మహిళల సంఖ్య కొంత పెరుగుతున్నా విస్తృతం ఇంకా కాలేదు.

సంప్రదాయబద్ధమైన పద్యం, భావ కవిత్వంలో వచ్చిన గేయం, అభ్యు దయ కవిత్వంలో వచ్చిన వచన గేయం- ఈ మూడు శాఖల్ని తీసుకుని మహిళల కవితా స్థాయిని గుర్తించే ప్రయత్నం చేస్తున్నాను. ఆధునిక యుగంలో ఎంతగా గేయకవిత ప్రబలినా, పద్యకవిత చేపట్టిన వాళ్ళున్నారు.

'దివ్యవసంతలక్ష్మి' అనే పుస్తకం 1967 లో ఉల్లగంటి సౌభాగ్యవతిగారు ప్రచురించారు. ఇందులో విశేషం ఒకటి—వృత్తాలు, సీసాలు, ఆటవెలది మొద లైనవి రచించటమే కాకుంగా, ఒకటి రెండు గేయరచనలు చేశారు. అవి యువ కవిని ప్రోత్సహిస్తూ, పద్యము గద్యము కాని ఈ గేయంఏమిటో వివరించారు.

సత్యం, ధర్మం సద్భావలలోన
పొంగుచు పొర్లే యత్నంచేయి
అపుడే నీవు నవకవి వౌతావ్
అపుడే నీవు యువకవి వౌతావ్

ఇది పద్యంకాదు గద్యంకాదు
మధ్యయిరికిన పద్యం కాని గద్యం (P. 137)

ఈ రకమైన రచనచేసి నవ్యతని ఆహ్వానించారు.

హైమవతి, కావ్యనికురంబము. అనే దర్భా భాస్కరమ్మగారి రెండు రచనలూ చాలా సామాన్యమైనవి. అయితే కావ్యనికురంబంలో అబలా అభ్యుదయ మనే పేరిట కొన్ని పద్యాలున్నాయి. ఇందు స్త్రీవిముక్తి కోరుతూ అభ్యుదయ భావపరంపరలు నింపారు. భావనవ్యత ఇందులో విశేషం.

అగును గాయనిగానమ్ము మగనికొరకె
అగును కవయిత్రి కవనమ్ము మగనికొరకె
తగదు సభలందు వాని ప్రదర్శనమ్ము
అనెడి యల్పవృత్తులు చనుటలేదు
అబల కభ్యుదయంబేది యవనినింక (P. 86)

అంటూ వాపోయారు. ఛందస్సులలో ఆధునికత అంగీకరించక పోయినా భావంలో ఆధునికత అంగీకరించారు.

కొలకలూరి స్వరూపరాణిగారి గంగావతరణ శివతాండవ ద్విపద గూర్చి ఇక్కడ ప్రత్యేకంగా చెప్పాలి. ఇక్కడ వస్తునవ్యత, ఛందోనవ్యత లేవు. కాని దృక్పథంలో నవ్యతే ముఖ్యం.

"ఒక శ్రీమంతుని దయాధర్మాలు నిలుచుటకు నిర్భాగ్యజీవులు నివసించే సమాజము కాదు మనకి కావలసింది. అందరికీ సమాన స్వామ్యము, సమాన ప్రాతినిధ్యముగల యొక వర్గము - అట్టి నవ సమాజమును నిర్మించుకొనుటకు శివోహం అంటూ ఉద్యమంలోకి ఉరకాలంటే మనో నేత్రముతో శివతాండవమే దర్శించాలి'' అంటారు. నవ సమాజం, సమ సమాజం కోరటం మార్క్సిస్టు సిద్ధాంతం. అంటే స్వరూపరాణిగారు పురాతన సిద్ధాంతాల పునాదిరాళ్ళలోంచి అధునాతన ప్రగతి సూత్రాలు పైకితీసే కవిత చెప్పారు.

కళాప్రపూర్ణ డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు రచించిన లజ్జాకిరీట ధారిణి అనే పద్యకృతిలో భారత మహిళ లజ్జాకిరీటధారిణియై, భారతజాతి ఔన్న త్యానికి నిలయమైందని తెల్పారు. ఆధునిక కవితా ప్రక్రియమైన ఖండకావ్య ప్రక్రి యను చేపట్టారు. ప్రక్రియా నవ్యత, భావనవ్యత ఇందులో ప్రత్యేకతలు— ఇంతవరకు ఆధునిక యుగంలో పద్యకవితలల్లిన మహిళలను గూర్చి ప్రస్తా వించాను.

భావకవిత్వం రాసిన మహిళల సంఖ్య ఎక్కువగానే వున్నా, అందులో త్రిరత్నాలుగా పేరొందిన వారిని ముఖ్యంగా పేర్కొనాలి. 1935లో ముద్దుకృష్ణ గారి వైతాళికులు అనే సంకలనంలో తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు, బసవ రాజు రాజ్యలక్ష్మి, చావలి బంగారమ్మగార్ల కవితలున్నాయి. వీరు గేయకవితా శాఖని చేపట్టినవారు. విశ్వసుందరమ్మగారు దేశభక్తురాలు. వీరేశలింగంగారి సంఘసంస్కరణోద్యమంలో పాల్గొన్నవారు. వీరి కవితలన్నీ 1920-49 మధ్య రాసినవే. అవి కవితాకదంబము అనే పేరుతో ప్రచురింపబడ్డాయి. వీటిల్లో దేశ భక్తి, ప్రకృతిపై ప్రీతి, ప్రణయగానం, ఆత్మాశ్రయత్వం అనే భావకవితా లక్ష ణాలన్నీ భాసించాయి.

స్వాతంత్ర్యకృషి అనే గేయంలో-

''కులములని పోరాడుకుంటే
కూటికగునా గుడ్డకగునా
బలమదంతయుపోయి దైన్యము
పాలబడుదుముగా'' అన్నారు.

ఈ కదంబంలో వున్న గేయాలెన్నిటినో ఆనాటి యువకులు వరుసలుకట్టి పాడుకొనేవారని, చెప్తారు చాలామంది.

గేయకవిత్వంలో ప్రధానమైనవి లయవిన్యాసం, గతి చమత్కారం. గేయ రచన చేపట్టిన మహిళలు కొందరున్నారు. జ్యోతిర్మయిగారి దివ్వెలు, శారదా అశోకవర్ధన్‌గారి భావరాగిణి ముఖ్యమైనవి. భావరాగిణిలో 91 గేయాలున్నాయి. అన్నిటా వస్తువైవిధ్యం గమనించతగ్గది. కార్మిక గీతాలు, పండగ పాటలు, భక్తి గీతాలు ఎన్నో వున్నాయి.

కవితా సంపుటాలు ఈ యుగంలో చాలా వచ్చాయి. డా॥ నాయని కృష్ణ కుమారి గారి అగ్నిపుత్రి, డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారి ఒక్క చిన్నదివ్వె, దుర్గం తారాబాయి తారహారాలు, లక్ష్మీరమణగారి సూర్యముఖి, జ్యోతిర్మయిగారి భావన, శారదా అశోకవర్ధన్‌గారి సుషుప్తినుంచి మేలుకో మొదలైనవి ఎన్నెన్నో. ఈ కవితలు చాలవరకు అభ్యుదయ కవితలే.

'జాతిని జాగృతం చెయ్యకపోతే
నవతరాన్ని సృష్టించకపోతే
దేశమేగతి బాగుపడునోయ్'—అంటారు శారదా అశోకవర్ధన్.

కవితా సంపుటాలలో పి. చిరంజీవినీకుమారి "ఆగమ సంగీతం", యలమంచిలి తాయారుగారి "విప్లవాన్ని ఆహ్వానించు" అనే వాటిని గురించి రెండు ముక్కలు చెప్పాలి.

శ్రమించి జీవించి, అన్యాయాన్నెదిరించి పోరాడి, మానవ కళ్యాణాన్ని సాధించే ప్రతి ఒక్కరికీ అంకితం చేయబడింది ఆగమ సంగీతం. ఇందులో ఏ కవిత చదివినా, సమ సమాజ నిర్మాణానికి, పెట్టుబడిదారీ వ్యవస్థ నిర్మూలనానికీ జరిగిన హెచ్చరికలే వినిపిస్తాయి.

ఇజాలను ద్వేషించే మానవతావాదులున్నారు. వ్యక్తిని మరో వ్యక్తి దోపిడీ చేసేందుకా స్వేచ్ఛ, కొందరిని అరాచక శక్తులుగా ఎందుకు ఈ వ్యవస్థ మారుస్తోంది— ఇలాటి ఎన్నెన్నో సమస్యల్ని ఎదుర్కొనే మార్గం అన్వేషించ మంటూ యువకులను కోరి, ఆ యువతలోవున్న నవతకు విప్లవాన్ని ఆహ్వానించు అనే సంపుటాన్ని అంకితం చేశారు తాయారుగారు.

నిజానికి కావలసింది వాస్తవికత, దాన్ని ధ్యేయంగా పెట్టుకుని సమ సమాజ నిర్మాణానికి సహకరించే కవితలే నేడు కావలసినవి. ఇలాటి కవితలు మహిళల కలాలనుండి వెలువడాలి. సామాజిక స్పృహ వీడకుండా, ప్రగతిపథం వైపు మరలించే కవితలు రావాలి.

కవిత ప్రతి వ్యక్తి గుండెతట్టి లేపాలి
కవిత ప్రతి వ్యక్తి కళ్ళుతెరిచి అడుగువేసేలా చేయాలి.

# నేటి కవిత - మహిళలు

వేమూరి లక్ష్మీసువర్చల ఎం.ఏ.

ముందుగా 'కవిత' అననేమో పరిశీలించి, పిమ్మట అందు మహిళల స్థానమును గూర్చి తెలుసుకొనుట ఉచితము.

సంస్కృతమున ఆలంకారికులందరును కవిత్వము-కావ్యము అను వానికి అభేదమును చెప్పి, కావ్యమే కవిత్వమని నిర్వచించిరి. పెక్కు రాలంకారికులు పెక్కు విధములుగా దీనిని నిర్వచించినప్పటికి, తుట్టతుదకు బహుజనాంగీకారము నందినది "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్" అనునదియే.

రమణీయమై, మనోహరమైన అర్థమును ప్రతిపాదించు శబ్దమే కావ్యమని వారి అభిప్రాయము. రసగంగాధర కర్తయైన జగన్నాథ పండిత రాయలు కావ్యాన్ని పై విధముగా నిర్వచింపగా, కవిత్వమునకు కవితావేశమే ప్రధానమని అంటూ శ్రీశ్రీ – "సబ్బుబిళ్ళ, అగ్గిపుల్ల, కుక్కపిల్ల కాదేదీ కవిత కనర్హం, ఔనౌనోయ్ కవితావేశం" అని వ్రాకుచ్చియున్నారు.

ఈ రెండు విషయములను మనము జోడించినప్పుడు, కవితావేశం గల వ్యక్తి రమణీయమైన అర్థమును ప్రతిపాదించు శబ్ద సృష్టిని చేయుటయే కవిత్వమని మనము క్రోడీకరింపవచ్చును.

అయితే ఇట్టి కవితావేశం, రమణీయమయిన అర్థమును వ్యక్తీకరించు శబ్దసృష్టి చేయుట అందరి వశమా అంటే, స్థూలముగా కాదనియే చెప్పవచ్చు.

కథలు, కథానికలు, నవలలు మొ॥ సారస్వత ప్రక్రియల రచన కంటే, కవిత్వ సృష్టిని ఒక విశిష్టమైనదిగా మన మెన్నవచ్చును. ఇట్టి సృష్టి అందరికి సాధ్యము కాదనియు, ఏ కొందరికో మాత్రమే సాధ్యమనియు—

"కవితా కన్య మనింటి ఆడుపడుచా, కాకున్న ఖిల్లాల, లే
క వశంగామినియైన వారవనితా? కాదట్టి లేపూర్వ సం
భవమందోగల పుణ్యలేశమున సంప్రాప్తించున్‌గాని మా
నవుడెన్నే విధులం దపించినను చెంతం జేర దొక్కింతయున్"

అని చెప్పిన శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి పద్యమును బట్టి తెలియుచున్నది.

అనగా పూర్వజన్మ సంస్కారము వలన గలిగిన ప్రతిభను వెలార్చు నదియే కవిత్వము.

ప్రాకృతులు కొందరు ప్రకృతి సౌందర్యమును వీక్షింపలేరు. అట్టి సౌందర్యమును దర్శింపగలవారే భావుకులు. దర్శించిన సన్నివేశము నందలి సౌందర్యమును ప్రదర్శించుటలో ఆవేశమును అదుపులోనికి తెచ్చుకుని, పదునైన పలుకుబడులతో ప్రాణము పోసిన వ్యక్తి మనసులోని పరమాద్భుతమైన భావ పరంపరయే కవిత్వము. అనగా అట్టి దర్శనమును ప్రదర్శింపగలవారే కవులు లేక కవయిత్రులు అని తేలుచున్నది.

ఇక ఇట్టి కవిత్వ రచనను చేసిన వారిని గూర్చి పరిశీలించినపుడు, పురుషులతో పాటుగా ఈ రంగమున తమ ప్రతిభను వ్యక్తీకరించిన మహిళలెందరో గలరు.

"ముదితల్ నేర్వగ రాని విద్యగలదే ముద్దార నేర్పించినన్" అనినట్లుగా మహిళలకు అన్ని రంగములలోను ప్రవేశమున్నట్లే, ఈ రంగమునందు కూడా స్థానము కలదని ప్రాచీన కాలము నుండియు ఉదాహరణములు గలవు.

ఆవేశమున కవిత్వము ఏ విధముగా ఉద్భవించునో వాల్మీకి 'మా నిషాద' అన్న శ్లోకమే తార్కాణము. ప్రప్రథమ సంస్కృత కావ్యకర్తయైన వాల్మీకికి గలిగిన శోకావేశమునుండియే శ్లోకరూపమైన కవిత్వము ఉద్భవించినది.

ఒకానొక ఆనందోద్రేకముసుండియో లేక దుఃఖోద్వేగము నుండియో కవిత్వముద్భవించును. తలవనితలంపుగా సినిమా ప్రోగ్రాం ఏర్పాటైనప్పుడు, యువతీ యువకులు ఆనందోద్వేగము నుండియే 'లలలా....' అను ఒక ప్రత్యేక సంగీతరూపమైన కవిత్వ ముద్భవించుట సర్వజన విదితమే గదా! అందుకే కవిత్వమునకు అవసరమైనది ఆనందము, ఉద్రేకము అని తెలియుచున్నది.

ఇక కవిత్వ ప్రయోజనమును గూర్చి పరిశీలింతము. మమ్మటుడు తన 'కావ్యప్రకాశిక' యందు—

> ''కావ్యమ్ యశసే, అర్థకృత్
> వ్యవహార విదే, శివేతర క్షతయే
> సద్యఃపర నిర్వృతయే, కాంతా
> సమ్మిత తయోపదేశయుజే''

అని కవిత్వ ప్రయోజనమును తెల్పియున్నాడు.

అనగా కావ్యము యశస్సునకు, ధన సంపాదన కొఱకు, వ్యవహారం జ్ఞానముకొఱకు, అశుభములను తొలగించుట కొఱకు, శీఘ్రముగా రసానందమును గలిగించుటకు, కాంతాసమ్మితముగా ఉపదేశము కొఱకును అని కావ్యప్రయోజనము తెలుపబడినది.

తిక్కన, కాళిదాసు మొ॥ మహాకవులు యశస్సు కొఱకే కావ్యరచన చేసిరి. ఇక భారవి తన కావ్యరచన మూలమున ధన సంపాదన కావించినట్లు తెలియుచున్నది. వ్యవహార జ్ఞానమునకు విష్ణుశర్మచే తన కుమారులకు సుదర్శనుడను రాజు పంచతంత్ర హితోపదేశములను చెప్పించినట్లు గలదు. మయూరుడు దృష్టిని పొందుటకు సూర్య శతకమును రచించినట్లు తెలియుచున్నది. ఇది శివేతరక్షతియే గదా! ఇక మహాకవుల చాటువులన్నియు మనకు రసానందమును కలిగించునవియే. ఉదాహరణకు—

"శివుడద్రిని వసియించుట
రవిచంద్రులు మింటనుంట రాజీవాక్షుం
డవిరళముగ శేషునిపై
పవళించుట నల్లి బాధ పడలేక సుమా!

అను శ్రీనాథుని చాటువు వినినప్పుడు ఏ సహృదయుని హృదయము రసానం దామృతమగ్నము కాదు. చివరగా, కాంతాసమ్మితత్వోపదేశమునకు—

"సిరిగల వానికి జెల్లును
తరుణుల పదియారువేల తగ పెండ్లాడన్
తిరిపెమున కిద్దరాండ్రా
పరమేశా! గంగ విడుము పార్వతి చాలున్"

అను పద్యమును తార్కాణముగా చెప్పవచ్చును.

ఒక మంచి కథ అంటే పది కాలాలపాటు నిలచిఉండేది అని అన్నారు గదా! ఏ ఒక్కరినైనా సన్మార్గమున నడిపింపగలిగినదియే కవిత్వమని నా యభి ప్రాయము. మానవులలో గల బలహీనతలను జయించి, కోటానుకోట్లు ప్రజలు గల ఈ ప్రపంచమునందు ఏ ఒక్కరినైన ఋజువర్తనుని చేయగల శక్తిగల దానిని మాత్రమే మంచి కవిత్వముగా పేర్కొనవచ్చును. ఇట్టిదానినే పూర్వము కవిత్వమునందు ధర్మోపదేశము అని అన్నారు.

కవిత్వము యొక్క ఉత్పత్తి, దాని ప్రయోజనము ఇట్లుండగా, తమకు కవిత్వ రచన సాధ్యము కాకపోయినను, తమను గూర్చి ఏదో ఒక ఛందోబద్ధ మైన వృత్తమును చెప్పించుకొనవలెనని పెక్కురు ప్రాకులాడినట్లు—

"అన్నాతిఁ గూడ హరుడే
దన్నాతినిఁ గూడకున్న కసురగురుండే
దన్నా! తిరుమలరాయా!
కన్నొక్కటి లేదుగాని కాంతుడవు సుమా!"

అని ఒక కవిచే ఒక్క నేత్రమేగల తిరుమలరాయడు ఉబలాటపడినట్లు తెలియు చున్నది.

"నా కొమరుండే మాత్రం
జో కవియై నా కొసంగు మోదంబును శ్రీ
హైకోర్టు చీపు జస్టీ
సైకూడ నొసంగ నేరడనుకొందు మనీన్"

అని శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు తెల్పిన అభిప్రాయం కవిత్వ ప్రాశస్త్యము నకు పరాకోటి.

"సిరిగల వానికి జెల్లును..." మొ॥ శ్రీనాధుని పద్యములు ధ్వనిప్రధాన ములై కవిత్వమున విశిష్ట స్థానమును పొందినట్లు తెలియుచున్నది.

"బెరాని ఉతఇందోగు
నూకవ పెచిమ్మక మాక్
స్టేషన్సు బెబంశాఖాయాం
నూక్రాస్యాదితి నిర్ణయః" మున్నగు శ్లోకములు ఒక కాలపు విష యాలను వివరముగా చిత్రించుటయేగాక, ముందు తరమువారికి పరిశోధనల కవకాశమును కలిగించుచున్నవి.

వేదకాలమున ఉపనిషద్వాఙ్మయమున సయితము గార్గి, మైత్రేయి మున్నగు మహిళా మంత్ర దర్శినులు మనకు దర్శనమిచ్చుచున్నారు. ఆ తర్వాత పెక్కు కవయిత్రులను గూర్చి మనకు ఎక్కువగా తెలియకపోయినను, నిత్యము మనము పాడుకొను పాటలయందే వారి కవిత్వ సంపద ఇమిడివున్నదని మనము గ్రహింపవచ్చును.

పైన మనము చెప్పుకొనిన కవిత్వ నిర్వచనము ననుసరించి, కవితావేశము కలిగిన రమణీయ శబ్దసృష్టి స్త్రీల పాటలయందే ఎక్కువగా కన్పించును.

ఒక మహిళామ తల్లి తన కుమార్తె అందచందాలను తన కంటి కగపడు వస్తువులతో పోల్చుకున్న ఉపమాన సౌందర్యమును గమనింతము—

''చిక్కుడు పువ్వెరుపు చిలుక ముక్కెరుపు
చిగురెరుపు చింతల్లి దోరపండెరుపు
రక్కెస పండెరుపు రాగి చెంబెరుపు
తా ఎరుపు అమ్మాయి తన వారిలోన''—అని.

ఒక అమాయకపుటత్తగారు లోకవిరుద్ధముగా, కోడలుకు నమస్కరింపగా ఆమె తన అత్తగారిని దీవించిన పలుకులలోని వైచిత్ర్యమును గమనింపుడు—

''చాలు చాలత్తయ్యే చాలత్తగారూ
నీ కొడుకు వెయ్యేళ్ళు మొదలు కావాలీ
నీ కోడలు పట్టంపురాణి కావాలి !
నువ్వెళ్లి ఏంచల్లి పాటగావాలీ''—అని.

నేను గమనించినంతవరకు 1370 ప్రాంతమున తన భర్త విజయపరం పరలను ''మధురావిజయమ''ను పేర సంస్కృత కావ్యరచన గావించిన గంగాదేవియే ప్రప్రథమ కవయిత్రిగా తెలియుచున్నది.

తొలి తెలుగు కావ్య కవయిత్రి తాళ్ళపాక తమ్మక్కగా సారస్వత రచయితల సిద్ధాంతము, ఆమె రచించిన గ్రంథము 'సుభద్రా కళ్యాణము'.

మరో కావ్య రచయిత్రి మొల్ల ''రామాయణ కావ్యము'', ముద్దుపళని ''రాధికా సాంత్వనము'', కనకాభిషేకము నందుకొనిన పసుపులేటి రంగాజమ్మ ''మన్నారుదాస విలాస నాటకము'', ''ఉషా పరిణయ ప్రబంధము'' మున్నగునవి మధ్యకాలమున చెప్పుకొనదగినవి.

ఇక ఆధునిక కాలమునందు కూడా కవయిత్రులు పెక్కురు కలరు. ''కొండంత దేవునికి కొండంత పత్రి'' తేగలమా అన్నట్లు, వారి అందరి కవిత్వ సుమముల గుబాళింపులను మనమిప్పుడు ఆఘ్రాణింప సాధ్యము కారపోయినను, ఈ సందర్భమున వారిలో కొందరినైన పరిశీలించుట ఉచితము.

డా॥ యశోదారెడ్డిగారు ''దీపము'' అను కవితయందు తన్ను త్యాగము చేసికొనియైనను పది మందికి ఉపయోగపడు పని చేయవలెనను ఉదాత్తభావాన్ని అతి చక్కగా వివరించారు.

ఇక బి. ప్రభావతిగారు తమ ''నేనెవరు'' అన్న కవితలో ఆశాజ్యోతి ఎన్ని రకములైన పనులను చేయింపగలదో తెలియపరచారు.

''అదృశ్యమై కవ్విస్తాను
ఉనికికి ఆధారంగా నిలుస్తాను
ఉన్నది లేనట్లు నమ్మిస్తాను
కరుడుగట్టిన గుండెల్ని కూడా
కదలించి పలికిస్తాను'' — అన్న వారి వాక్యములు బహుధా ప్రశంసనీయములు.

శ్రీమతి మద్దు లక్ష్మీసరస్వతిగారు తమ ''సంక్రాంతి''ని వర్ణిస్తూ—

''కన్నెపిల్లల గొబ్బిళ్ళ కలకలములు
మేలుకొలుపుల పాటలో మేళతతులు
గంగిరెద్దులు సన్నాయి హంగుమీర
రమ్మ సంక్రాంతి లక్ష్మిరో రాగమలర''.

ఇంతేకాక గొబ్బి పాటలు, లాలి పాటలు వంటి ఎన్నో కవితల్ని ఏనాడో రచించి, ఈనాటికి మనల నందరిని ఆనందసాగరంలో ముంచి తేలించుచున్న, అజ్ఞాత కవయిత్రులకు నా నమోవాకములు. స్వస్తి !

# కథానికా శిల్పం

సి. ఆనందారామం.

కథానిక ఈనాడు మాత్రమే ప్రచారములోకి వచ్చినా అలనాటి అగ్ని పురాణంలోనూ ఇది మనకు కన్పిస్తుంది. అగ్ని పురాణంలో వివరించిన కథానికా లక్షణాలన్నీ ఈనాటి కథానికకు అన్వయించినా, అన్వయించక పోయినా, ''...... అద్భుతోఒంతే......'' మాత్రం ఈ నాటికీ కథానికకు తప్పనిసరి, దీన్ని ఈనాటి కొస మెరుపుతో సమానమైనదిగా భావించవచ్చు. ప్రాచీనాలంకారిక శాస్త్రాలలోని ఖండ కథా, పరి కథా—మొదలైనవాటికీ ఈనాటి కథానికకూ ఏ విధమైన సంబంధమూ లేదు. ఈనాటి మన కథానిక నిస్సంశయంగా ఆంగ్ల కథానికా ప్రభావంతో ఆవిర్భవించిందే.

కథానికా శిల్పానికి సంబంధించి ఒక అవగాహనకు రావాలంటే దానిని స్వరూప స్వభావ సంవిధాన పరంగా విశ్లేషించి అర్థం చేసుకోవాలి. స్వరూపాన్ని అనుసరించి కథానికను 1. ఎత్తుగడ 2. నడక 3. విషమస్థితి 4. పరాకాష్ఠ 5. చరమసీమ లేదా విడుపు 6. ముగింపు అని విభజించుకోవచ్చు.

ఉదాహరణకు ఒక చిన్న కథానికను తీసుకుందాం. విద్యావంతురాలైన రచయిత్రి అయిన యువతి గృహిణి కావటం కారణంగా పరంపరగా రచనలు చెయ్యలేక పోవటం, ఆ కారణంగా రావలసినంత ప్రఖ్యాతి రాకపోవటం, ఆ కారణంగా రచయిత్రుల సభకు ఆహ్వానం కూడా అందక పోవటం విషయంగా తీసుకుందాం.

ఈ రకమైన కథానిక ఎత్తుగడ ఎలా ఉండాలి?

ఏ రకంగా ఉన్నా పాఠకుణ్ణి చెప్పే విషయం పట్ల సుముఖుణ్ణి చెయ్యాలి. ముందు ముందుకురికే ఆసక్తి రగిలించాలి. ఈ రెండూ సాధించటానికి ఎత్తుగడ ఎన్ని విధాలుగా ఉండాలో పరిశీలిద్దాం.

1. నిర్భరంతోనే (Suspense తోనే) ప్రారంభించటం—

"సభ నిశ్శబ్దంగా ఉంది. అందరూ వేదిక మీద రచయిత్రి ప్రసంగం వింటున్నారు. ఆ సమయంలో తుఫానులా వచ్చిపడిన ఒక వయసు మీరినావిడ "నీకు బుద్ధి ఉందా లేదా ? పనీ పాటా లేకుండా ఇక్కడ కొచ్చి కూర్చున్నావా ? ముందు ఇంటికి నడు" అని అరుస్తుంది."

2. సంవాదనతో మొదలు కావచ్చు —

"మీరు ఆనందారామం గారను కుంటానే !"

"అవును. మీ పరిచయం చేసుకోవచ్చునా ?"

"నేను పద్మ ప్రియను. నేనూ కొంచెం రాస్తాను. బహుశా మీకు గుర్తుండక పోవచ్చు."

"అరె మీరా ! 'మలయ పవనాలు' రచయిత్రి కదా ! చాల బాగా రాశారు. అంత గొప్ప రచన చేసి మళ్ళీ ఏం రాయలేదే ?."

"ఏం చెప్పమంటారు? నా జీవితమే అన్ని నవలల కంటె గొప్ప నవల."

3. వర్ణనాత్మకంగా మొదలు కావచ్చు—

విశాలమైన హాలు, విద్యుద్దీపాలతో, విద్యుద్వింజామరలతో కన్నుల పండువుగా ఉంది. వేదిక మీద ఎవరిదో ప్రసంగం. ఆ ప్రసంగాన్ని కొంత కొంత మింగేసే సన్నని గుస గుసలు సభనిండా-. ఆ సమయంలో పైట వంటి నిండా కప్పుకుని, బెదురు చూపులతో, కొద్దిగా తడబడుతున్న అడుగులతో, విద్వత్తు ప్రతిఫలించే ముఖంతో ఒకావిడ సభలో అడుగు పెట్టింది.

4. సంఘర్షణతో—

ఆ రోజు ఉదయం నుంచీ పద్మప్రియ ఆలోచనలో పడింది. తాను సభకు వెళ్ళటం అత్తగారికే మాత్రం ఇష్టం లేదు. అత్తగారి మాట కాదని పోట్లాట పెంచుకుని అల్లరి పడటం తన కిష్టం లేదు. కానీ ఇన్ని రోజుల తర్వాత తానున్న ఊళ్ళోనే రచయిత్రుల సమావేశం జరుగుతూ ఉంటే, తను అభిమానించే రచయిత్రు లెందరో తన వూరికే వస్తూ ఉంటే వెళ్ళకుండా, చూడకుండా ఎలా ఉండటం ?

ఈ రకంగా ఎత్తుగడ ఏ విధంగానైనా ఉండవచ్చు. ఏ రకంగా ఉన్నా పాఠకుడు వెంటనే కథలో లీనం కావాలి. ఆ కథ ఏమిటో తెలియక పోయినా ఫర్వాలేదు. ఎత్తుగడలో తెలియక పోతేనే మంచిది.

II. *నడక*

కథా గమనం ఎంత చురుకుగా ఉంటే అంత మంచిది. అత్యంత సంగ్రహంగా ఉండవలసిన కథానిక శిల్పానికి ఈ వేగం ఎంతో ఉపకరిస్తుంది. ఈ నడక సూటిగా ప్రారంభ దశ నుంచి, అంత్యదశకు సాగవచ్చు. లేదా కొంత దూరం సాగి అక్కడ ఆగి మలుపులు తిరగవచ్చు.

మన కథానికలో పద్మప్రియ సభలోకి వచ్చి సమావేశంలో పాల్గొని పరిచయాలు పెంచుకునే వరకు సూటిగా సాగి అక్కడనుంచే ఆమె రచయిత్రిగా ఎదుర్కొన్న సాధక బాధకాల వైపు మలుపు తిరగవచ్చు. ఆ మలుపులోనుంచే ఆమె గార్హస్థ్య జీవితం వైపుకు కథను మళ్ళించవచ్చు. ఎన్నెన్ని మలుపులు ఎలా ఎలా తిప్పినా, చెప్పదలుచుకున్న అంశానికి అనవసరమైన విషయాల జోలికి మాత్రం పొరపాటున గూడా పోగూడదు. ఒక్కొక్కసారి ఈ నడక తిరోగమనం కూడ కావచ్చును. మన కథానికలో అత్తగారి రాకతో ప్రారంభమై ఆ సంఘటనకు వెనుకగల, అసలు సమస్యలను స్పృశించ వచ్చును. దీనినే "ఫ్లాష్‌బేక్" పద్ధతిగా వ్యవహరిస్తున్నాము. ఇలా ముందు వెనుకలకు ఎలా నడి

చినా కార్య కారణాలను జాగ్రత్తగా సమన్వయం చేసుకుంటూ రావాలి. కథా గమనంలోని ప్రతి అడుగూ మరో అడుగుకు దారి తీసేదిగా ఉండాలి. అంటే సృష్టించిన ఒక సంఘటన మరో సంఘటనకు ఆధారం కావాలి. ఈ రకమైన సహజ గమనానికి ప్రధానంగా తోడ్పడేది పాత్రోచితమైన శైలి.

## III. విషమస్థితి

కథేతివృత్తం ఫలోన్ముఖంగా సాగిపోతున్నప్పుడు అవరోధాలు ఏర్పడగా ఎదురయ్యే ఘర్షణను విషమ స్థితి అనవచ్చును. మన కథానికలో పద్మప్రియ అతి ప్రయాసతో ఎన్నో ఆటంకాలు ఎదుర్కొని సమావేశానికి వచ్చింది. అక్కడ ఆమె ప్రతిభను గుర్తించిన రచయిత్రులు కొందరైనా ఉన్నారు. ఆమెను సగౌరవంగా ఆహ్వానించారు. వారితో ఆమె సంభాషణ జరుపుతున్న సమయంలో అత్తగారు వచ్చి కేకలు పెట్టసాగారు. విదుషీమణులైన రచయిత్రులు సైతం ముసి ముసి నవ్వులు నవ్వుకుంటున్నారు. మొత్తం మీద సానుభూతి కంటె అపహాస్య ధోరణే ఎక్కువగా కన్పిస్తోంది, చుట్టు ప్రక్కల అంతటా.

ఈ రకమైన విషమ స్థితిని ఏ విధంగానైనా సృష్టించు కోవచ్చు. కొన్ని సందర్భాలలో ఇది దైవికం కూడ కావచ్చు. విభిన్న పాత్రల మధ్య-పాత్రలకూ పరిస్థితులకూ మధ్యా— ఇలా ఏ రకంగానైనా ఘర్షణ ఏర్పడవచ్చు. కథా గమనం కథకుడి చాతుర్యానికి గీటురాయి.

## IV. పరాకాష్ఠ

దీనినే Climax అంటారు. కథానిక ఫలోన్ముఖంగా సాగి సాగి శిఖరాన్ని అందుకునే దశ. కథానికా నిర్వహణలో అత్యంత కీలకమైనదిది.

మన కథానికలో - సభా నిర్వాహకులు కొందరు పెద్దలు జరుగుతున్న అల్లరికి చిరాకుపడుతూ అందుకు కారకురాలైన పద్మప్రియను అసహనంగా చూడసాగారు. చిన్నబోయిన పద్మప్రియ తలదించుకుని బయటకు నడవబోయింది.

ఈ తరంలోని కొందరు రచయిత్రులు మాత్రం ఆ అన్యాయాన్ని సహించలేక "ఆ అత్తగారినే ఎలాగో బయటికి పంపేయండి. ఆవిడ అల్లరి మూలంగా పద్మ ప్రియ సభను వదిలి పోనక్కరలేదు" అని అడ్డు పడ్డారు. ఘర్షణ రాజుకుని రగిలి తీవ్రరూపం దాలుస్తానని భయపెట్టింది. పద్మప్రియ లేచి "నా కారణంగా మీరూ మీరూ ఘర్షణ పడకండి. నేను వెళ్ళిపోతాను. సభ నిర్విఘ్నంగా జరుపు కోండి" అని బయటికి నడిచింది.

కళాప్రతిభ, విజ్ఞానము, ఆసక్తి అన్నీ ఉన్న ఒక రచయిత్రి కేవలం స్త్రీ కావటం కారణంగా సాంఘికాచారాల చట్రంలో నలిగిపోతూ, కనీసం సభలో పాల్గొనే అవకాశం కూడా లేక నిరాశతో క్రుంగిపోవలసి వస్తోంది. ఆమెకు చేయి అందించటానికి అక్కడెవరూ సిద్ధంగా లేరు.

ఈ పరాకాష్ఠ ఏ విధంగానైనా నిర్వహించవచ్చు. పాత్ర గతమూ కావచ్చును. కథా గతమూ కావచ్చు. పద్మప్రియ విషయంలో లాగ అంతస్సం ఘర్షణ ఉన్నప్పుడు ఇది అభ్యంతర (Internal Climax) మవుతుంది. కథానిక అంతను మించి పైకి పోలేనిదిగా ఉండాలి పరాకాష్ఠ.

V. చరమసీమ లేదా విడుపు

చిక్కు ముడులన్నీ విప్పేది చరమ సీమ. అంతవరకూ కథానికలో గూఢంగా ఉంచి నిర్భరతను (Suspense) పోషిస్తూ వచ్చిన అనేక అంశాలు ఈ చరమ సీమలో వివరింపబడతాయి. మన కథానికలో నిరాశతో సభ వదలి పోతున్న పద్మప్రియ దగ్గరకు ఆమె భర్త వస్తాడు. తల్లిని బుజ్జగించి ఇంటికి తీసుకుపోయి భార్యకు సమావేశంలో పాల్గొనే అవకాశం కల్పిస్తాడు. ఆ తరు వాత అత్తగారు అంత అసహజంగా నలుగురి మధ్యకూ వచ్చి అరవటానికీ, పద్మప్రియ జీవితంలోని విషాదానికీ కారకాలైన అనేక విషయాలు వివరింప బడతాయి

ముగింపు

ఫలాగమము లేదా ఫలసిద్ధి ముగింపు. ముడులు విడిపోయిన తరువాత ధ్యేయం నెరవేరటం ముగింపు అనుకోవచ్చు. అయితే ముగింపు సుఖాంతమేనా ? విషాదాంతం కాకూడదా అనే ప్రశ్న రావచ్చు. సుఖాంతమైనా విషాదాంతమైనా చెప్పదలుచుకున్న విషయాన్ని కథకుడు పాఠకులలో ప్రగాఢంగా ముద్ర వేయాలి. పద్మప్రియ సభలో సమ్మాన్యురాలైనట్లుగా చిత్రించి సమాజం యొక్క కర్తవ్యాన్ని సూచించనూ వచ్చు. లేదా అన్నీ ఉన్న ఆడదాని అభాగ్య స్థితిని విషాదంగా చిత్రించి ఆ విషాద పరిస్థితి తొలగించ వలసిన బాధ్యత స్త్రీలోకానిదే నని హెచ్చరించనూ వచ్చు.

ఇక స్వభావాన్ననుసరించి 1. కథా బీజం 2. కథా వస్తువు 3. ఇతివృత్తం 4. పరమార్థం- ఈ రకంగా విశ్లేషించుకోవచ్చు. సమాజంలోని ఏ అంశమైనా కథానికకు ప్రేరణ కావచ్చు. లేదా మానవ మనస్తత్వపు అగాధాలు కూడ ప్రేరణ కావచ్చును. కథానికకు ప్రేరణ కలిగించే అంశమేదో అదే కథా బీజం. సృష్టిలో బీజం నుండే వట వృక్షం వ్యాపించినట్లుగా ఈ కథా బీజం నుండే కథానిక యావత్తూ విస్తరిస్తుంది.

మన కథానికలో గృహిణిగా రచయిత్రి సమాజంలో ఎదుర్కొనే ఘర్షణ కథా బీజం.

## కథావస్తువు

కథా బీజానికి అనుగుణమైన విషయము కథా వస్తువు అవుతుంది. మన కథానికలో సమిష్టి కుటుంబములో రకరకాల సమస్యలతో సతమవుతూ కూడా, రచనా వ్యాసంగాన్ని వదులుకోలేని పద్మప్రియ జీవితం కథా వస్తువు.

## ఇతివృత్తము

దీనినే Plot అంటారు. వస్తువు ముడిపదార్థం అనుకుంటే దానిని తగిన శిల్పముతో కథానికగా తీర్చిదిద్దే నిర్మాణత ఇతివృత్తము: సన్నివేశ

కల్పన, సంఘటనా నిర్మాణ చాతురి మొదలైన వన్నీ ఇతివృత్త నిర్మాణతలో భాగాలే. రచయితలోని కాల్పనిక ప్రతిభ మీద ఇతివృత్త సౌందర్యం ఆధారపడి ఉంటుంది. నాటకీయంగా పాత్రలను పరిస్థితులను అల్లుకుంటూ సముచిత వాతావరణంలో పొదిగితే అది ఇతివృత్త మవుతుంది. కొన్ని కొన్ని పడికట్టు రాళ్ళ లాంటి సూత్రాలననుసరించి అల్లబడిన ఇతివృత్తాలు పేలవంగా ఉంటాయి. వీటినే "Formula Plots" అంటారు. మౌలికమైన ప్రతిభతో సరికొత్త సంవిధానంతో కల్పించుకునే ఇతివృత్తాలే కళారామణీయకతకు కారణాలవుతాయి.

## పరమార్థం

కథానిక ద్వారా కథకుడు ఈయదచుకొనిన సందేశమే పరమార్థం. పఠితల హృదయాలను ఆర్ద్రం చేస్తూ ఒక సత్యానికి అభిముఖమైన అనుభూతిని కలిగించటం కథానిక యొక్క పరమార్థం. ఇక్కడ సత్యం అంటే వాస్తవంగా జరిగినది అని అర్థం కాదు. ఎప్పటి కప్పుడు మారే అనేక వాస్తవిక సంఘటనల వెనుక, మారని మూల సూత్రమేదైతే ఉందో అదే సత్యం. ఒక్కొక్కసారి ఈ సత్య ప్రతిపాదనకై కథకుడు వాస్తవంగా జరిగిన విషయాలనే వదలి వేయవలసి వస్తుంది.

మన కథానికలో ప్రతిపాదింప దలచుకున్న పరమార్థం స్త్రీ విముక్తి. వాస్తవిక జీవితంలో తామే గంప గయ్యాళులై అత్తగారినీ భర్తనూ అల్లరి పెట్టే స్త్రీలుండ వచ్చును. కాదనలేము, కాని వారు అల్పసంఖ్యాకులు కనుక - మొత్తం మీద ఈనాడు అన్ని విధాలా అణగద్రొక్క బడుతున్న స్త్రీ జాతికి విముక్తి కలిగించటమే వాంఛనీయం కనుక ఈ పరమార్థాన్ని ఆవిష్కరించటమే కథకుడి ధ్యేయం. ఈ సార్వజనీన సత్యం ముందు, వాస్తవంగా ఎక్కడో ఏదో జరిగినా అది పరిగణనకు తీసుకోనక్కరలేదు.

సంవిధానాన్ననుసరించి - పాత్ర, సంఘర్షణ, సంఘటన, సన్నివేశం, కథనం ప్రధానంగా తీసుకోవాలి.

సాహిత్యంలోని పాత్రలను అనేక మంది విమర్శకులు "Flat and Round" పాత్రలుగా, స్థూలంగా విభజించారు. రచయిత చేతిలో బొమ్మలా తయారైన పాత్రను "Flat Character" అంటారు. ఈ పాత్ర గురించి మంచి అనో, చెడు అనో నిర్ధారణగా చెప్పవచ్చు. కథాగతి ననుసరించి ఇవి మార్పు పొందవు.

మన కథానికలో పద్మప్రియ 'ఉత్తమా ఇల్లాలు', 'మహా పతివ్రత' అయిపోయి ఎలాంటి పరిస్థితులలోనైనా అత్తగారి మాటలకు ఎదురు చెప్పకపోతే "Flat Character" అవుతుంది.

బొమ్మలా ఉండిపోక స్వయమ్ఉన్మీలన శక్తితో వికసించే పాత్రలను "Round Characters" అంటారు. వీటిని గురించి మంచి అని గాని, చెడు అనిగాని నిర్ధారణగా చెప్పటానికి ఉండదు. సహజ స్వభావాన్ని నిలుపుకుంటూనే కథాగతి ననుసరించి మార్పు చెందుతూ ఉంటాయి. మన కథానికలో పద్మప్రియ సహజంగా మంచిదైనా అత్తగారి విపరీత ధోరణి భరించలేక ఎదురు తిరిగితే— మంచివాడైన భర్తను వదులకోలేక, తన వ్యక్తిత్వం చంపుకోలేక సంఘర్షణతో సతమతమైతే, ఈ సంఘర్షణలన్నింటి మధ్య ఉదాత్తంగా విశాల హృదయంతో వ్యవహరిస్తే అది "Round Character" అవుతుంది.

## సంఘర్షణ

కథానికలో ఈ సంఘర్షణ ఒకే పాత్రలో అంతర్గతంగా ఉండవచ్చు. రెండు విభిన్న పాత్రల మధ్య ఉండవచ్చు. పాత్రకూ, పరిస్థితులకూ మధ్య కావచ్చు. ఏ విధంగానైనా కావచ్చు. సంఘర్షణ ఎంత బలంగా ఉంటే రచన అంత సజీవంగా ఉంటుంది. సంఘర్షణ లేని సాధారణ కథలలో ఇతివృత్తాన్ని రక్తి కట్టించటం కష్టం.

## సంఘటన

ప్రత్యక్షంగా గాని పరోక్షంగా గాని కథేతివృత్తాన్ని ప్రభావి ప్రధాన విషయాన్ని సంఘటన అనవచ్చు. మన కథానికలో e

రావడం ఒక సంఘటన. కథానికలో అనేక సంఘటనలుంటాయి. ప్రధానమైనవి కొన్ని. ఆ ప్రాధాన్యత స్ఫురించేలాగ సంఘటనను నిర్వహించే బాధ్యత కథకుడిది.

## సన్నివేశం

సంఘటనకూ సన్నివేశానికీ ఉండే భేదం గమనించాలి. స్థానిక పరిసరాలు, కాలము, వాతావరణము, పరిస్థితి అన్నీ కలిసి సమష్టిగా సన్నివేశ మవుతుంది. అత్తగారు సభకు రావటం సంఘటన అయితే, సభలో వ్యక్తుల రియాక్షన్ రావటంవల్ల సభలో మారిన వాతావరణం ఇవన్నీ కలిపి సన్నివేశంగా రూపొందుతాయి.

## కథనం

కథనం అనేక విధాలు. రచయిత స్వయంగా చెప్పటం ఒక పద్ధతి. మన కథానికలో పద్మప్రియ తానే చెప్తున్నట్లు "నేను సభకు వెళ్ళాలనుకుంటున్నాను. కాని ఇంటి పరిస్థితులు......" ఇత్యాది. అలా కాక ప్రథమ పురుషలో చెప్పటం ఇంకో పద్ధతి. కథాకథనం ఏ దృక్పథంతో సాగాలన్నది కథకుడు నిర్ణయించుకోవాలి. ఈ దృక్పథం ఇతివృత్తాన్ని బట్టి, పరమార్థాన్ని బట్టి భౌతికంకావచ్చు. మానసికం కావచ్చు, వైయక్తికమూ కావచ్చు.

ఇంతవరకూ సాగినది కథానికా శిల్ప విశ్లేషణ. అయినా శిల్పమనేది అనిర్వచనీయమూ, అనుభవైకవేద్యమే.

# నేటి కథ – తీరుతెన్నులు

డి. సుజాతాదేవి

తెలుగు దేశం కథలకు కాణాచి. 'అనగనగా ఒక రాజు' అంటూ చిన్నప్పుడు అమ్మమ్మ, తాతయ్య చెప్పిన కథలు ఇప్పటికీ గుర్తొస్తూనే ఉంటాయి. 'చందమామ రావె, జాబిల్లి రావె' అనే పాట ఏ తల్లి నోట తొలిరూపు దిద్దుకుందో తెలియనట్లే, 'అనగనగా ఒక రాజు' అనే ఆరంభం ఎలా పుట్టిందో తెలీదు. రాజుల కథలు, రాజకుమార్తెల కథలు, వీరకుమారుల కథలు, ఉత్తర కుమారుల కథలు, రాక్షసుల కథలు, మాంత్రికుల కథలు, ఎన్నో రకరకాలుగా చెప్పిన కథ చెప్పకుండా, చెప్పి మురిపించే వారి నాటికీ తెలుగునాట ఉన్నారు. ఆ కథాకథన చాతుర్యం మన తెలుగువారి సొత్తు.

18 వ శతాబ్ది చివరలో, శ్రీ చింతా దీక్షితులు గారు, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి గారు శిష్ట వ్యావహారికంలో కథా ప్రయోగాలు చేసినా, కథావాఙ్మయంలో ప్రథమ స్థానం శ్రీ గురజాడ అప్పారావుగారి 'దిద్దుబాటు'కే దక్కింది. అప్పటికి ఆధునికమైన పద్ధతిలో, శైలిలో, ముగింపుతో, పట్టుగా సాగిన కథ దిద్దుబాటు. ఆ కథ 1910 లో ఆంధ్రభారతిలో వెలువడింది.

పరస్త్రీ ఆకర్షణ నుంచి నేర్పుగా భర్తను ఇవతలకు లాగి దక్కించుకున్న ఇల్లాలి కథ దిద్దుబాటు. ఆవిడ కథలో మన కెక్కడా కనిపించదు. కాని ప్రతి వాక్యంలోనూ వినిపిస్తుంది. ఆమె వ్రాసిపెట్టిన ఉత్తరం, ఆమె గురించి భర్త తలపోతా, ఆమె భర్తకూ, నౌఖరుకూ మధ్య జరిగిన సంభాషణా, ఆవిడను మన కళ్ళ ముందుంచుతాయి. చివరకు గాజుల గలగలలు, నవ్వుల కిలకిలలూ మాత్రం వినిపిస్తాయి. అదే కథకు ముగింపు. అతని మనసు మారి భార్యవైపు

మొగ్గదం ఇక్కడ లక్ష్యం. ఆ లక్ష్యాన్ని అలక్ష్యం చేయకుండా, సంభాషణలు గానీ, వర్ణనలు గానీ అసలు పాయింటుని మింగకుండా చక్కగా నడుస్తుంది కథ. వీరు వ్రాసిందే మరో కథ 'మీ పేరేమిటి' అనేది మత మౌఢ్యాన్నాధారం చేసుకున్న కథ. అలాగే పాలగుమ్మి పద్మరాజు గారి కథ 'గాలి వాన'. ఇది ప్రవర్తనావాదం మీద ఆధారపడిన కథ. జీవితంపైన నిశ్చితాభిప్రాయాలూ, మంచి అలవాట్లు కలిగివున్న రావుగారు రైలు ప్రయాణం చేస్తూ గాలివాన వలన ఒక చిన్న స్టేషనులో ఆగిపోయి, చలిలో, చీకటిలో ఒక ముష్టిదానికి చేరువౌతాడు. తెల్లవారాక ఆయన ప్లాటుఫారం మీద కొచ్చేసరికి ప్రమాదవశాత్తూ ఆ ముష్టిది చచ్చిపడి ఉంటుంది.

ఆమె చేతిలో ఆయన పర్సు ఉంటుంది. అందులోంచి తన పేరున్న కాగితాన్ని తీసుకుని వెళ్ళిపోతారు రావుగారు. స్థూలంగా అదీ కథ. కాని రచనా విధానంలో, ప్రవృత్తి, ప్రవర్తనా, వీటి గురించి అద్భుతంగా చిత్రించారాయన, పద్మరాజు గారిదే మరో కథ 'పడవ ప్రయాణం'. దొంగ, త్రాగుబోతు, వ్యభిచారి, కోపిష్టి అయిన భర్త, తనపైన ఉన్న మనసుకు మురిసిపోయి, అతని కోసం ఎన్ని కష్టాలయినా పడడానికి సిద్ధపడే రంగి పాత్ర ప్రముఖమైంది. రంగి పాత్ర చిత్రీకరణ విశిష్టంగా, చిత్రంగా ఉంటుందీ కథలో. ఈ రెండు కథలూ ప్రపంచ భాష లన్నింటిలోకి అనువదించబడ్డాయి. ఇలా ఉదాహరణలు చెప్పుకోవాలంటే పూర్వ సాహిత్యం నుంచి ఎందరో కనబడతారు తెలుగు కథకుల్లో.

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు గారు సాహిత్యంలో చేసిన కృషి మరువలేనిది. దేనికదేసాటిగా కొన్ని వందల కథలు ఆయన కలం నుంచి వెలువడ్డాయి. కథావస్తువులోనూ, సంవిధానంలోను ఆయన తెచ్చిన మార్పులు తెలుగు కథను పరిపుష్టం చేశాయి. వీరి శైలి నిరాడంబరంగా ఉంటుంది. వీరి పాత్రలు నేలమీద నడిచే మధ్య తరగతి జీవితంలోని మంచి చెడ్డలు చూపిస్తూ సజీవంగా మనలో తమ ముద్రల్ని వేస్తాయి.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కథలు సాంప్రదాయికపు సొంపులతో కమ్మని తెలుగు నుడికారపు 'గులాబీ అత్తరు' పరిమళాన్ని విరజిమ్ముతుంటాయి. చక్కటి గృహ వాతావరణాన్ని అరమరికలులేని ఆలుమగల అన్యోన్యతను సహజ సుందరంగా కళ్ళ ముందుంచుతాయి-మునిమాణిక్యం నరసింహారావు గారి కాంతం కథలు, ఇంకా కొనకళ్ళ వెంకటరత్నంగారి 'అతనికరాడు', కాళీపట్నం రామారావు గారి 'యజ్ఞం,చావు', రావిశాస్త్రిగారి రొట్టె ముక్క, సారా కథలు, శ్రీ చాగంటి సోమయాజులుగారి 'ఎంపు' వాయులీనం; పెద్దిభొట్ల సుబ్బరామయ్య గారి ముసురు, 'నీళ్ళు' శ్రీ పురాణం సుబ్రహ్మణ్యంగారి, నీలి, సీతజడ; బీనాదేవి గారి ది మేటరాఫ్ నో ఇంపార్టెన్స్, థాంక్స్ పర్ ది పి. ఎమ్. రంగనాయకమ్మ గారి శోభనంరాత్రి, పల్లెటూరు, కళ్యాణసుందరీ జగన్నాథ్‌గారి అలరాసపుట్టిళ్ళు, యశోదా రెడ్డి గారి గంగరావి చెట్టు, బలివాడ కాంతారావుగారి సభ్యత, శ్రీ కేతు విశ్వనాథరెడ్డిగారి పులిగీతం, ఇంకా ఎన్నో కథలు మంచి కథలు అనుకుంటే స్ఫురణకొస్తాయి. వాటిలో ఇప్పటి రచయితలవీ, రచయిత్రులవీ చాలాతక్కువ. అందుక్కారణం వీరి రచనల్లో వాస్తవికత లోపించడమే. వీరి పాత్రలు నేలవిడిచి సాము చేయడమే.

అసలు విమర్శనా గ్రంథాలలో చెప్పబడిన కథా లక్షణాలను సమన్వయ పరచుకుంటే కథారూపం ఇలా ఉండాలి. మంచి కథా వస్తువు, మంచి ఎత్తుగడ, చక్కటి నడక, కదిలించే ముగింపు, (కదిలించమంటే అది విషాదమే కానక్కర్లేదు.) పరిమితమైన పాత్రలు, పాత్రోచితమైన సంభాషణలు, అన్నింటినీ మించి కథ ఏదేనొక జీవిత సత్యాన్ని తెలుపుతూ, విజ్ఞానమో వినోదమో, వికాసమో కలిగించడం. అయితే ఇప్పుడు టన్నులకొద్దీ ఉత్పత్తయ్యే కథలన్నీ ఈ సుగుణాలను కలిగి ఉంటున్నాయా అంటే మనం చెప్పలేం. కాని నవలంతగా దిగజారి పోలేదు కథ, అనిమాత్రం చెప్పవచ్చు

స్వాతంత్ర్యానంతరం ఒక్క తెలుగునాటనే కాక యావద్భారత దేశంలోనూ స్త్రీ విద్య అంతో ఇంతో పెరుగుతూనే వచ్చింది. విరామ సమయాలలో ఒక

ఒక వ్యాపకంగా పత్రికా పఠనం పెరిగింది. దేశ సాంస్కృతిక జీవితంలో వచ్చిన ప్రచండమైన మార్పులు మధ్య తరగతి గృహిణీ జీవితాన్ని ప్రత్యేకించి ప్రభావితం చేశాయి. తత్ఫలితంగా పత్రికల సంఖ్య, వాటి ప్రతుల సంఖ్య అప్పటికన్నా గణనీయంగా పెరిగింది. ఇది హర్షించదగిన ఆహ్వానించదగిన పరిణామం. కాని రాశిలో వచ్చిన ఈ పరిణామం వాసితో పోలిస్తే దిగ వాసిల్లిందనే చెప్పాలి.

అన్ని సాహిత్య ప్రక్రియలకన్నా కథా ప్రక్రియ సులభమని చాలామంది అభిప్రాయం. కాని అది దురభిప్రాయం. ఈ రకమైన అభిప్రాయం ప్రబలటానికి ముఖ్య కారణం, నానాటికీ సంఖ్యాబలం పెంచుకుంటున్న వార పత్రికలు, మాస పత్రికలు, ఏ ఇతర సాహిత్య ప్రక్రియకు ఇవ్వనంత ఆదరణ ఈ కథకిచ్చి ప్రోత్సహించడం వల్లనే అనేక వందలమంది ఈ రచయితలుగా రచయిత్రులుగా తయారై వేల కథలు దేశంమీద వదులుతున్నారు. ఇవన్నీ చూస్తుంటే కథలు వ్రాయడం సులభమే కాబోలనిపిస్తుందెవరికైనా. అయితే మంచి కథ వ్రాయడం అంత సులభం కాదనే నా ఉద్దేశ్యం. మంచికథ వ్రాయాలంటే సృజనాత్మక శక్తి, సామాజిక అవగాహన, కథా శిల్ప పరిజ్ఞానం, విమర్శనా జ్ఞానం, ఎంత చిన్న విషయానికైనా స్పందించే హృదయం, ఇవన్నీ ఉండాలి. కొంత జీవితానుభవమూ ఉండాలి, ఇవన్నీ ఉన్నా తనలో ఉన్న ఆవేశాన్ని అదుపులో పెట్టుకొని, తానుగాకుండా పాత్ర దృక్పథంతో కథాంశాన్ని వ్యక్తపరచే నిగ్రహం ఉండాలి. ఇందులో ఏ ఒక్కటి లోపించినా వెలితిగానే ఉంటుంది.

ఆసలివేమీ లేకపోతే కథ మంచినీళ్ళ ప్రాయంగా వ్రాయొచ్చు.

ఇవాళ 'ప్రేమ' ఒక్కటే జీవిత సమస్య కాకపోయినా, ప్రేమ, సాఫల్యం, వైఫల్యం, ఎదురీత, అపార్థాలు, వియోగాలు, సుఖాంతం, లేక దుర్మరణం, లేక మతిభ్రమణం, అంతే. ఈ పరిధినుంచి ముఖ్యంగా రచ

యిత్రులు బయటకు రావడం లేదు. పత్రికల్లో ప్రచురించబడే కథల సంఖ్యకూ కథల బాగోగులకూ సంబంధం లేదు. సంఘంలో అనేక ప్రాంతాలవారున్నారు. అనేక వర్గాలవారు, అనేక వృత్తులవారున్నారు. అనేక వందల సమస్య లున్నాయి. వాటిని పరిష్కరించుకునే ప్రయత్నంలో, వారు అనేక రకాలైన నైతిక ఆర్థిక పరిస్థితుల నెదుర్కొంటున్నారు. అలాంటి నిత్య జీవిత సత్యాలను బయట పెట్టడానికి ఎన్ని కథలైతే చాలతాయి ? జీవిత విధానంలో అనేక మార్పులొస్తున్నాయి. ఏడాది క్రితం ఒక సమస్య ఏ రూపంలో ఉందో ఇప్పుడది ఆ రూపంలో ఉండడం లేదు; దీనిని సాహిత్యంలో చిత్రించాల్సిన ఆవశ్యకత నెవరూ గుర్తించడంలేదు. ఇన్ని పత్రికలున్నా ఇంతమంది రచయితలు రచయిత్రులూ ఉన్నా నిజమైన జీవితాన్ని మనం చూడలేకపోతున్నామంటే ఇది చాలా విచారించదగిన విషయం.

కొందరు వాస్తవిక చిత్రణ చేస్తున్నాం, అభ్యుదయ రచనలు సాగిస్తున్నాం అనుకొంటూ, కార్మికుడు గుర్తించలేని కార్మికులను సృష్టిస్తారు. ముగింపు ఎంత విషాదంగా ఉంటే కథ అంత రక్తి కట్టుతుందనే ఉద్దేశ్యంతో అతిదారుణ దృశ్యాల్ని చిత్రిస్తారు. అసలు పాత్ర స్వభావానికీ స్వరూపానికీ సంబంధం ఉండదు. జీతానికీ జీవిత విధానానికీ సంబంధం ఉండదు. వృత్తికీ భాషకు పొంతన లేకుండా అతుకుల బొంతలు తయారుచేసి గంతలు కడుతున్నారు. ముఖ్యంగా కాలేజీ లేక స్త్రీ పురుషులు పనిచేసే ఏ ఇతర సంస్థనయినా ప్రేమా లయాలుగా చిత్రిస్తున్నారు. విద్యార్థి చేయలేని దుర్మార్గాలు కనబడ్డంలేదు. నిజంగా ఈనాటి విద్యార్థులు, రాజకీయ నాయకుల చేతుల్లోనే కాక రచయితల చేతుల్లో కూడా రాళ్ళే అవుతున్నారు. ఎంతసేపూ లోపాలే తప్ప, తెలుగు రచనల్లోని వెలుగు కోణాలు మీక్కనిపించవా, అని మీరు నన్నాక్షేపించవచ్చు. ఉన్నారు. తల్చుకుంటే చేతులెత్తి మొక్కబుద్ధయే మహామహులున్నారు. ఈనాటి యువ, నవ రచయితల్లో, జీవితాన్ని జీవిత దృగంశాల్ని, అత్యంత సన్నిహితంగా పరి శీలించి వ్రాస్తున్నారు. కాని వ్యాపారం ఉక్కు పిడికిలిలో చిక్కుకున్న నేటి సాహి త్యంతో పోలిస్తే, వారి సంఖ్య ఎంత ఉన్నదే ప్రశ్న !

జాతి పురోభివృద్ధికి తోడ్పడాల్సిన బాధ్యత కాస్తోకూస్తో రచయితలకుందనే నా నమ్మకం.

కేవలం ప్రేమ విజయాలు వ్రాయడం, ప్రేమ వివాహాల్లోని కష్టాలు, నష్టాలు భూతద్దాల్లో చూపడమే కాకుండా వాస్తవిక జీవితాన్ని సమస్యల్ని, స్వరూపాల్ని, సమర్థవంతంగా చిత్రించాలి. ఎంత సుందర శిల్పకళాకుసుమాలైన వాటినీ ముడివేసే దారం వాస్తవికత కావాలి. కథా రచనకు శిల్పం, కళ పరికరాలై ముడి పదార్థం జీవితం కావాలి. నీడను చూసి బూచి అని పారిపోకుండా నిజాలకెదురు నిలచి, పోరాడి గెలిచే ప్రేరణను యువతరానికందీయాల్సిన బాధ్యత రచయిత్రులదే. రచయిత్రుల మీద ఉన్న అపప్రధలు తొలగిపోవాలన్నదే, ఎప్పటికైనా రచయిత్రి జాతికి గర్వకారణం కావాలన్నదేనా ఆకాంక్ష.

# నేటి కథ తీరుతెన్నులు

కె. వసుంధరాదేవి

కథను గురించి చెప్పాలన్నా, దాని తీరుతెన్నుల గురించి నిర్వచించట మన్నా కష్టసాధ్యమైన విషయం. అసలు 'కథ' అనేది మనకు ఈనాడు వచ్చింది కాదు. అనాదిగా వున్నదే. కాలక్షేపానికీ, నీతులు తెల్సుకోవడానికీ కథలు చెప్పు కోవటం, తీరిక వేళల్లో నలుగురూ ఒకచోట చేరి కథలతో కాలక్షేపం చెయ్యటం కొన్ని గ్రామాల్లో ఇప్పటికీ కనిపిస్తూ వుంటుంది. ఈమధ్య కాలంలో కథకు వచ్చి నంత ప్రచారం మరే ఇతర సాహిత్యానికీ రాలేదనవచ్చు. దీనికి ముఖ్యకారణం పత్రికా ప్రభంజనం. ఈ పత్రికలు వ్యాపార కేంద్రాలు కావచ్చు. కాని అవే రచయితలకు, రచయిత్రులకు మంచి ప్రోత్సాహాన్నిచ్చాయి. నెమ్మదిగా కథా రూపం మారుతూ వచ్చింది.

మొదట్లో కథ నవలలా సాగిపోయేది. అనేక పాత్రలతో కూడిన చాలా సంఘటనలుండేవి. తరువాత ఒక సంఘటన వర్ణించటమే కథ అయ్యేది. ఆ తరు వాత ఏ సంఘటనతోనూ అవసరం లేకుండా - ఒక వాతావరణాన్ని సృష్టించి వదిలెయ్యటం. ఇప్పుడిప్పుడు మరో తరహా వచ్చింది. దీనికి పైలక్షణాలేమీ అవ సరంలేదు. రచయిత చదువరిని మానవ స్వభావంలోకి తొంగిచూడనిస్తే చాలు. ఏదో ఒక చిన్న సమస్యను సూచిస్తే చాలు. అది కథే. అసలు మానవ జీవితాలు సమస్యాపూరితాలు. ప్రతి సమస్య ఒక కథ అవుతుంది. ఇలాగే ఎన్నో కథలు వస్తున్నాయి. వచ్చిన కథలన్నీ ప్రజాదరణ పొందటమూ లేదు. "అబ్బే! ఈ కథ బావుండలా! దీనిలో ఎత్తుగడే బావులేదు. గమన వేగంలేదు. క్లైమాక్స్ అసలే లేదు". అంటారు చాలామంది. ఇవన్నీ కథకు అవసరమే మో.కానీ- ఇవన్నీ

వుంటేనే అది కథ కావాలని ఎక్కడాలేదు. కథ పాఠకులను ఆకట్టుకోవాలంటే ఇవి కొంతవరకు తోడ్పడవచ్చునేమోగానీ, కథారూప నిర్వచనానికి మాత్రం ఇవి సహకరించవు.

అసలు 'కథ' అంటే ఏమిటి? అన్నదానికి స్వర్గీయ త్రిపురనేని గోపీచంద్ గారు చక్కని చిన్న నిర్వచనం చెప్పారు. అసలు ఆయన కథలే చక్కగా సూటిగా వుంటాయి. చెప్పదలచుకున్న దానికి రంగులు పులమకుండా, సూటిగా ఒక్కమాటలో చెప్పేవారు. 'నేనూ-నా పాత్ర' అన్నదానిలో కథను గురించి ఎంత చక్కని నిర్వచనం చెప్పారో చూడండి. "ఒక రోజు రాత్రి నేను కన్నుముయ్యగానే నా కథల్లోని ఒక పాత్ర వచ్చి నన్ను లేపింది. నేను నిద్రమొహంతోనే, "ఏమిటి, ఇప్పుడొచ్చావు?'' అని అడిగాను. నా పాత్ర బిక్కమొహం పెట్టుకొని, "నన్నిట్లా చెయ్యటం మీకు న్యాయం కాదు. నన్ను సృష్టించి, నా కథంతా వ్రాయకుండా, మధ్యలో విడిచిపెట్టటం మీకు భావ్యంకాదు. మీరెప్పుడూ నన్నిలాగే చేస్తున్నారు" అన్నది.

"నేను వ్రాసేది నీకథకాదు. నేను వ్రాసే కథల్లోకి కావలసిన అంశాలను నీ జీవితంలో నుంచి తీసుకుంటాను. మిగిలిన నీ జీవితం నాకనవసరం. నాపాఠకులకు అనవసరం. వెళ్ళు. నీ జీవితం వ్రాయించుకోవాలని వుంటే-మనకు చాలా మంది నవలాకారులున్నారు. వాళ్ళదగ్గరకు వెళ్ళు.'' అని మళ్ళీ నిద్రపోయాను. ఇంతవరకూ ఆ పాత్ర మళ్ళీ నామీద కంప్లయింటు చెయ్యలేదు.'' ఇలాగే కథల గురించి చెప్పుకుంటూపోతే ఎన్నోరకాలు. అన్ని సాహిత్య రూపాలకు మల్లేనే కథ కూడా మారుతూ వచ్చింది. కాలంతోపాటు మారుతూ వచ్చిన కథ పాఠకుల్లో కూడా ఎన్నో మార్పులను తీసుకువస్తోంది. సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిణామాలతోపాటుగా కథారూపంకూడా మారుతూ వచ్చింది. పఠితల మనస్సుల్లో చెరగని ముద్ర వేసుకుని కూర్చుంది.

మాకు తెల్సిన ఒకమ్మాయి వుంది. చాలా మెత్తనిది నా భాషలో చెప్పాలంటే ఒట్టి పిరికిది. ఆ అమ్మాయికి కాకరకాయ కూరంటే అయిష్టమేకాదు,

అసహ్యం. తల్లి ఆ కూర వడ్డించి, తిను అంటే, వచ్చే కన్నీటిని బయటకు రానీయ కుండా, ఆ కూరతోపాటు బలవంతంగా మింగేసేది. ఆ అమ్మాయికి చన్నీళ్ళస్నానమంటే చచ్చేభయం. గజగజలాడించే చలికాలంలో-తల్లి చన్నీళ్ళ స్నానమే చెయ్యమంటే-తల్లికి ఎదురు చెప్పేశక్తిలేక గడగడలాడుతూ ఆ చన్నీటి స్నానమే చేసేది. అలాంటి అమ్మాయి పుస్తకాలు చదవడానికి అలవాటుపడింది. మానసిక పరిణామం కలుగుతూ వచ్చింది ఆమెలో. పెద్దవారు కుదిర్చిన అబ్బాయితో మూడు ముళ్లు వేయించుకుని, కాపురానికి వెళ్ళిపోయింది. మూడు నెలలు గడిచాక ఒకనాడు అకస్మాత్తుగా పుట్టింటికి ఒంటరిగా వచ్చేసింది. "ఎందుకొచ్చావు?" అని అడిగిన తల్లిదండ్రులతో, "ఆ అబ్బాయి పెట్టే బాధలు నేను పడలేను. నేనిక అసలు అక్కడికి వెళ్ళనే వెళ్ళను. ఇక్కడే వుంటాను. మీకు భారమనిపించినా సరే, నా కాళ్ళ మీద నేను నిలబడగ ల్గేవరకూ మరెక్కడకూ వెళ్ళను" అంటూ నిర్భయంగా చెప్పింది. ఈ విషయం మీకు ఎందుకు చెపుతున్నానంటే- అందరినీ అలా చెయ్యమనీకాదు. అందరికీ ఇది ఉదాహరణా కాదు. తిండి, స్నానంలాంటి చిన్న విషయాల్లోనే తన అయిష్టతను వెల్లడించలేని ఆ పిరికి అమ్మాయి, తన జీవిత సమస్య గురించి ఒక నిర్ణయానికి రావటమే గాకుండా దాన్ని తల్లిదండ్రులకు ఎంత నిర్భయంగా చెప్పగల్గిందో చూస్తుంటే- ఆ అమ్మాయి మానసిక వికాసానికి పుస్తకాలు ఎంతగా దోహదం చేశాయో తెలుస్తోంది గదా !

మానసిక వికాసం అంటే నాకో విషయం గుర్తుకు వస్తోంది. షుమారు 16 ఏళ్ళ క్రితం "జీవిత నిర్ణయం" అనే కథ ఒకటి వ్రాశాను. అది అప్పుడే ఒక పత్రికలో వచ్చింది కూడా. 'పద్మ' అనే అమ్మాయికి తల్లి లేదు. తండ్రి, నాయనమ్మ ఎంతో ప్రేమగా పెంచి పెద్ద చేశారు. పద్మకు పెండ్లి నిశ్చయమయింది. వరుని వూరిలోనే వుంటున్న వీళ్ళ దూరపు బంధువు ఒకాయన వచ్చి, "పద్మకు కుదిర్చిన అబ్బాయి మంచివాడుకాడు. అతనికి అన్ని చెడు అలవాట్లూ వున్నాయి. కనుక మన పిల్లను ఇయ్యవద్దు," అని చెప్పి వెళ్తాడు. పద్మ నాయనమ్మ, కొడుకుతో. "ఒరే అబ్బాయ్! ఈ సంబంధం వదులుకుందాంరా. తెలిసీ

అలాంటి వాడికి పిల్లనెలా ఇస్తాము ?'' అని చెపుతుంది. దానికి పద్మతండ్రి ''చూడమ్మా! మనవాడికీ, వాళ్ళకూ ఏవో మనస్పర్ధలు వుండి వుంటాయి. అందు కని ఉన్నవి, లేనివి కల్పించి చెప్పివుంటాడు. ఆ కుర్రాడిని చూస్తే చెడ్డవాడిలా అనిపించలేదు. ఎంతో వినయ విధేయతలున్న వాడిలా కనిపించాడు. మధ్యవాడి మాటలునమ్మి ఇంత మంచి సంబంధం వదులుకుంటే, మళ్ళీ మనకు ఇలాటిదే మరో సంబంధం కుదరొద్దూ?'' అంటూ తల్లికి నచ్చజెపుతాడు. ఆ అబ్బాయితోటే జరుగుతుంది పద్మ పెండ్లి. పద్మ అత్తవారింటికి వెళ్ళిన కొద్దికాలానికే అతని అసలురంగు బయటపడుతుంది. పద్మను నానారకాలుగా హింసించి, ఆమె నగ లన్నీ హరింపజేస్తాడు. ఇంతలో ఏదో పండుగ వస్తుంది. పద్మను తీసుకు వెళ్ళ డానికి తండ్రి వస్తాడు. పద్మ బండిలో ఎక్కబోతుండగా, ఆమె అత్తగారు ''చీర కొందామంటే మనవూళ్ళో బట్టల కొట్లు లేవు. ప్రక్క టౌనుకు వెళ్ళిరావ టానికి సమయం లేకపోయింది. మీ వూరువెళ్ళాక నీకు నచ్చిన చీర కొనుక్కో!'' అంటూ పసుపుకుంకుమలతోపాటు ఓ వంద రూపాయల నోటుకూడా ఇచ్చింది. ఇచ్చింది వూరుకోక, ఆ డబ్బు పద్మ పెట్టెలో పెట్టించి మరల తాళం వేయించి, దగ్గరుండి బండిలో పెట్టించింది. పద్మ తండ్రి, భర్త కూడా అక్కడే వున్నారు. ఆ సమయంలో బండి ఎక్కబోతున్న పద్మదగ్గరగావచ్చి ''ఆ డబ్బు నాకు కావాలి. వుంచు'' అని గుసగుసగా చెప్పాడు-భర్త. పుట్టింటికి వచ్చిన రెండో రోజునే భర్త వద్దనుండి ఉత్తరం వచ్చింది పద్మకు.

''నీకు చీరకావాలంటే తరువాత కొనిపెడతాను కానీ నువ్వు చీర కొను క్కోకు. నాకు ఆ వంద రూపాయలు చాలా అవసరం. ఎట్టి పరిస్థితుల్లోను ఆ డబ్బు ఖర్చు చెయ్యకు. జాగ్రత్త! నా సంగతి తెల్సుగా!'' అంటూ హెచ్చరిక కూడా చేశాడు. ఆ మరునాటి ఉదయమే వస్తున్నట్లుగా కూడా వ్రాశాడు. నిర్లిప్తంగా చదువుకుంది పద్మ.

ఆ రాత్రి పద్మ తండ్రి కుమార్తెను పిలిచి, ''అమ్మా! అర్జెంటుగా ఓ వంద రూపాయలు కావలసివచ్చాయి. నీ దగ్గరుంటే ఇవ్వమ్మా''! అని అడిగాడు.

''నా దగ్గరెక్కడివి, నాన్నా?'' అనలేక అన్నది పద్మ.

''అలా అంటావేవిటమ్మా ? మొన్న వచ్చేప్పుడు చీర కొనుక్కోమని మీ అత్తగారు ఇచ్చిన వంద వుండాలిగా. అవి ఇవ్వు. తర్వాత మళ్ళీ ఇచ్చేస్తాలే నీకు.'' అన్నాడు.

"అవి కావాలి నాన్నా'' ! పద్మగొంతు పూడిపోతోంది అప్పటికే.

మరల రెండు, మూడుసార్లు అడిగి చూసి, ఇక లాభం లేదనుకుని అవతలికి వెళ్ళిపోయాడు పద్మ తండ్రి.

పద్మ మనసు మాత్రం పరిపరి విధాల పోసాగింది.

తండ్రి అడిగితే డబ్బు వుంచుకునీ ఇవ్వలేకపోయినందుకు ఎంతగానో బాధపడింది. ఇప్పుడు తండ్రికి ఆ డబ్బు ఇచ్చేస్తే, మర్నాడు ఉదయానికి వస్తున్న భర్తకు డబ్బు ఎలా ఇవ్వగలదు ! తండ్రి తిరిగి ఇవ్వటం ఆనేది జరగని పని. ఆయన ఇవ్వడని కాదు. ఆయన పరిస్థితి అలాంటిది. ఎంత మంచి నాన్న ఎలా అయిపోయాడు ! ఈ త్రాగుడుకు అలవాటు పడ్డాక ఇలా తయారయ్యాడు. ఈ అలవాటు మార్చుకోమని ఎంతగానో చెప్పి చూసింది తానిదివరలో. అయినా లాభంలేకపోయింది. ''నేనీ అలవాటు కావాలని చేసుకోలేదమ్మా ! మీ అమ్మపోయాక, ఆమె జ్ఞాపకాలనుండి తప్పుకోలేక సతమతమవుతూ నిద్రకు దూరమయ్యాను. అప్పుడు మిత్రుల సలహామేర నిద్రకు మందులా కొంచెం త్రాగి పడుకునేవాడిని. అదే నెమ్మదిగా అలవాటు క్రింద మారి, ఇప్పటికి పూర్తి వ్యసనమై కూర్చుంది. త్రాగకుండా బ్రతకలేనమ్మా!'' అని జాలిగా అనే తండ్రిని ఇంకేమని మాన్పించగలదు ?

పంటడబ్బు ఎప్పటికప్పుడు ముందుగానే అయిపోతుంది. రాబోయే పంటను పైర్లమీదే అమ్మేస్తాడు. అలాంటి ఆయన డబ్బు ఎలా ఇవ్వగలడు ? ఇలా ఆలోచిస్తూనే అన్యమనస్కంగానే భోజనం చేసి గదిలోకి వచ్చిన పద్మకు గుండె ఆగినంత పనయింది. తండ్రి అప్పుడే బయటికి వెళుతున్నాడు గదిలో

నుండి. ఆమె పెట్టె తెరచి వుంది. తాళం ప్రక్కగా పడివుంది. గబుక్కున మెడలోని పసుపుతాడు పైకి తీసి చూచుకుంది. దానికి కట్టిన తాళంచెవి దాన్నే వుంది. పెట్టె దగ్గరకు వెళ్ళి, డబ్బు పెట్టిన చోట చూచుకుంది. అది అక్కడ లేదు. కుప్పలా కూలిపోయింది పద్మ.

తెల్లవారేసరికి భర్త వస్తాడు. డబ్బుకోసం నానా హంగామా చేస్తాడు. తన భర్త ప్రతాపం ఇక్కడివారికి ఇంకా తెలియదు. డబ్బు ఎవరిదగ్గరైనా అప్పు తెద్దామంటే అది తీర్చే విధానం ఏది? తమ ఇంట్లో విలువైన వస్తువులు అంతగా మిగల్చలేదు తండ్రి. ఉన్న కొద్దిపాటి నగలు, సామాను తనకు ఇచ్చి పంపించారు. ఏనాడూ డబ్బులను తాకి ఎరుగని నాయనమ్మ వంద రూపాయలు ఎలా ఇవ్వగలదు? ఇలా పరిపరి విధాలుగా ఘోషిస్తున్న మనస్సుతో తల్లడిల్లిపోతోంది పద్మ.

ఉదయానే బస్సుదిగి, భార్య దగ్గరనుండి తీసుకోబోయే వంద రూపాయలతో ఏమేమి చెయ్యాలో వూహించుకుంటూ, సంతోషంగా కూనిరాగాలు తీసుకుంటూ అత్తవారింటికి వచ్చాడు పద్మ భర్త. ఒక క్షణం తత్తరపాటు కలిగినా వెంటనే గుంపులోకి జొరబడ్డాడు.

తల దగ్గర ప్రమిద దీపం వెలుగుతుండగా, మెడవరకూ తెల్లని బట్ట కప్పుకుని, వరిగడ్డిమీద పడుకుని వున్న పద్మ కనిపించింది అతనికి.

"రాత్రి పడుకోబోయే వరకు బాగానే వుందట. తెల్లవారే సరికి నూరేళ్ళూ నిండాయి. ఈ నిర్ణయం ఇలా రాసిపెట్టి వుంది." అని గుంపులోనుండి ఎవరో అంటున్న మాటలు కూడా అతనికి వినిపించాయి.

ఆనాడు ఆమె సమస్యకు ముగింపు అలా చేశాను. ఈనాడైతే పొరపాటున కూడా అలా చెయ్యను. అప్పటికి, ఇప్పటికి నా భావాల్లో ఎంతో పరివర్తన వచ్చింది. మానసికంగా ఎంతో ఎదిగాను. సమస్యలకు పరిష్కారం

చావు కాదు. జీవితం జీవించడానికేగాని, అంతం చేసుకోడానికి కాదు'' అని గట్టిగా చెపుతాను. ఒక సమస్య సూచించినప్పుడు దానికి పరిష్కారమార్గం కూడా చూపెట్టాలిగానీ, దాన్ని పాఠకులకే వదిలెయ్యటం నా అభిమతానికి విరుద్ధం.

నా చిన్నప్పటి నుండీ నేను ఎన్నో కథలు చదివాను. మునిమాణిక్యంగారి ''కాంతం కథలు'' నాకు ఎంతో నచ్చేవి ఆ రోజుల్లో- మిగిలిన వారి కథలను, వాటిలోని అర్థాలను ఆకళింపు చేసుకునే వయసు, పరిజ్ఞానం రెండూ నాలో లేక పోవటంవల్ల కావచ్చు. ఇప్పుడైతే మనకు ఎందరో రైటర్స్ వున్నారు. ఒక్కొక్కరు, ఒక్కోందుకు నచ్చుతారు ఇప్పుడు. ఇదే పరిణతి చెందటమంటే.

ఈ మధ్యే చదివిన ఒక కథ నాకు బాగా నచ్చింది. అది 'సౌమ్య గీతం'. నైట్ డ్యూటీ చేసివచ్చిన సౌమ్యకు తలస్నానం చేసే సరికి అలసట తీరినట్లుగా వుంది కానీ కళ్ళు మాత్రం విడనంటున్నాయి.

''బేబీ ! శైలేంద్ర నాన్నగారు ఉత్తరం వ్రాశారు. వాళ్ళందరికి నువ్వు బాగా నచ్చావట.'' తల్లి మాటలకు సౌమ్య నిద్రమత్తు ఒక్కసారి వదిలిపోయింది. కమ్మని ఊహల్లో తేలియాడ సాగింది. ఇంతలో ఆమె ప్రాణమిత్రురాలు వ్రాసిన ఉత్తరం వస్తుంది. ఆమె ఇప్పుడు శైలేంద్ర చేస్తున్న మరో వూరి మెడికల్ కాలేజీలోనే ఎం. డి. చేస్తోంది. తన పెండ్లి చూపులు కాగానే ఆమెకు ఉత్తరం వ్రాసింది సౌమ్య. ఇప్పుడు ఆమెవద్దనుండి వచ్చిన ఉత్తరం-తనను పొగడుతూ, శైలేంద్ర వంటివాడు తనకు భర్తగా దొరకబోవటం మహా అదృష్టం అని అభి నందిస్తూ వ్రాసి ఉంటుందని తలుస్తూ ఉత్తరం తెరుస్తుంది. సౌమ్య వూహలను తలక్రిందులు చేస్తుంది ఆ ఉత్తరం. ఇంతలో సౌమ్య తండ్రి వస్తాడు అక్కడకు.

''బేబీ! యూ ఆర్ వెరీ లక్కీ! శైలేంద్ర వంటివాడు నీకు భర్తగా లభించటం- ఓహ్! ఎంత అదృష్టం !'' సంతోషంగా చెప్పుకు పోతున్న తండ్రి మాటలకు అడ్డు తగులుతూ, ''నాన్నగారూ! నేను శైలేంద్రను చేసుకోను''

అంటుంది. ఆయన ఒక క్షణం అవాక్కయినా, వెంటనే తేరుకుని, "పిచ్చివేషా లెయ్యకు, నీ మారేజి శైలేంద్రతో జరిగి తీరుతుంది" అని కఠినంగా ఆజ్ఞాపించి బయిటకు వెళ్ళి పోయాడాయన. ఆ మాటలు విన్న తల్లి పక్కకు తప్పుకుంది మెల్లగా.

మళ్ళీ ఆలోచనల్లో పడుతుంది సౌమ్య.

అప్పుడే వూడ నుండి వచ్చిన సౌమ్య అక్క "ఏమిటీ, శైలేంద్రను చేసుకోనన్నావట, ఎందుకని ?" అని అడుగుతుంది.

"నా ఫ్రెండ్ ఉత్తరం వ్రాసిందక్కా! శైలేంద్ర తనకు బాగా తెలుసట" అంటూ ఆ ఉత్తరంలోని విషయాలు ఏకరువు పెడుతుంది సౌమ్య

"బేబీ ! నువ్వు ఒట్టి ఫూలిష్ ఫెలోవి. కాస్త కళ్ళు తెరిచి ప్రపంచాన్ని సరిగ్గా చూడు. త్రాగటం, తిరగటం ఈనాటి నాగరికత. కాకపోతే ముందుది కొంచెం పబ్లిక్కుగా చేస్తే, రెండోది కాస్త రహస్యంగా చేస్తారు. ఇలాంటి లక్షణాలు లేని అనాగరికుల్ని వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. ఇంత స్వల్ప విషయాల్ని భూతద్దంతో చూచి అనవసరపు ఆలోచనలు చేసి, బంగారం వంటి సంబంధం వదులుకోవటం ఒట్టి తెలివి తక్కువ. మగవాడు బయట ఎలా తిరిగితే మనకు ఎందుకు ? ఇంటిదగ్గర మనతో బాగా వుంటే చాలు; ఆలోచించుకో. ఇంత మంచి అవకాశం వదులుకోకు." సౌమ్యను వదిలి అక్క వెళ్ళిపోయింది.

ఈ శైలేంద్రను తప్పనిసరిగా చేసుకోవలసిన పరిస్థితు లేర్పడేలాగా ఉన్నాయే అని ఆలోచిస్తున్న సౌమ్య దగ్గరకు, ఆప్త మిత్రురాలు వస్తుంది.

శైలేంద్ర సంబంధం విషయం ఏమయిందని అడుగుతుంది.

అప్పటివరకూ జరిగినదంతా వివరంగా చెపుతుంది సౌమ్య.

"అలాంటివాడిని చేసుకుని సర్దిపెట్టుకుపోతూ సంసారం నెట్టుకురావలసిన కర్మ నీకెందుకే ? మగవాడి బలహీనతలన్నిటిన సహజ విషయాలుగా తీసుకుని,

క్షమించి సర్దుకుపోయే ఆడవాళ్ళున్నంతకాలం మగవాళ్ళ బలహీనతలు పెరుగుతూనే వుంటాయి. ఆ బలహీనతలకు వేలకొలదీ అమ్మాయిలు బలి అవుతూనే వుంటారు.

అసలు మగవాడి బలహీనతలకంటే హీనమైనది మీ చదువుకున్న అమ్మాయిల పిరికితనం, రాజీపడిపోయే ప్రవృత్తి. శైలేంద్ర గుణగణాలు తెలిసికూడా పెద్దవాళ్ళు చెప్పినట్లు సర్దుకు పోదామా, మానేద్దామా అని గుంజాటన పడుతున్నావే! నువ్వు కొంచెం 'రాష్' అని అతనికి ఎవరైనా చెపితే, ఇంతసేపు ఆలోచిస్తాడా ? "అలాంటి పిల్ల నా కొద్దు, పరమ పతివ్రతే కావా"లని కుండ బద్దలుకొట్టినట్టు మరుక్షణమే చెప్పేస్తాడు. ఇంక మీరెందుకే ఇలా కొట్టుమిట్టాడటం? స్త్రీ సహనశీలి, క్షమాశీలి. స్త్రీత్వమంటే సర్దుకుపోయి అందర్నీ ఆనంద పెట్టడమే అనే దొంగ కబుర్లకి లొంగిపోయి, మగవాడి నింకా బలహీనతల పుట్టను చేయకండి. మగవాడిని మానవత్వమున్న మనిషిగా, ఉన్నతుడిగా నిలిపే శక్తిగల స్త్రీత్వాన్ని మీరైనా పెంపొందించుకోండి" అంటూ ఉద్బోధిస్తుంది స్నేహితురాలు సౌమ్యను.

మిత్రురాలితో బ్రెయిన్ వాష్ ఇప్పించుకున్న తరువాత సౌమ్య ఏ నిర్ణయానికి వచ్చిందీ అందరూ గ్రహించే వుంటారు.

ఈనాటి సాంఘిక వ్యవస్థకు ప్రతిబింబాలు - సౌమ్యకుటుంబీకులైతే ఈ వ్యవస్థను చీల్చి చెండాడే రుద్రమలు సౌమ్య స్నేహితురాలులాంటి వాళ్ళు. ఇది కథకాదు. ఒక వ్యవస్థ. ఈ కథలోని పాత్రలు, వారి సంభాషణలు చక్కగా నడిపించారు రచయిత్రి. అనవసరపు అలంకారాలూ, ఉపమానాలు లేవు.

కొందరు-చెప్పదల్చుకున్నదాన్ని సూటిగా చెప్పటం రాక డొంక తిరుగుడుగా, ఒకటికి పది మాటలు చేర్చి చెపుతారు. భాషను, భావాన్ని చక్కగా ఆకళింపు చేసుకున్నవారు "నాకు వూహ తెల్సినప్పటినుండీ నేను ఇంతే" అని చెప్పదల్చుకున్నప్పుడు ఇలాగే చెపుతారు. అదే భావదారిద్ర్యంతో పాటు భాషాదారిద్ర్యం కూడా వున్నవారు, 'వూహ' అన్న చిన్నపదం తెలియక, సమయానికి

అది గుర్తురాక "నా చిన్నతనంలో, నేను తప్పటడుగులు వేస్తున్నప్పుడు, నాకు మాటలు సరిగా రాక జిలిబిలిపలుకులు పలుకుతున్నప్పుడు, నాకు సరిగా తెలిసీ తెలియని వయస్సులో -" అంటూ ఇలా చెప్పుకుపోతారు. తమకు సరిఅయిన పదం దొరకక ఇలా వ్రాశామని పొరపాటునకూడా ఒప్పుకోరు. పైగా, అసలు రచన అంటే ఇలాగే వుండాలి. అన్నీ ఇలా విపులంగా వ్రాయాలి పాఠకులకు తేలిగ్గా అర్థమయ్యేలాగా అంటారు.

అసలు వుత్తమ కథకులను, వారి విశిష్టతను నిర్ణయించడానికి ఏ కొల బద్దలు చాలవు. వారికి వారే సాటి. వారి కథల్లోని వస్తువు ఎప్పుడూ వర్తమాన సాంఘిక, ఆర్థిక వ్యవస్థలోని మలినాలను బహిరంగ పరిచేదిగా వుంటుంది. వారు కథ చెప్పేతీరు ఎంతో బావుంటుంది. అది ఎంత చిన్న కథయినా గావచ్చు. అలాంటిదే ఒక చిన్నకథ 'ఇది నిజం.'

ఇంటికి వచ్చిన మిత్రునికి ఆతిధ్యం ఇస్తారు ఆ దంపతులు. ఏకాంతంలో వున్నప్పుడు భర్త భార్యతో ఇలా అంటాడు! "ఛీ! ఛీ! నువ్వు ఒట్టి పనికి మాలినదానివి. నీకేమీ తెలియదు. ఇంటికివచ్చిన ఫ్రెండ్స్‌తో సరిగ్గా మాట్లాడ మన్నారాదు. నువ్వెందుకు పనికొస్తావు? ఒట్టి దేబిముఖానివి! ఇవాళ వచ్చిన నా మిత్రుని భార్య అబ్బ ఎంత బావుంటుందనుకున్నావు! ఎంత తెలివిగలదను కున్నావు! ఎంత బాగా మాట్లాడుతుంది. ఇంటికి వచ్చినవాళ్ళకు ఎంతో మర్యాద చేస్తుంది. క్రొత్తా పాతా లేకుండా చాలా చనువుగా మాట్లాడుతుంది. అందుకే ఆవిడంటే నాకు చాలా ఇష్టం" అంటాడు.

ఆ మిత్రుడు ఇంట్లోనే వుంటాడు. భర్త ఆఫీసుకు వెళ్ళిపోతాడు. మధ్యాహ్నం టిఫిను పెడుతుంది అతనికి ఆ ఇల్లాలు. మిత్రుడు ఆమెవంక చూస్తూ, "ఐలవ్ యూ!" అంటాడు.

ఆమె నిర్వికారంగా విని, నింపాదిగా ఇలా అంటుంది : "మేము చాలా ప్రగతిని సాధించాం, సాంఘికంగా ఎంతో ముందంజ వేశాం అనుకునే మీలాంటి

చాలామంది మగవాళ్ళకు-తమ ఇల్లాలు—ఆమె చేసే పనులకన్న - ఎదుటి వారి భార్య - ఆమె చేష్టలే బాగా నచ్చుతాయి. అందుకే మావారు, మీ భార్యంటే చాలా ఇష్టమన్నారు. మీరేమో నన్ను 'ఐ లవ్ యూ!'' అంటున్నారు. ఇది మీ తప్పుకాదు. మీరు నడుస్తున్న దారిది తప్పు. మీ వూహలది తప్పు'' అని అవత లికి వెళ్ళిపోతుంది.

పాత్రలు కథలమీద తమ ప్రభావం చూపిస్తే, కథలు పాఠకుల మీద బల మైన ముద్రలు వేస్తాయి. అవి మంచి కావచ్చు, చెడు కావచ్చు. అది ఆయా రచయితల రచనలమీద ఆధారపడి వుంటుంది.

ఒక రోజున మా ఇంటికి ఒక అపరిచిత యువకుడు వచ్చాడు. ''వారు ఇంతకుముందే ఆఫీసుకు వెళ్ళిపోయారండి!'' అన్నాను నేను, మావారి కోసం వచ్చివుంటాడనుకుని.

''నేను మీకోసమే వచ్చాను. మీతో కొంచెం మాట్లాడాలి'' అన్నాడు అతను.

లోపలికి వచ్చికూర్చున్న తరువాత ''ఏమండీ! టి. బి. వచ్చిన వాళ్ళు బ్రత కరనా లేక బ్రతకకూడదనా మీ అభిప్రాయం?'' అని సూటిగా అడిగాడు.

అసలు అతను ఆ ప్రశ్న ఎందుకు వేశాడో అర్థం కాలేదు నాకు. అదే అడిగాను.

''మీరు వ్రాసిన ఫలానా కథలో అతను టి.బి. వచ్చి చనిపోతాడు. అది చదివి నేను చాలా బాధపడ్డాను....''

''కథలోని వ్యక్తి టి. బి. వచ్చి చనిపోతే మీరు బాధ పడటం దేనికి?'' విస్మయం కల్గింది నాకు.

''నేను చాలా పుస్తకాలు చదువుతూ వుంటాను. ఈ మధ్య చదివిన మరో రెండు కథల్లో కూడా-అవి మీరు వ్రాసినవి కాదులెండి-టి.బి. వచ్చిన వాళ్ళిద్దరూ చనిపోయారు. ''అవి చదివాక భయం పట్టుకుంది నాకు.''

"ఎందుకు...?!"

"నా వయసు పాతిక సంవత్సరాలు. రెండేళ్ళ క్రితమే నాకు పెండ్లయింది. ఒక సంవత్సరం వయస్సున్న బాబు మాకు. నాకు జీవితం మీద ఎంతో మోజు. ఎన్నేళ్ళో బ్రతకాలని, ఎన్నో అనుభవించాలని కోర్కె నాకు బలంగా వుంది. ఆర్నెల్ల క్రితం నాకు టి.బి. వచ్చిందని డాక్టర్లు చెప్పారు. త్వరలో తగ్గిపోతుందనే ఆశతో వైద్యం తీసుకుంటున్నాను. ఇలాంటి స్థితిలోనే పై మూడు కథలు చదవడం తటస్థించింది. అప్పటి నుండి నాలో నిరాశ, భయం పెరిగాయి." బాధగా చెప్పాడతను. కొద్దిసేపు మూగదానిలా కూర్చుండిపోయాను. నన్ను నేను ఎంతగానో నిందించుకున్నాను. ఎంతో బాధపడ్డాను. ఆ కథలోని పాత్ర చనిపోతుంది గనుక ఆ సమయానికి టి.బి. అనే జబ్బుతో చనిపోయినట్లు వ్రాశాను. అలాగే ఆ ఇద్దరూ వ్రాసివుంటారు. మా వ్రాతలు ఇతనిమీద ఎంత బలమైన ముద్ర వేశాయి? జబ్బు త్వరలో నయమైపోతుందని ఎంతో ఆశతో బ్రతుకుతున్న అతని మీద మా కథలు అశనిపాతంలా పనిచేసి బాధా భయాలతో అతని మానసిక ఆరోగ్యం కూడా దెబ్బతినేలా చేసి, అతని జీవితానికే ప్రమాదం తెచ్చిపెట్టే స్థితి అది.

అతన్ని ఓదార్చి, ఎన్నో అనునయ వాక్యాలు చెప్పి, మా రైటర్స్ తరఫున క్షమాపణ చెప్పుకుని, అతనికి ధైర్యం చెప్పి పంపించాను. కానీ ఇప్పటికీ అతని రూపం నా కళ్ళముందు కనిపిస్తూనే వుంటుంది.

మనుషులు ఎన్నో రకాలు. వారి ఆకార స్వభావాదులు మరెన్నో రకాలు. అలాగే కథలు ఎన్నో, వాటి తీరుతెన్నులు మరెన్నో.

# నేటి నవల-రచయిత్రుల రచనలలో అవాస్తవికత

ఐ. వి. యస్. అచ్యుతవల్లి

ఈనాడు నవలా రచయిత్రుల సంఖ్య, అసంఖ్యాకంగా పెరిగి పోతోంది. ఈనాటి రచయిత్రులవి కాకమ్మ కథలనీ, ఒక కుటీర పరిశ్రమగా నవలా రచన మారిపోయిందని రచయిత్రులే అంటూ వుంటారు. రచయిత్రుల మీద ఇలాంటి హాస్యాస్పదమైన విమర్శలు, కార్టూన్‌లు రావడానికి కారణం ఏమిటి? రచయిత్రుల రచనలలో వ్రాయబడిన అవాస్తవిక సంఘటనలు. ఒక్క రచయిత్రుల రచనల లోనే అవాస్తవికత వుందనటం సబబేనా? అని ప్రశ్నించుకుంటే నేను ఇప్పుడు వినిపించబోయే వ్యాసం కేవలం రచయిత్రుల రచనలకే పరిమితమై వుండటమే కాక ఈ సభయొక్క ముఖ్య ఉద్దేశ్యము కూడ రచయిత్రుల రచనలలోని మంచి చెడులను రచయిత్రుల ద్వారానే తెలుసుకోగోరుట.

నేటి నవలలకు ప్రధానమైన లక్ష్యం కాలక్షేపం అన్నది తిరుగులేని నగ్న సత్యం. ఎందుకంటే, మనం బస్సు ఎక్కినా, రైలు ప్రయాణం చేస్తున్నా మనకు కనిపించే చేతులలో వివిధ రకాల వార పత్రికలు, నవలలు ఇవి ఎక్కువ మానసోల్లాసం కలిగించేవిగానే వుంటాయి. ఆలోచనలను రేకెత్తించే సబ్జక్ట్ కలవి చాల స్వల్పంగా వుంటాయి. అసంఖ్యాకంగా రచయిత్రులు నవలలు వ్రాస్తున్నా, వందకు పది అయినా పాఠకులు కలకాలం గుర్తుంచుకునే నవలలు వ్రాయలేకపోవడం మనకు అంత గౌరవం కాదు. ఎంతో ఉత్సాహంతో కలాన్ని ఉరుకులు పరుగులు తీయించి వ్రాస్తోన్న రచయిత్రులు, కొంచెం నిదానించి ఆలోచించి వ్రాస్తే చాలా మంచి రచనలు కలకాలం గుర్తుంచుకొనేవి వస్తాయి. గాని ఒక రచయిత్రివి నాలుగు పత్రికలలో సీరియల్స్ వస్తూవుంటే మనం కనీసం రెండు పత్రికలలోనైనా పేరు చూసుకోవద్దా అనే ఆరాటంతో మనం చూసిన తెలుగు సినిమాలలోని పదిసీన్లు విడదీసి వ్రాసి ఒక నవలగా రూపొందించి పత్రికల

మీదికి వదలడంవల్ల, రచయిత్రుల రచనలలో వైవిధ్యం కరువై పోతోంది. ఇంక నవలలు చదివితే ఏది సహజత్వం? ఏది అసహజత్వం? ఆ మాటకు అర్థం తెలుసుకోకుండా వున్నాము. ప్రేమలూ, త్యాగాలూ, కన్నీళ్లూ. అనవసరమైన ఈర్ష్యాసూయాలూ నిండివుంటాయి. సహనానికి మారు పేరు స్త్రీ అనే సామెత ఒకనాడు వుండేది. నేటి నవలా మణులు అసహనానికి ప్రతీకగా నిలబడుతున్నారు. ఒక నవలలో నాయిక హీరో తనతో ప్రేమ కబుర్లు చెప్పకపోవడం, కారణాంతరాల వల్ల తనని సినిమాకో హనీమూనుకో తీసుకువెళ్లక పోవటంతో అలక గృహం చేరుతుంది. ఇంకో నాయకుడు తల్లీ అక్కచెల్లెళ్లను ప్రేమగా చూడటం కోప కారణం! ప్రతి చిన్న విషయానికి అలిగి పుట్టింటికి వెళ్లిపోతుంది, ధనవంతురాలయిన నాయిక! అదే బీద అమ్మాయి అయితే తను లేకపోవటం వల్ల హీరో బ్రతుకు వృధా అని, అతనిని ఉద్ధరించడానికని, తనని నిర్లక్ష్యం చేస్తూన్నా అతన్నే అంటిపెట్టుకుని తిరుగుతుంది.

ఇంకా కొందరు సిసలైన త్యాగమూర్తులైన నాయికలున్నారు. భర్త మరొకరిని పెళ్లాడినా, భర్త కాళ్లమీద పడి మూడు నెలలో, ఆరు నెలలో అతని పాదాలవద్ద పడి వుండనివ్వమని ప్రాధేయపడతారు. రెండో భార్యతో అతని కాపురానికి ముప్పు రానివ్వమని హామీ కూడా ఇస్తారు. ఇంకోరకం హీరోయిన్లు తన తల్లి బ్రతుకును విలువలేనిదానిగా చేసిన దౌర్భాగ్యుడు తన జీవితంలో ఎదురుపడితే ''నాన్నగారూ!'' అంటూ కాళ్లమీద పడుతారు. ఇంకా మాట్లాడితే-

''పెద్దమ్మ కులాసాగా వుందా! నాకు ఇంకా తమ్ముళ్లూ వున్నారా?'' అంటూ పరామర్శ కూడా చేస్తారు. నాయకుడు పెళ్లికి ముందు తనకు గల స్త్రీ పరిచయస్తుల గురించి చెబితే విశాల హృదయంతో వారిని క్షమించేస్తారు.

అవివాహిత నాయికలు ఒక ప్రక్క నాయకుడ్ని అతని మాటలనీ చేష్టలనీ అసహ్యించుకుంటూనే అతని చుట్టూ తిరుగుతూ వుంటారు. అతని చిటికెన వ్రేలు తగిలినా ఒళ్లు జలదరించి పోయి మనసు పులకరించిపోతుంది. అమ్మాదయ

భావాలూ వ్యక్తిత్వమూ మొదలయినవన్నీ జలదరించే పులకరింపులతో కొట్టుకు పోతాయి. అంత చిరాకు తెప్పించే మాటలూ చేష్టలూగల యువకుడు ఉత్త ముడూ, ధీరోదాత్తుడూ అయిపోయి ఆమె ప్రేమకోసం తపించిపోతాడు. తమకు తోచిన మంచి మంచి విశేషణాలన్నీ రచయిత్రులు తమ నాయికలకే వాడేస్తారు. ఇంకా ఒకటి రెండు సద్గుణాలు మిగిలితే, నాయిక బామ్మకో, చెల్లెలికో ఇచ్చే స్తారు. పాపం! అత్త ఆడబిడ్డలు, తోటికోడళ్లు నిజ జీవితంలో లాగే నవలల్లో కూడా వీలయినంత కర్కశంగానే వ్యవహరిస్తారు. మన ఆంధ్రుల ఆడ పడుచు లకు సహజంగా వుండే అత్తవారి బంధు బలగంపై గల ఎలర్జీని మన విద్యాధికు లైన రచయిత్రులు కూడ విడిచిపెట్టలేక పోవడం నిజంగా ఎంతైనా విచారపడ దగ్గ విషయం! ఆ మధ్య ఒక నవలలో కాబోలు చదివినట్లు జ్ఞాపకం వస్తోంది. అరచేయి అంత కన్నంపడ్డ రుబ్బురోలుకి అడుగున పళ్ళెం పెట్టి పప్పు రుబ్బు కున్న నాయిక గురించి చదివాను. రుబ్బురోలుకి అరచేయి అంత కన్నం పడటం నేనెక్కడా చూడలేదు. వ్రాసిన రచయిత్రి గారింట్లో కాని, ఆ కథ ప్రచురించిన సంపాదకుల ఇంట్లో కాని వుండివుండవచ్చును. అరచేయి అంత కన్నం పడ్డ రోలులో పప్పు రుబ్బటానికెట్లా వీలవుతుంది? మగ రచయితలయితే ఆఁ. వాళ్ళెప్పుడన్నా పప్పు రుబ్బారా ఏమిటిలే! అని సరిపెట్టుకో వచ్చును. వంటిల్లు చూడని ఉద్యోగినులైనా అట్లాంటి ఉపమానం వాడితే పోనీ ఉద్యోగస్థురాలు, పప్పు రుబ్బే అవసరం ఆమె కేమిటి? అని వూరుకోవచ్చును. కాని సంసార పక్షపు ఇల్లాలు. అల్లాంటి ఉపమానం వాడితే- మనం ఉత్ప్రేక్షా లంకారం క్రింద జమకట్టుకోవాలేమో!

ఇల్లాంటి అవాస్తవిక సంఘటనలను విస్మరించి నిజ జీవితంలోంచి వస్తు వును ఎన్నుకుంటే ఎంతో అద్భుతమయిన కథా వస్తువులు అమరుతాయి. ఈనాడు సమాజంలో స్త్రీకి గల స్థానము - స్త్రీ పురుషులిద్దరూ సమానమనీ, స్త్రీలని పురు షులు అణచివేస్తున్నారనీ రకరకాల వాదోపవాదాలు వస్తున్నాయి. ఘోషాలో నాలుగ్గోడల మధ్యవుండే మహిళలు ఈనాడు ధైర్యంగా చదువుకుని ఉద్యోగాలు చేస్తూ సంసారాన్ని ఆర్థికోన్నతంగా మలుచుకుంటున్నారు. స్త్రీలు విరివిగా

చదువుకుని ధైర్యంగా మసలుతున్నా, ఏ రోజు పేపరు చదివినా మానభంగాల కేసులు. పోలీసుల సహాయం కోరితే వారే మరింత చెడు చేయటం! ప్రజల ధనమాన ప్రాణాలు కాపాడవలసిన రక్షకభటులే భక్షకులౌతుంటే వారికి నిరసనను కూడా తెలియచేసే ధైర్యం ఏ ఒక్కరికీ లేదు. అల్లాంటి నిస్సహాయురాళ్ళ కథలు అద్భుత నైపుణ్యంకల మన రచయిత్రులు సీరియల్స్‌గా వ్రాయవచ్చును. అత్యాచారాలని ఖండించగల శక్తి రచయిత్రుల కలాలకు రావాలి. అల్లి బిల్లి ప్రేమకథల పంజరంలోంచి, నైతిక బలం గల పాత్రలు రచయిత్రుల నవలల్లోకి రావాలి. ఆ రోజున రచయిత్రుల పాత్ర హాస్యాస్పదం కాదు. అవాస్తవికతను జారనీయకూడదు. మన సాంఘిక నైతిక కట్టుబాట్లను వివరిస్తూ వ్రాయాలి. మూర్ఖతను ఎదుర్కొనే శక్తిని నవలలోని నాయికలకు ప్రసాదించాలి. ప్రతి హీరోయిన్ ఒక రేప్ సీన్‌లో పాల్గొని చివరికి ఆ వ్యక్తినే వివాహం చేసుకునే పాత్రగా కాక అల్లాంటి దురదృష్టకర సంఘటన ఎదురైతే మనోధైర్యం, వివేకమూ గల యువతి ఎల్లా నిగ్రహించుకుని రాగలదో వివరించాలి. కాలక్షేపానికి బఠాణీల్లా ఈ నవలలు కాలక్షేపం బాగానే కలిగించుతున్నాయి. కాని బఠాణీలు ఎక్కువ తింటే అజీర్ణం కలుగుతుంది. శొంఠి మిరియాల కషాయం అవసరం అవుతుంది. కనుక కాలక్షేపం నవలల్లోంచి కనువిప్పు కలిగించే రచనల కోసం ఎదురు చూద్దాం.

# నేటి నవల - రచయిత్రులు

కుమారి జె. వి. సుబ్బలక్ష్మి

రచయిత్రులు అనగానే నవలలు వ్రాసే వారనో లేక నవలలు అనగానే రచయిత్రులు వ్రాసినవనో ఈ రెండు అభిప్రాయాలూ అందరిలో ఈనాడు గాఢంగా ఏర్పడి వున్నాయి. రచయిత్రులను గురించి మరిచిపోతే యీనాడు వస్తున్న నవలల్లో నూటికి తొంభై పాళ్ళు ఏ ప్రయోజనం లేకుండా వున్నవే. ఓ అమ్మాయి, ఇద్దరబ్బాయిలూ, ఓ అబ్బాయీ, ఇద్దరమ్మాయిలు ప్రేమ, ఎడబాటు, అపార్థం, ఒకరి చావు మరొకరితో పెళ్ళి, కథ సుఖాంతం. ఇలా వ్రాస్తే రోజుకో నవల లెక్కన వ్రాయొచ్చు. దాదాపు నేటి రచయిత్రులు అంతా యిలాంటి రచనలే చేస్తున్నారు. జీవితాన్ని యధాతథంగా చిత్రించకుండా రంగుల కలగా, హంగుల వలగా చిత్రించడం వల్ల యువతరం తప్పుదారులు పట్టే అవకాశం వుంది. ఇతివృత్తం ఇలా వుంటే ఇక పాత్ర చిత్రణ ఎలా వుంటుందీ - ఒక ఉదాత్తుడైన హీరో, సర్వ సద్గుణరాశి, వాడిలో లెక్కించదగ్గ దుర్గుణాలు వున్నా అవి సుగుణాలుగానే లెక్క (చేసుకోవాలి), వాడు తాగుతాడు (భరించలేని వేదనతో తాగాడని అనుకోవాలి). అమ్మాయిల జీవితాలతో ఆడుకుంటాడు (అది దక్షిణ నాయకుడి లక్షణం. ఆనాటి శ్రీకృష్ణుడూ అంతేకదా!) తన జీవితంలోకి ప్రవేశించిన హీరోయిన్ (ఇంతకుముందు వాడితో తిరిగిన అమ్మాయిలకు తక్కువకాదు) ని ''మనసారా'' ప్రేమిస్తాడు. కథ అనేక మలుపులు తిరిగి ''శుభం''తో ముగుస్తుంది. ఇక హీరోయిన్‌లో చెప్పుకోదగ్గ గొప్పతనం ఏమీ వుండదు. విలనంటూ ఒకడుండాలి. వాడికి ఎన్ని సుగుణాలున్నా, దుర్గుణాలంటూ ఒక్కటీ లేకపోయినా వాడిని చూస్తేనే హీరోయిన్‌కి

కోపం పాపం. వాడికి వెకిలి వేషాలు వెయ్యడం, హీరోయిన్‌ని తనవెంట తిప్పు కోడం రావు మరి. మనసులో వున్నది పైకి చెప్పేస్తాడు సూటిగా - (విలన్‌పై హీరోయిన్‌కి కోపం రావడానికి కారణం వాడామెనతిగా ప్రేమించడమే. ఖర్మకాలి వాడు దగ్గర బంధువైతే యీ ద్వేషం మరీ ఎక్కువవుతుంది.) విలన్ నవ్వితే హీరోయిన్‌కి వెకిలిగా అన్పిస్తుంది. హీరో నవ్వితే నవరత్నాలు రాలినట్లుంటుంది. తిట్టినా పొగిడినట్లుగా వుంటుంది. ఇలాంటివి చదివితే ఓ మనిషిమీద అకారణ ద్వేషం, మరొకరిమీద అవ్యాజ ప్రేమ కలుగుతున్నట్లు భ్రమ పుట్టడం అతి శయోక్తి కాదు.

ఇకపోతే వర్ణనలు - వంటయింట్లో పాత్రల అమరికను, ఆవకాయలోకి కావలసిన వస్తువుల పాళ్ళను గురించి శ్రద్ధవహించినట్లుగా నగరాన్ని, పరి సరాల్ని వర్ణించలేరు రచయిత్రులు కొందరు. హైదరాబాదులో బీచి అని ఒక రచయిత్రి రాస్తే, మరొకామె మరో విధంగా తన చాతుర్యాన్ని చూపింది. ఓ అమ్మాయి తలమునకలయ్యే సమస్యలతో సతమతమవుతూ, ఒంటరిగా టాంక్ బండ్ వద్ద కూర్చుని తన బాధలన్నీ తలపోసుకుని అర్ధరాత్రి యింటికి చేరు కుంటుంది. (అర్ధరాత్రిదాకా టాంక్‌బండ్ మీద కూర్చున్న అమ్మాయి ధైర్యాని కన్నా, వద్దు మొర్రో అంటున్నా వినకుండా ఆ అమ్మాయిని కూలేసిన రచయిత్రి ధైర్యాన్ని మెచ్చుకోవాలి.) ఇక మెడిసిన్ గురించి లాగురించి వ్రాసేవాళ్ళు ఆ విషయాల్లో నిపుణులను సంప్రదించరనేది వేరే చెప్పక్కర్లేదు.

రంగురంగుల సులోచనాలను పాఠక లోకానికి తగిలించి రాజేస్తున్న రచయిత్రి ఒకరైతే, మరొక రచయిత్రి దారుణంగా వీలైనంత అసభ్య భాషణాల చిట్టా తయారు చేస్తుంది. సూర్య చంద్రులను ఏకంచేసిన ఆ రచయిత్రి పాఠకు లను ఆకర్షించడానికి అసభ్యతే ముఖ్యమని అనుకుందేమోకానీ, ఆంధ్రభూమిలోని నళినీ ముఖులు కొందరు ఆ వాక్యాలను ఖండించినా కళ్ళు తెరవలేదామె. మరో అసభ్య భాషణాల రచయిత్రి తెలుగు పాఠకలోకంలో వెలగడమే కాకుండా షోడశ కళలతో పూర్ణచంద్ర బింబంగా ప్రకాశించడం మనకు తెలిసిందే. గుడి

రాళ్ళలా చలనంలేని రచయిత నడిచిన మైదానంలో ఆయన అడుగు జాడలనంటి నడుస్తున్నా మనుకుంటూనే స్త్రీలను హీనంగా చిత్రించే నవలా లోకానికి సెన్సారు కత్తెర అడ్డురాదుమరి. జీవితంలో కనీసం ఓ అసభ్యసన్నివేశమన్నా లేకుంటే ఆనందం వుండదనుకునే చిత్రవిచిత్ర రచయిత్రుల సంగతిక వదిలేద్దాం.

రచయిత్రులందరూ సామాజిక స్పృహ లేనివాళ్ళనడం దారుణమే అవుతుంది. రచయితల్లో ఇంటింటి కథలు వ్రాసే వారిలాగే రచయిత్రుల్లో కూడా సామాజిక దృక్పథంతో వాస్తవికతను దృష్టిలో పెట్టుకుని రచనలు చేసేవాళ్ళు ఉన్నారు. తరతరాల బానిసత్వంలో మ్రగ్గిపోతూ చాలినా చాలకున్నా భర్త పాదాల చెంత జానెడుచోటు వెతుక్కుంటూ, జన్మజన్మల బంధాలనూ నమ్ముతూ వుండే స్త్రీ లోకంలో జాగృతి కలిగించాలని కృషి చేసిన రచయిత్రులను వేళ్ళపై లెక్కపెట్టవచ్చు. చిత్రధ్వనిని సావేరితో మేళవించి ఆలపించి వాసిగాంచినవారూ, నానాటికీ వెర్రితలలు వేస్తున్న మరీచికలాంటి నాగరికతను గర్హిస్తూ, యువతరాన్ని సంస్కరించడానికి పూనుకున్నవారూ, రచనల్లో వైవిధ్యం తేగల ఘనత, ఓ నవలకూ మరో నవలకూ పోలిక లేకుండా వ్రాయగల నవత మాది అని సగర్వంగా చెప్పుకోగల మేటి మేధావినులు — సంఖ్యలో తక్కువైతేనేం— చిరస్థాయిగా నిలిచిపోగల నవలలు సృష్టించినవారు ఉన్నారు కాబట్టి రచయిత్రులకు పాఠకలోకంలో కొంత గురి గౌరవం ఉన్నాయి.

పత్రికలలో ధారావాహికంగా అచ్చు కావడమో, సినిమాలుగా రూపొందడమో నవలకు కొలబద్దగా అనుకుంటే మంచి నవలలు రావడం, రాయడం కష్టమే. రచయిత్రి పాత్రలను నడిపించకుండా. పాత్రలే రచయిత్రిని నడిపే ధోరణిలో ఇకమీదట నవలలు రావని, వచ్చినా పాఠకలోకం వాటి నాదరించదని గుర్తుంచుకుంటే మంచి నవలలు వ్రాయడం సులభమే. దేనికైనా ప్రయత్నం అవసరం.

# నవలలు - రచయిత్రుల దృక్పథం

డా॥ రావి భారతి

ఇది నవలల యుగం. నవలా యుగం కూడ. "ఆధునిక మహిళలు భారతదేశ చరిత్రను తిరిగి రచించగలరు" అని అర్థ శతాబ్ది క్రిందటే గురజాడ ప్రకటించాడు. ఈనాడు ఏ రంగంలోనూ అంతగా ఆసక్తి కనబఱచని ఆధునిక మహిళ, రచనా వ్యాసంగంలో, అందునా నవలా రచనా ప్రక్రియపై తన గుత్తాధిపత్యాన్ని ప్రకటించడం హర్షదాయకమైన విషయం. పరిశీలించిచూస్తే మహిళల నవలల్లో చాలా భాగం స్త్రీ జీవిత సమస్యలకే అధిక ప్రాధాన్యమిస్తున్నట్లు మనం గమనించవచ్చు. స్త్రీల జీవిత సమస్యలపట్ల రచయితలకంటె రచయిత్రులకున్న అవగాహన అనుభూతి దీనికి కారణం కావచ్చు.

ఆధునిక జీవితంలో అన్ని రంగాలలోనూ వచ్చే వేగవంతమైన మార్పులనూ వైవిధ్య పూరితమైన వాతావరణాన్ని ప్రతిబింబించే శక్తి ఉత్తమ నవల కున్నది. ఇది ఎలాంటి భావాన్నయినా ఎలాంటి వస్తువునయినా తనలో ఇమిడ్చుకోగలదు. హెన్రీ జేమ్స్ చెప్పినట్లు నవల అనేది ఒక గృహం అనుకుంటే దానికి అనేక రకమైన గవాక్షాల కవకాశమున్నది. ఈ విశాల ప్రపంచంలో మానవ దృశ్యాల్ని విలోకించడానికి దేన్నయినా తెఱచి చూడొచ్చు. స్వేచ్ఛగా తాను తలచిన విషయానికొక రూపకల్పన చేయవచ్చు. అంత మాత్రంచేత నవల వ్రాయడం నీళ్ళు త్రాగినంత సులభమనీ, కొంత అక్షర జ్ఞానం కలిగి, కాగితం, ఇంకు, కాస్త తీరికా ఉన్న రచయిత్రులు కార్ఖానాలు తెరిచి మాస్ ప్రొడక్షన్ స్థాయిలో నవలల్ని ఉత్పత్తి చేస్తున్నారనీ, అవన్నీ వంటింటి రచనలనీ-ఒక అభియోగం అంతటా వినిపిస్తున్నది. ఇది పూర్తిగా సత్యదూరం కాకపోయినా ఒక్క విషయం మాత్రం నిజం. ఎక్కడ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు

హెచ్చుగా ఉంటాయో అక్కడ బాధ్యతలు కూడా పదింతలు పెరుగుతాయి. ఈ విషయాన్ని గుర్తించిన కొందరు రచయిత్రులు నవలా రచనను ఒక సాంఘిక బాధ్యతగా, భక్తిగా స్వీకరించడాన్ని మనం కాదనలేము.

ఈ దశాబ్దికాలంలో దాదాపు 2,000 పై చిల్లర నవలలు, నవలికలు వెలువడ్డాయి. వీటిని రెండు భాగాలుగా విభజించవచ్చు. సమస్యలనుండి దూరంగా కాలక్షేపం కోసమో వినోదం కోసమో ఉద్దిష్టమైనవి మొదటిరకం. ఇవి మానవ అనుభవ పరంపరను పైపైన మాత్రం స్పృశిస్తూ తాత్కాలికంగా జీవిత సమస్యలనుండి తప్పుకోడానికి, మరిచి పోవడానికి నేర్పుగా వ్రాయబడతాయి. ఇక రెండవ రకం-ఇవి మన జీవితం గురించి అవగాహనను విస్తృతంచేసి అనుభవాల లోతుల్ని స్పృశిస్తూ నిశితంగా మనచేత భావింపజేసేవి. ఇందులో సమస్య - సంఘర్షణ - పరిష్కారం - రచయిత్రి దృక్పథాన్ననుసరించి ఒక క్రమంలో తీర్చబడి ఉంటాయి.

మొదటి రకానికి చెందిన రచనలే మార్కెట్‌లో అధికంగా కనిపిస్తున్నవి. ఈ రకానికి చెందిన కొందరు రచయిత్రులు తమ రచనల్ని తప్పుడు ఆదర్శాలకు అంకితం చేస్తున్నారు. ఒకానొక రచయిత్రి ఒక సభలో నవల గూర్చి తన దృక్పథాన్ని ఇలా వివరించారు:

"సామాన్యమైన మధ్య తరగతి గృహిణి నవల చదువుతూ కూతురు పెళ్ళి గురించి, రేషను గురించి, క్షణం క్షణం వేధించే ఆర్థిక ఇబ్బందుల గురించీ ఆలోచన మరచి ఆమె మనస్సుకోమాటు ఊరట కలుగుతుంది. కాస్సేపు ఈ లోకంలోంచి మరో లోకంలో విహరించి తృప్తిపడుతుంది." (కావిలిపాటి విజయలక్ష్మి-విజయవాడ సంచిక-రచయిత్రుల మహాసభ). నా అభిప్రాయంలో ఇలాంటి పలాయనవాద సిద్ధాంతాలు చాలా ప్రమాదకరం.

జీవిత సమస్యలనుండి పారిపోవడానికి, లేదా మరో లోకంలో విహరించడానికి 'నవలే' సాధనం కానక్కరలేదు. లోకంలో ఏ మత్తు పదార్థమయినా

ఆ పని అంతకంటె అధికంగా, అతి తొందరగా చేయగలదు. చుట్టుముట్టిన జీవిత సమస్యలను విస్మరింపజేసి మత్తులో ముంచడం కాదు నవల చేయవలసినపని. ఆ సమస్యల విషవలయం నుండి తప్పించుకోవడానికి అవసరమైన చైతన్యాన్ని, ఆలోచనల్ని ప్రేరేపింప గలిగిన పదార్థం మనకు రచనల్లో లభించాలి.

''సమస్యలకు పరిష్కారం సూచించి మనుష్యులను మార్చేపని రచయితది కాదు. అది సమాజం పని. వంటవాడి పని వండడం మాత్రమే. తినిపించడం కాదు. రచయిత బాధ్యతా అంతే'' (డి. కామేశ్వరి) తన రచనపట్ల ఒక లక్ష్యమును కాని, ఒక సామాజిక బాధ్యతనుగాని గుర్తించలేని మరొక రచయిత్రి మాటలివి. నిజానికి ఒక సమస్యను అత్యంత సహజంగా రచనల్లో చిత్రించినంత మాత్రాన రచయిత్రి బాధ్యత తీరదు. ఒక రోగి రోగలక్షణాన్ని కనిపెట్టినంత మాత్రాన వైద్యుని బాధ్యత తీరదు, రోగము యొక్క మౌలిక కారణాన్ని కని పెట్టి తగిన మందువేసినప్పుడే రోగనివర్తనం జరుగుతుంది. ఈనాడు కొందరు రచయిత్రులు ఉగజారుతున్న ఆర్థిక, సాంఘిక సమస్యలపట్ల ఆందోళనని కనబరచడం హర్షదాయకమే. యువకులు ఈనాడు ఎదుర్కొంటున్న నిరుద్యోగ సమస్యలు - ఒక మధ్యతరగతి లేదా క్రింది తరగతుల్లో చెలరేగే ఆర్థిక సంక్షోభం, గ్రామ పెత్తందార్ల నిరంకుశ ప్రవర్తనకు బలైపోతున్న పేదరైతాంగం, ఒకవైపు ఆకాశాన్నంటుతున్న ధరలకు, చాలీచాలని జీతాలకు సమన్వయం కుదురక సతమతమైపోయే సగటు ఉద్యోగి ఉదంతం - మరొకవైపు నల్లబజార్లలో లక్షలకు లక్షలు లాభాలు గడిస్తున్న సంఘ వ్యతిరేక శక్తులు - సాంప్రదాయపు ఇనుప చట్రంలో బంధింపబడి బాధపడుతున్న స్త్రీలు - ఉత్తమ ప్రమాణాలుగల కొన్ని రచనలకివి ముడిపదార్థా లీనాడు. అయితే ఒక సమస్యని సమస్యగా చిత్రించడం వేరు. వాటి మౌలిక కారణాలు శోధించి ఆ సమస్యలకు సజీవమైన అనుభవాలు ఆధారంగా పరిష్కార మార్గాల్ని సూచించడం వేరు. ఒక రచయిత్రికి ఎంతో ఆర్థిక సాంఘిక, రాజకీయ పరిజ్ఞానం, శాస్త్రీయ అవగాహన లేనిదే ఇది సాధ్యం కాదు. చాలా మంది రచయిత్రులు మిడిమిడి జ్ఞానం కలవారనీ, ''వీరు మేధావి వర్గానికి చెందరు'' అన్న అపప్రథ లోకంలో ఉన్నది. దానికి తోడు ఛాలా

మందికి వ్రాసే కోరికే కాని చదివే తీరిక చాలా తక్కువ. కనుక రచనకు పూను కున్న రచయిత్రికి తాను గ్రహించే వస్తువు వాతావరణం యొక్క సంపూర్ణమైన అవగాహన చాలా అవసరం. అద్దం ఒక వస్తువును యథాతథంగా ప్రతిబింబింప జేస్తుంది. దీపం ముందున్న వస్తువుల్ని కూడా గోచరింపజేస్తుంది. అట్లే ఒక రచయిత్రి వర్తమానాన్నే కాకుండా భవిష్యత్తులోకి కూడా చూడగలగాలి. అంటే అద్దంపని, దీపం పని రెండూ నెరవేర్చాలన్న మాట.

రచయిత్రులు కొందరు తమ వ్యక్తిగత విశ్వాసాలను వక్రీకరించి సామాజిక విశ్వాసాలుగా చెలామణి చేయడం భావ్యంకాదు. "కౌసల్యా సుప్రజా రామా"లతో మొదలైన కథ అష్ట వంకరలు తిరిగి చివరకు ఆ మూడు నామాల వాడే నాచేత వ్రాయించాడని నవలని ముగించడం, మానసిక దైహిక రుగ్మతల కన్నింటికి బాబాలను, అమ్మలను పరిష్కార మార్గాలుగా సూచించడం, నోములూ, వ్రతాలవల్ల కలిగే అశ్రమ సంపదల పట్ల ఆశల్ని చిగురింపజేయడం, కష్టాలకీ, కర్మ సిద్ధాంతానికీ ముడిపెట్టి "మనమంతా నిమిత్తమాత్రులం" అని పాత్రలచేత నీళ్ళు నమిలించడం, మడి ఆచారాల పేరుతో మానవత్వాన్నే కించ పఱచే సన్నివేశాల్ని చిత్రించడం - ఇవన్నీ రచయిత్రిలో జీవితం పట్ల ఒక శాస్త్రీయ దృక్పథం లోపించడంవల్ల కలుగుతున్న అవకతవకలుగా అభివర్ణించ వచ్చు. శాస్త్రీయ దృక్పథం లేనినాడు రచయితలు స్త్రీలయినా, పురుషులయినా సామాజిక వాస్తవికతను సాధించలేరు.

ఆధునిక స్త్రీ జీవితంలో జరుగుతున్న సంఘర్షణకు, సమకాలీన సామాజిక వ్యవస్థకు మధ్యగల సంబంధాన్ని చాలా మంది రచయిత్రులు అవగాహన చేసుకోకపోవడం విచారకరం. ఒక స్త్రీ యొక్క ఆర్థిక నిస్సహాయస్థితికి ప్రేమ, అనురాగం, త్యాగం-అన్న సెంటిమెంట్ల ముసుగువేసి తండ్రిపైనో, భర్తపైనో ఆధారపడే ఆలంబన జీవితాన్ని ప్రోత్సహిస్తున్న రచయిత్రులున్నారు. స్త్రీ కోల్పోతున్న వ్యక్తిత్వాన్ని సహనం, ఓర్పు, ఆత్మత్యాగాల పేరుతో బానిస మనస్తత్వాన్ని చిత్రించే రచనలే అధికం. ఈ స్థితినుండి స్త్రీకి విముక్తి కలిగించే

రచనలు లేకపోలేదు. రంగనాయకమ్మగారి 'స్వీట్‌హోమ్'లో విమల యొక్క వ్యక్తిత్వపు బుసలు మనకు ఈ విధంగా వినిపిస్తాయి. ''మగవాడు ఎలాంటి గొడ్డయినా ఆరాధనేనా నాకు. డర్టీ క్రీచర్! నీ మొగుడు ఎక్కడ నిలబడమంటే అక్కడ నిలబడు. అతని వెనకాల పెంపుడు కుక్కలా తిరుగు. దయతో ఎంగిలి బిస్కట్లు వేస్తాడు తిను. కోపంతో కాలి కొద్ది తంతాడు పడిఉండు''— ఇలాంటి తీవ్ర ధోరణులను కొందరు రచయితలు వికృతరూపందాల్చిన విమోచనోద్యమంగా, ఆత్మన్యూనతా భ్రాంతిగా అభివర్ణించడం నిజంగా విచారకరం. సమాజంలో స్త్రీ ఉనికినే విస్మరించే అవివేకులు, స్త్రీ వ్యక్తిత్వాన్నే అంగీకరించని పరమ ఛాందసులు, అలకపాన్పుమీద కోరిన కోరికలను డబ్బులేని మామగారు తీర్చలేదని తాళికట్టిన రోజునే పెళ్ళాన్ని ఏలుకోనంటూ తిరుగు ప్రయాణం కట్టిన గంగిరెద్దు పెళ్ళికొడుకులు, భార్యల్ని అకారణంగా అనుమానించి చిత్రహింసల పాలుచేసే పరమ కిరాతకులు ఈ సమాజంలో ఉన్నంతవరకు, విమలలకు, కరుణలకు, జానకులకు తిరుగుబాటు తప్ప గత్యంతరం లేదు. నిజానికి విమల యదార్థవాదిని. స్త్రీ చైతన్యానికి ప్రతీక. స్వీట్‌హోమ్‌లకు బదులు హాట్‌హోమ్‌లు అవతరించినా, బుచ్చిబాబులకు పిచ్చిబాబులు సృష్టింపబడినా, నిజం నిప్పులాంటిది. స్త్రీకి జరుగుతున్న అన్యాయాలు, ముఖ్యంగా మధ్యతరగతి మహిళలకు పురుషులు కల్పిస్తున్న సమస్యలు తక్కువేమీ కావు. కనుక దీనిని Castration Complex అనండి, ట్రేడ్ యూనియన్ స్పిరిట్ అనండి, లేదా వర్గపోరాట మనస్తత్వం అనండి-సమాజంలో పురుషాధిక్యత, అహంకారం ఉన్నంతవరకు ఈ విమోచనోద్యమజ్వాలలు ప్రజ్వరిల్లుతూనే ఉంటాయి. రచయిత్రులు సమిధల్ని చేరుస్తూనే ఉంటారు.

స్వీట్‌హోమ్‌లో విమలది అతిధోరణిగా కొంతవరకు అంగీకరించినా ''మీరంతా మంగళప్రదంగా పూజించే మాంగల్యం నాకు ఉరిత్రాడయింది. ప్రతి నిముషం నాకు నరకాన్ని చూపించింది. దాన్ని తెంచి పారేశాను. నేను చేసింది తప్పా''? అని సమాజాన్ని సవాలు చేసిన వాసిరెడ్డి సీతాదేవిగారి ''ఉరిత్రాడు''

లోని కరుణలోగాని, ''పసుపుత్రాడు పట్టుకొని దిగవిడిచి వచ్చిందికి నేను మీ యింట పుట్టిన పాడి ఆవును కాను. మీరు సొమ్ము పెట్టికొన్న భానిసను అంత కన్నా కాను'' అంటూ దుష్ట సాంప్రదాయాన్ని ఎదిర్చిన ద్వివేదుల విశాలాక్షి ''మారిన విలువలు'' లోని జానకిలోగాని, "నా దృష్టిలో పెళ్లంటే తాళిబొట్టు కాదు. మనసులో లేనిదానిని పైపైన ఎన్ని తగిలించుకొని ఏం ప్రయోజనం? నా నీతి సంఘం గిరిగీసిన సూత్రాలలో చిక్కుకుపోయేది కాదు" అని తిరుగ బడిన ఆనందారామంగారి "అజ్ఞాతబంధాల'' లోని లలితలో మనం గమనించేది వ్యక్తిత్వ నిరూపణమే కాని వికృత రూపం దాల్చిన విమోచనోద్యమచ్ఛాయలు గాని, ఆత్మన్యూనత కాని లేదన్న విషయం మనం గమనించాలి. ఏది ఏమైనా స్త్రీపురుష సమానత్వం సాధింపబడేవరకు ఈ సమరం తప్పదు. ఈ స్త్రీ విమోచ నోద్యమ ప్రభావం ఒక్క మన దేశ సాహిత్యం మీదనే కాదు ప్రపంచనవలా, సాహిత్యం మీద దీని ప్రభావమున్నది. కనుక పురుష రచయితలు భుజాలు తడుముకొనవలసిన పనిలేదు.

ఈ విమోచనోద్యమంలోనే ఒక భాగంగా స్త్రీ స్వేచ్ఛా ప్రణయానికి సంబంధించిన రచనలతో ఒక సుడిగాలిలాగా శ్రీమతి 'లత' సంఘంలో గొప్ప సంచలనాన్ని కలిగించారు. మానవులు సృష్టించుకున్న నైతిక విలువల పరిధి కంటె అతీతమైన, స్వచ్ఛమైన మానసిక పరిధిలో ఈమె రచనలు పరిభ్రమి స్తుంటాయి.

సమాజం - సంఘర్షణ - పోరాటం విప్లవంలాంటి పదాలను రాజకీయా లుగా భావించి రచయిత్రులు భయపడవలసిన పనిలేదు. సంఘ పరిణామాన్ని ఈనాడు నిర్ణయించే ఏకైక సాధనం రాజకీయం కనుక రాజకీయాల నుండి సాహిత్యాన్ని సంపూర్ణంగా వేరు చేసి చూపాలనే ప్రయత్నం నిరర్థకము, నిర్హే తుకము. ఒక రాజకీయ వ్యవస్థలోని బాగోగుల్ని ఎత్తి చూపే బాధ్యతను రచ యిత్రులు కూడా స్వీకరించాలి. సమత, మరీచిక, సంధ్యారాగం వంటి నవలలు

కొంతవరకు ఈ ఉద్దేశాన్ని నెరవేర్చడం ప్రశంసనీయం. ఈ రంగంలో రచయిత్రుల కంటె రచయితల కృషిని ప్రశంసించక తప్పదు. గోవులొస్తున్నాయి, ఈ దారి ఎక్కడికి, చీకటి రోజులు, కొండగాలి, మాపల్లె వంటి నవలలు రాజకీయ ఆర్థిక పోరాటాలకి ప్రతీకలుగా ఉన్నాయి. ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో విప్లవాత్మకమైన మార్పుల్ని ఆకాంక్షించే సామ్యవాద సిద్ధాంతాల ప్రభావం ఇలాంటి రచనల మీద బాగా కనిపిస్తున్నది. "ఈ సంఘ ప్రవృత్తి కంతటికి ఆర్థిక సమస్యలే మూల కారణం" అన్న మార్క్స్ సిద్ధాంతం యొక్క ప్రభావం కూడా రచయితలపై కనిపిస్తున్నది. రచయిత్రులలో దీని ప్రభావం చాలా స్వల్పం. ఇలాంటి రచనల్లో ధనిక పేద వర్గ పోరాటాలు కార్మిక యజమాని సంబంధాలు, పెట్టుబడిదారులు కూలీలు - వీరి ఉదంతాలే వీటికి ఊపిరి. మొత్తం మీద ఆర్థిక సాంఘిక సమానత్వాన్ని సాధించడమే వీరి ధ్యేయం. కొందటి అభిప్రాయంలో ఈ సమానత్వం ప్రకృతి విరుద్ధం. ఒకే తల్లి కడుపున పుట్టిన బిడ్డలలోనే సమానత్వము సాధించలేము కదా ! ఇక సమాజంలో సమానత్వం సాధించడం అసంభవం అంటారు వీరు. భౌతిక నిత్యావసరాలయిన భూములు, సంపదలు మొదలయిన వస్తువులు పంచవచ్చునేమో కాని, మానవుని ఆంతరంగిక విషయాలైన ప్రతిభ, కళ, సౌందర్యము మొదలగు వానిని పంచడం ఎట్లా సాధ్యమౌతుంది ? కనుక సంపూర్ణ సమానత్వం సాధ్యంకాదని వీరివాదం. ఈ అభిప్రాయంతో నే నేకీభవించలేను. ఈ లోకంలో అర్థం ఎన్నో ప్రయోజనాల్ని నెరవేరుస్తుంది. అవసరమయితే విజ్ఞానాన్నే కొనగల శక్తి దానికున్నది. ఏ కుటుంబమయితే లేమితో బాధపడుతుందో ఆ కుటుంబ సభ్యులు శారీరకంగా, మానసికంగా అభివృద్ధి చెందడం అసాధ్యం. తమ పిల్లలకు సరియైన ఆహారం గాని, పరిశుభ్రమైన మానసిక వాతావరణాన్ని గాని కల్పించలేరు. లేమితో బాధపడే వ్యక్తి తనకు తాను తక్కువ అంచనా వేసుకుంటాడు. అతనిలోని సృజనాత్మక శక్తులన్నీ నశించి పోతాయి. మొత్తం మీద లేమివల్ల అసమర్థత పెరుగుతుంది. అసమర్థత దారిద్ర్యానికి దారితీస్తుంది. దారిద్ర్యం ప్రతిభను పాతర వేస్తుంది. ఇదొక విషవలయం. కనుక అర్థం ఒక్కటే మానవుడిలోని ప్రతిభను పెంచుతుందని చెప్పలేను కాని, ప్రతిభను పెంచడంలో డబ్బు ముఖ్యమైన పాత్రను వహిస్తుందనడంలో సందేహం లేదు.

కొందరు రచయిత్రుల్లో ధనికవర్గ జీవనవిధానంపట్ల మానసిక బాని సత్వం బాగా కనిపిస్తున్నది. ఒక అందమైన యువకుడు లేదా యువతి. అత్యం తాధునిక సౌకర్యాలతో కూడిన భవనాలు, కార్లు, చుట్టూ తోటలు-తోటమాలులు-సేవకులు, ఫోమ్‌బెడ్లు, మెత్తని తివాసీలు, అవసరమయితే హెలీకాప్టర్ ప్రయాణాలు - ఏర్‌కండిషన్డ్ రూములు - ఇదొక రంగు రంగుల స్వప్నం. మధ్య తరగతి పాఠకులకు రమ్‌లాంటి మత్తుమందు. కొందరు రచయిత్రులు ఈ విధంగా ప్రశ్నించవచ్చు; "ఈ దేశంలో ప్రతి వ్యక్తికి ఒక కారు, అందమైన ఇల్లు- ఉన్నతమైన ఉద్యోగము ఉండాలని రచయిత్రులు ఆశించడం తప్పా?" (లత) అని. అయితే అసమానతల అంతరాలు రోజు రోజుకి అధికమౌతున్న ఈ వ్యవస్థలో, అవకాశవాదం, అధికార దాహం, ఆత్మవంచన అందల మెక్కించిదులు త్రొక్కుతున్న ఈ రాజకీయ ప్రపంచంలో, కులతత్త్వాలు వేర్లు పాతుకొనిపోయిన ఈ సంఘంలో ఆ ఆశలు ఎంత వరకు ఫలిస్తాయి? కనుక కేవలం ఆశించడంవల్ల ప్రయోజనం నెరవేరదు. సమాజంలో ఈ భోగ భాగ్యాలు అయిదు శాతమే ఎందుకు అనుభవిస్తున్నారు? తొంభైఅయిదు శాతం ప్రజలు ఎందుకు దానినుండి వంచింపబడుతున్నారు? ఈ విషయం బట్టబయలుచేసే బాధ్యత రచయితలది.

ఇంకపోతే సినిమటిక్ సంఘటనల ప్రభావం చాలా మంది రచయిత్రుల ఆలోచనా సరళిని ఆకట్టుకుంటున్నది. ఈ రకం నవలల్లో కథపట్ల ఆసక్తిని పెంచేగుణం అధికం. "సెక్రెటరీ"లోని నాయికగాని, "ఆహుతి"లోని నాయకుడుగాని ఉద్యోగాన్వేషణకు బయలుదేరే నేటి సమాజంలోని యువతీ యువకులే. కాదనలేము. కాని వారు నవలల్లో ఎదుర్కొంటున్న ప్రణయ సన్నివేశాలుగాని, మానసిక సంఘర్షణలుగాని, పట్టుదలలుగాని, త్యాగాలు గాని వాస్తవ ప్రపంచంలో చాలా అరుదుగా కనిపిస్తాయి. ఆ పాత్రలనంటి పెట్టుకున్న సమస్యలు కూడా సమాజంలోని సామూహిక సమస్యలు కాక కేవలం వ్యక్తిగత సమస్యలు. ప్రేమ- పెండ్లి- లేదా ప్రేమ-త్యాగము ఇవి మాత్రమే జీవితంకావు. జీవితంలో

"ఒక భాగం" మాత్రమేనన్న మాట మరువరాదు. నిజానికి జీవితం అనేది ఏ నియమాలకు కట్టుబడి ఉండదు. అదొక మహాప్రవాహం. ఎగుడు దిగుళ్ళతో, అసంబద్ధంగా సాగిపోతూ ఉంటుంది. నిజజీవితంలో ఈ మూసలో పోసిన, ఇతి వృత్తాలు, హీరోలు, హీరోయిన్లు, విలన్లు ఉండరు. నవలల్లో పాఠకుల్ని దగా చేస్తున్న పాత్రలివి.

ఉ:- ఒక నవలలో భర్తను అనుమానించిన భార్య మాటలివి: "మీ లాల్చీ మీద కాటుక చారలు, బుష్‌షర్ట్‌మీద లిప్‌స్టిక్ ముద్రలు, మీ ఉంగరాల జుట్టులో ఇరుక్కున్న మల్లెపూలు. చెప్పండి నా అనుమానం అబద్ధమే నంటారా?" ఈ భర్తగారి అవతారం వాస్తవ జీవితంకొకంటె సినిమా వేషానికైతే సరిగ్గా సరి పోతుంది.

ఫ్రాయిడ్, ఆల్‌ఫ్రెడ్ ఆడ్లర్, యూంగ్, బ్రిల్ మొదలైన మనస్తత్వ శాస్త్రజ్ఞుల సిద్ధాంతాల ప్రభావం ఫలితంగా ఈనాడు కొన్ని మనో వైజ్ఞానిక నవలలు వెలువడుతున్నాయి. ఇవి సమాజవాదానికి, సామూహిక సాంఘిక సమస్యలకు అతీతంగా, ఒక వ్యక్తి యొక్క అంతరంగపు అలజడికి అద్దం పడుతున్నాయి. రచయిత్రులపై కూడా దీని ప్రభావం కొంత కన్పిస్తున్నది. అహం-అనురాగం, అందానికి సమాధి, ఏది సత్యం ఏదసత్యం మొదలయిన కొన్ని నవలలూ, చైతన్య స్రవంతి ధోరణిలో పయనించే "అంతరంగ తరం గాలు" వంటి నవలలు మానవ మనస్తత్వ వైచిత్రిని ప్రదర్శించడంలో కొంత వరకు క్రొత్త పుంతల్ని త్రొక్కినమాట వాస్తవం. అయితే మానవుడు తన కనీసపు కోర్కెల్ని తీర్చుకోలేక అలమటిస్తున్న ఈ రోజుల్లో, ఆర్థిక సమస్య ఒక పెనుభూతమై సమాజాన్ని పట్టిపీడిస్తున్న ఈ తరుణంలో, సాంఘిక దురా చారాలు జాతిని నిర్వీర్యం చేస్తున్న ఈ సందర్భంలో కేవలం వ్యక్తుల యొక్క అంతరంగపు గొడవల్ని భూతద్దంలో చూపడం అవసరమా? ప్రసిద్ధ రచ యితలను, విమర్శకులను వేధిస్తున్న ప్రశ్న యిది. నిజానికి సంఘంలోని సమ స్యలు ఎంత ముఖ్యమో ఆ సంఘంలో ఒక భాగమైన వ్యక్తి అంతరంగ సమ

స్యలు కూడా అంతే ముఖ్యం. కాకపోతే ఏవి తక్షణ సమస్యలో వాటిపై రచయితలు దృష్టి కేంద్రీకరిస్తూ అంతరంగ సమస్యలకు, సాంఘిక సమస్యలకు ఒక సమన్వయాన్ని సాధించవచ్చు.

రచన ఒక ఉద్యమం లాంటిది. ఒక ఉమ్మడి లక్ష్యం గల ఏ ఉద్యమ లక్షణాలనైనా రచనకు అన్వయించవచ్చు. రచయిత్రులు కొన్ని ఉమ్మడి లక్ష్యాలనేర్పరచుకొని సామాజిక విలువల్ని ఎప్పటికప్పుడు తెలియజేస్తూ సామూహిక సమస్యలపై దండెత్తాలి. ఒక రచనకు ఉద్యమ స్వభావము, ఒక తాత్విక ప్రాతిపదికతో పాటు అప్పుడప్పుడు ఆత్మవిమర్శకూడా అత్యంతావశ్యకము. ఆత్మ పరిశీలన అభ్యుదయానికి మొదటిమెట్టు. ఇలాంటి సభలు ఆత్మ విమర్శకు అవకాశాన్ని కల్పిస్తాయి. కనుక రచయిత్రులు చిత్తశుద్ధితో ఇంకా ఉత్తమ ప్రమాణాలు గల నవలా సాహిత్యాన్ని సృష్టించి, సామాజిక ప్రయోజనాన్ని నెరవేరుస్తూ, వ్యాపార, కీర్తి చాపల్యాలను మించిన స్థిరచిత్తం చిత్తశుద్ధి అలవరచుకోవాలని ఆశిస్తున్నాను.

# సినీమాలు - సంఘంపై వాని ప్రభావం

కోడూరి లీలావతీదేవి

జీవితానికి విద్య, వివేకం, విజ్ఞానం-వినోదం తప్పనిసరిగా కావల్సినవే. ఇందులో ఏ ఒక్కటి లోపమైనా వెలితిగానే ఉంటుంది.

పండితులకూ పామరులకూ కూడా వారి వారి మానసిక, శారీరక శ్రమలను మరచిపోవడానికి వినోదం విధిగా కావాలి.

అందుకే ఆదినుంచీ తోలుబొమ్మలు, నాటకాలు, భామాకలాపాలు, గొల్ల సుద్దులు ఎన్నో ఎన్నో వినోదాలు.

ఈ వినోదం కోసమే భాణము, వీధిమొదలైన దశవిధ రూపకా లేర్పడ్డాయి.

కాలంలో తేడా ఉన్నా, అభిరుచుల్లో తేడా ఉన్నా అలసిన జీవితాలకు సుద్దుల గొల్లలు వినోదం ఎలా అందించేవారో హంసవింశతిలో ఈ సీసం చెప్తుంది.

> ''ఫెళఫెళ వీరణాల్ ఖళిపెళి వాయించి
>
> పోటులో కొమ్మలు నాటనూది
>
> ..................
>
> కులము పెద్దలామికొనగ జెప్పి
>
> శివము పుట్టించి............
>
> సుద్దుల గొల్లలు సంతసిల్లి''

ఈనాడు పండిత పామరులకు వినోదం అందించి అందరికీ అందు బాటులో ఉండేవి ఈ సినీమాలే,

పాట, పద్యం, కథ, అభినయం, ఆనందం, ఆహ్లాదం అన్నీ ఒకేసారిగా అతి చౌకగా లభ్యమవుతున్నాయి. అందుకే సినిమాలంటే అందరికీ, ముఖ్యంగా యువజనులకు కార్మికులకు, శ్రామికులకు చాలా మోజు. వీరి మోజును దృష్టిలో పెట్టుకొనే నిర్మాతలు లక్షలు లక్షలు పెట్టుబడిని పెట్టి చిత్రాలను నిర్మిస్తున్నారు. ఈ సినీమా ఒక పెద్ద పరిశ్రమగా రూపొందింది.

నిర్మాత, దర్శకుడు, కథకుడు, సంగీత దర్శకుడు, పాటల మాటల రచయితలు, నటులు, నర్తకులు నృత్య దర్శకులు, అనేకమంది సాంకేతిక నిపుణులు ఇలా ఇలా ఎంతమందో కలసి రూపొందించే సహకార పరిశ్రమ ఇది.

అయితే ఈనాడిది పెద్ద చర్చనీయాంశమై కూర్చుంది. సినీమాలవల్ల సంఘం పాడైపోతూందని, సినీమా సాహిత్యం అశ్లీలాలతో అసహ్యంగా ఉంటూందని. అందుకే ఈ గోష్ఠి.

మంచి-చెడూ వెలుగునీడల్లా ఏ విషయంలోనైనా ఉండనే ఉంటాయి.

మహాత్మాగాంధీ గారికైతే చలనచిత్రాలమీద మంచి అభిప్రాయం లేదు. ఆయన దృష్టిలో "జీవితమే చక్కని కళ". "ఏ వ్యక్తి అయితే చాలా ఆదర్శమైన జీవితం గడపగలడో అతడు చాలా గొప్ప కళావేత్త అనీ-ఉన్నత జీవితం అనే పునాది లేని కళ ఏముంది" అనీ అంటారాయన.

సరి, అది ఈనాటి వారికి ఎంతవరకూ రుచిస్తుంది ? 'మహాత్మలం' కాని మనం మాత్రం సినీమాలను బాగానే అభిమానిస్తున్నాం,

ముందు సినీమాల్లోని సాహిత్యాన్ని గూర్చి చూద్దాం—

సినీమాల్లో సాహిత్యం ఏమిటి? అది అంతా అశ్లీలాల మయం, ద్వంద్వార్థాల పుట్ట అని గోల పెట్టేవారు కూడా సినీమాల్లో వినిపించే ఈ చక్కని తియ్యని సాహిత్యాన్ని కాదనలేరు, ఇంక చూడండి.

"ఆవేశమున్నది ప్రతి కళలో
అనుభూతి ఉన్నది ప్రతి హృదిలో"

అనే ఆత్రేయ రచన "ఇది కథకాదు"లో- ఎంత రసగుళికలా ఉంది!

అలాగే వేటూరి "కృష్ణాతరంగాల సారంగరాగాలు సస్యకేదారాల సరస గాంధర్వాలు"

నారాయణ రెడ్డి "తోటలో నారాజు తొంగిచూచెను నేడు
నీటిలో ఆ రాజు నీడ నవ్వేను నేడు
నవ్వులా అవి కావు నవపారిజాతాలు
రవ్వంత సరిలేని రసరమ్యగీతాలు"

ఎంత మధురంగా ఉన్నాయి! ఈ పాటలకోసమే సినీమాను రెండేసిసార్లు మూడేసిసార్లు చూసేవారుంటారంటే అతిశయోక్తిలేదు.

నిజమే- "చూడు చిన్నమ్మ పాడుపిల్లడూ" లాంటి పాటలూ ఉన్నాయి. ఇవి యువతరాన్ని ఉద్రేకపరచి పాడుచేస్తున్నాయనేది ఓ వాదం.

కాని సినీమాలవల్లే చెడుగంతా లోకంలో జరిగిపోతుందనే వాదంతో నేనేకీభవించను. సంఘంలో ఉండే అనేక దురాచారాలు, దుర్మార్గాలు, అత్యాచారాలు యువజనుల మీద ఎంతో ప్రభావాన్ని చూపిస్తున్నాయి.

దుర్బల మనస్కులు ఏ యుగంలోనూ ఉంటూనే ఉన్నారు. నాటి కీచకుడు, దుశ్శాసనుడు ఏ సినీమాలు చూసి ప్రభావితులయ్యారు ?

సత్య హరిచంద్ర సినీమా చూసి సత్యాన్నే నమ్మిన వారెంత మంది ? వర విక్రయం సినీమా చూశాక కట్నాల సమస్య సమసి పోయిందా ? ప్రతిరోజూ వార్తా పత్రికలలో ఈ కట్నాల కోసం ఎన్ని చావులు మనం చదవడం లేదు?

నైతిక పతనం, ధన ప్రలోభం ఎక్కడ చూచినా తాండవిస్తూంది. "ఎందెందు వెదకి జూచిన నందందే గలదు."

యువజనులకు ఆదర్శాలను చూపించవలసిన విద్యాలయాలల్లో గురువులు, ఇంట్లో పెద్దలు కూడా సరియైన పద్ధతుల్లో ఉన్నారా ?

రాజకీయాలొక ప్రక్క, నిరుద్యోగ సమస్య మరొక ప్రక్క కరాళ నృత్యాలు చేస్తూంటే యువజనుల మీద, సంఘం మీద భోగలాలసత ప్రభావం ప్రచ్ఛన్నంగానే ఉందని చెప్పాలి.

దీనికి ఒక్క సినిమాల్లో చూపించే అశ్లీలకర దృశ్యాలే కారణం కావు. కాని అసభ్యకర దృశ్యాలను చూపించి డబ్బు చేసుకునే రోజులెప్పుడో పోయాయి అనడానికి ఈనాడు ఆబాలగోపాలం మెచ్చిన 'శంకరాభరణమే' నిదర్శనం.'

హాయిగా అన్నా చెల్లెలు, తల్లీ కొడుకూ సినిమాని చూసి ఒకరి ముఖాన్ని ఒకరికి చూపించుకొనే గౌరవంతో ఉండే సినిమాలు అవసరం కాదనీ, సంఘానికి శ్రేయోదాయకం కాదనీ అనుకోకుండా ఎలాగుండగలము ?

ఏది ఏమైనా ప్రేక్షకుల అభిరుచిని బట్టే వారు సినిమాలు తీసేది. సినిమా కేవలం ఒక వ్యాపారం. దాన్ని వారు పూర్తిగా కళా సేవకు అంకితం చేసి 'చేతులు కాల్చుకోండి, డబ్బంతా తగలేసుకొని తిరిపెమెత్తుకోండి' అని ఎలా అనగలం ?

అవార్డు సినిమాలని ఏవో కొన్ని ఆదర్శాలతో నిర్మిస్తున్నారు. అయితే వాటికి కీర్తి ధనమే కాని అసలు ధనం తక్కువగా ముట్టుంది.

నన్నడిగితే సినిమాల కన్న సినిమా పత్రికలు, పోస్టర్లు యువజనులను పిచ్చివారిని చేస్తున్నాయేమో ననిపిస్తుంది.

సినిమాలో సెన్సారు కత్తెర పడిన సన్నివేశాలు కూడా సినిమా పోస్టర్లలో పెద్దగా అచ్చువేసి గోడల మీద అంటించి వేస్తే తిరునాళ్లకి మూగినట్లుగా జనం అక్కడ మూగి ఆ పోస్టర్లని చూసి భ్రమలకు లోనవడం లేకపోలేదు.

సినిమా పోస్టర్ల మీద సెన్సారు వారికి అధికారముంటే బాగుంటుందేమో ?

మైక్ సెంటర్స్‌లో రాబోయే సినిమాలలోని పాటలు మంచివి - చెడువి కూడా మార్మోగిపోతాయి. సాయంకాలం ఆ సెంటర్స్ దగ్గర గుంపులు గుంపులుంటాయి.

ఇవన్నీ కూడా సినీమాలు చూచిన దానికంటె ఎక్కువగానే సంఘం మీద ప్రభావాన్ని చూపిస్తున్నాయేమోనని నా అనుమానం.

ఇంకపోతే సినిమా పత్రికలు. వీటిలో కొన్ని అసభ్య దృశ్యాలకు ప్రాముఖ్యత యిచ్చి, వెర్రి వెర్రి వ్యాఖ్యలు జోడించి డబ్బు చేసుకుంటున్నాయి.

ఇవన్నీకూడా చెత్త సినీమాలు చూడాలనే కుతూహలాన్ని కలిగిస్తున్నాయి.

అందువల్లే నిర్మాతలు ఏ సినీమా తీస్తే మంచిదో, ఏ సినిమా తీస్తే చెడ్డదో వారు నిర్ణయించుకోలేక పోతున్నారు. ప్రజాభిరుచిని అర్థం చేసుకోవడం వారికి చాలా కష్టమైపోతూంది; దీనికి కారణం నేను పైన చెప్పినవే.

ఈ పరిస్థితులలో నిర్మాతలు కేవలం సినీమా పత్రికలనే నమ్ముకోక ప్రజాభిరుచిని గుర్తింప గలిగితే మంచి సినీమాలు రావడానికి అవకాశం ఉంటుంది.

మారుతున్న కాలంలో మారిన విలువలలో సినిమాలు మారతాయి. యువతరమూ మారుతుంది. మారక తప్పదు. కాలమే మారుస్తుంది.

ఏదిఏమైనా అతి చౌకగా లభ్యమయ్యే ఈ వినోదాన్ని అంతవరకూ చూస్తూనే ఉంటారు. వారిని చూడకుండా చేసే శక్తి మనకు లేదు.

నేటి సంఘంలో అధిక ధరలు,నిరుద్యోగం,నిరాశ తాండవిస్తూంటే ఈ చౌక వినోదంలో ఆటలు పాటలు చూసీ వినీ, రంగు రంగుల కలల్లో అందని అందమైన కాశ్మీరాలను సందర్శించీ, దివ్య భవనాల సెట్టింగ్సనూ, పెద్ద పెద్ద ఓడల్లాంటి కార్లనూ, నోట్ల కట్టలు నిండిన యినప్పెట్టెలనూ, అందమైన అమ్మాయిల అబ్బాయిల రంగురంగుల దుస్తుల్నీ చూసి, మిధ్యలో తేలిపోతూ తమ దారిద్ర్యాన్ని, అసహాయతను మరచి భ్రమలో జీవిస్తున్నారు ఎందరో సామాన్యులు. వారికది ఒక మనోల్లాసం. సినీమాలు మేధావులకు కూడా పూర్తి ఆనందాన్ని అందించే రోజు రావాలనీ, సామాన్య ప్రేక్షకుడు భావనలో ఎదగాలనీ మనం కోరుకోవడం మనకు తప్పదు, అంతదాకా -

మన సినీమాలు వినోదంతోబాటు వికాసాన్ని కూడా అందిస్తే ప్రేక్షకులు స్వీకరించే మంచిరోజు కోసం ఎదురు చూద్దాం !

# సినీవాలు - సామాజిక దృక్పథం

జె. కిరణ్మయి

సామాజిక దృక్పథం లేని రచనలు ఉత్తమ సాహిత్యం క్రిందకు రావు. ఉత్తమ సాహిత్యంలో ఎప్పుడూ మనుషులూ వాళ్ళ సమస్యలూ సంఘర్షణలూ కనపడాలి. లేనినాడు సాహిత్యపరిధి సంకుచితమవుతుంది. ఏ కళాస్వరూపం ప్రయోజనమూ అదికాదు. తెలుగు నవల పుట్టి నూరేళ్ళపైన అయింది. ఈ కాలంలో ఎన్నో వేల నవలలు ఉద్భవించాయి. స్వాతంత్ర్యానికి పూర్వం తెలుగు సాహిత్యంలో పారతంత్ర్యాన్ని నిరసించడము, స్వేచ్ఛను కాంక్షించడము మన సమాజంలోవుండే లోపాలను దిద్దుకోవాలన్న ప్రబోధము కన్పిస్తాయి. దీనికి 'మాలపల్లి' నవల చక్కని ఉదాహరణ. ఇది సామాజిక దృక్పథంతో వెలువడిన ఉత్తమ రచన. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ప్రజల దృక్పథం మారింది. సాంఘిక సమస్యలు తలఎత్తాయి. బలహీన వర్గాలకు సమానత్వం లభించలేదు. అల్పాదాయ వర్గాలలో అసంతృప్తి పెరిగిపోయింది. అందువలన సంఘర్షణలు ఉద్రేకాలు అనివార్యమైపోయాయి. ఈనాడు రచయితకు సామాజిక దృక్పథం వుండాలి అనే మాటలు ఎక్కువగా వింటున్నాం. ఇక సినీమా నవలలా సామాజిక దృక్పథం అనే విషయానికివస్తే, నేడు విజ్ఞానవినోద ప్రచారసాధనాలలో సినీమా, టెలివిజన్ ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తున్నాయి. సమ సమాజ వ్యవస్థ నేటి ప్రజలు కోరుకొంటున్నారు. సినీమాకు ఆర్థిక,సాంఘిక,రాజకీయ,సాంస్కృతిక,సాహిత్యపు విలువల్ని ఆకళించుకొని ఒక దారి చూపెట్టగలిగే శక్తి వుంది. వందేమాతరం, మాలపిల్లవంటి చిత్రాలు అపూర్వమైన రాజకీయ సామాజిక చైతన్యాన్ని కల్గించాయి. గురజాడవారి కన్యాశుల్కం సామాజిక సమస్యలకు వితంతు వివాహాలకు ప్రాముఖ్యమిచ్చింది. 'పెద్దమనుషులు, సినీమా Four pillars of the society కథని ఆధారంగా నిర్మించబడి సమాజంలో పెద్దమనుషులుగా

చలామణీ అయే వారి కుట్రలు కుతంత్రాలను వెల్లడి చేసింది. ఇంకా వందేమాతరం 'మన దేశం'వంటి ఎన్నో చక్కని చిత్రాలు అనేక సమస్యలని అనగా మన దేశ స్వాతంత్ర్య సమరంలో జరిగిన Quit India Movement గురించి చూపించటం జరిగింది. పూర్వపు సినీమాలే సామాజిక సమస్యలని పరిష్కరించ టంలో ఒక revolutionary method ని చూపించగల్గాయని చెప్పవచ్చు. ఎర్రగులాబీల వంటి చిత్రాలు చూసి స్త్రీలను చంపటం నేర్చుకుంటున్నారు. నేటి చిత్రాలలో కార్మికుల సమస్యలను గురించి వచ్చిన ఉత్తమ చిత్రం 'మనుషులు మారాలి.'అలాగే ముప్పాళ రంగనాయకమ్మ గారి 'బలిపీఠం' వర్ణాంతర వివాహాల గురించిన నిజమైన కథ అని చెప్తారు.

అసలు నవలని సినీమాగా మార్చటానికి ముఖ్యమైనది కథ - తరువాత కథనం- దానిని నడిపించిన తీరు. తరువాత అందులో వున్న dramatic technique. నాల్గవ పాయింటు అందులో entertainment ఎంతవరకు వుంది అనేది ముఖ్యం.

నవలని సినిమాకి అనుగుణంగా మార్పులు చేయాల్సివస్తే పాఠకుల అభి ప్రాయాలు విమర్శకుల అభిప్రాయాలు ఎంతవరకు పరిగణనలోకి తీసుకోవాలి? ఏ నిర్మాత అయినా నష్టపోవటానికి ఇష్టపడడు కాబట్టి ఆ సినిమాకు అనుగుణంగా నవలలో కొన్ని మార్పులు చేర్పులు చేయటానికి సాహసించక తప్పదు. కొన్ని కొన్ని కథలని అంటే బైబిలు లాంటి కథలని, రామాయణం భారత భాగవతాలని యధాతధంగానే చిత్రీకరించాల్సి వస్తుంది. తరువాత ఫలానా రచయిత్రి నవల అంటే అభిమానులైన ప్రేక్షకులను నిరాశపరచకుండా జాగ్రత్తపడాలి.

పోనీ మార్పులు చేయకుండా ప్రేక్షకులని తృప్తిపరచటం సాధ్యమా అంటే పూర్తిగా అసాధ్యమే అని చెప్పాలి. ఈ మధ్య ఆశాదీపాలు advertisement చూడటం తటస్థించింది. అది బాలల చిత్రమట. కాని అడ్వర్ టైజ్ మెంటులో జయమాలిని ఫోటో పెద్దగా, పిల్లలెక్కడో కనిపించకుండా వున్నారు.

అలాగే సినిమాలు తీసి నిర్మాతలు చేతులు కాల్చుకోకుండా జాగ్రతపడాలిగా మరి. కనుక అన్ని రకాల తరగతుల ప్రేక్షకులని తృప్తి పర్చటం కోసం కొన్ని హంగులు వుండటం అవసరం అవుతోంది. దీనివలన సినిమా యొక్క విలువలు క్షీణిస్తున్నాయి.

తరువాత ఆంగ్ల నవలల్ని తెలుగు సినిమాలకు అనువదిస్తున్నారు. ఉదా:

సిలాస్ మారినర్ ఆధారంగా బంగారు పాప.

జేన్ ఐర్ నవల ఆధారంగా అర్ధరాత్రి.

Fear is the Key ఆధారంగా కెప్టెన్ కృష్ణ మొదలైనవి కొన్ని. షేక్స్పియర్ నాటకాలు చాలా సినిమాలుగా వచ్చాయి. King Lear నాటకం ఆధారంగా గుణసుందరి కథ మొ॥ నవి. Taming of the Shrewd ఆధారంగా పెంకిపెళ్ళాం లాంటి సినిమాలు వచ్చాయి.

తెలుగు నవలలు సినిమాల విషయానికి వస్తే కౌసల్యాదేవి ప్రేమనగర్, డాక్టర్ చక్రవర్తి (చక్ర భ్రమణం), విశాలాక్షిగారి వారధి నవల ఆధారంగా రెండు కుటుంబాల కథ, సులోచనారాణిగారి సెక్రటరీ, జీవనతరంగాలు, వాసిరెడ్డి సీతాదేవిగారి సమత ఆధారంగా ప్రజానాయకుడు, ఇంకా మాదిరెడ్డి సులోచన, సి. ఆనందారామం, కావిలిపాటి విజయలక్ష్మి మొదలయిన వారి నవల లెన్నో చిత్ర రూపం పొందాయి. చాలా వరకు నవలా చిత్రాలు విజయవంత మయ్యాయి కూడా.

మరొక పద్ధతి ఏమిటంటే-సినిమాలేనవలలుగా రావటం.

సినిమాలు – నవలలుగా రావడం అంటే ఇంగ్లీషులో Script Publication అంటారు. ఇటువంటి నవలలు ముఖ్యంగా బాపు చిత్రాలయిన భక్త కన్నప్ప, ముత్యాలముగ్గు, బుద్ధిమంతుడు మొదలగునవి ఎన్నో వచ్చాయి. ముళ్ళపూడి వెంకటరమణగారి రచనలే యివి. యీ సినిమా నవలలు ఎంతో ప్రాముఖ్యత

పొందుతున్నాయి. చిత్రం చూశాక సంభాషణలు ఫోటోలు పాటలతో సహా వున్న ఈ నవలలు నేటి ప్రేక్షక పాఠకలోకానికి వరాలు

**తరువాత** వచ్చే నవలలు సినీమా కోసం నవల వ్రాయడం, లేదా ఒక సినీమా చూసి దానినే కొంచెం మార్చి ఇంకో నవల వ్రాయడం. సరే ఆ నవల నచ్చి నిర్మాతలు సినీమా తీయడం. ఇక ఈ రచనలు రచయిత్రుల మీద సినీమా ప్రభావం ఎంత వరకు వుంటోందంటే నవల ప్రారంభం నుంచీ అది సినీమాకు పనికి వచ్చేటట్లుగానే Plot చేసుకుని దానికి కావలసిన మసాలాలు జోడించి ఎవరోఒక Popular Cine hero, heroine, Villain, Comedian ని దృష్టిలో వుంచుకుని వ్రాయటం. ఆ నవల చదివిన వెంటనే పాఠకులు కూడా ఇది సినీమాకు బావుంటుందర్రా అని వాళ్ళ అభిమాన నటుల్ని Select చేసి వుంచుకోవటం జరుగుతోంది. సినిమావాళ్ళు వేరే వాళ్ళని ఎంపిక చేస్తే నిరాశ చెందటమూ జరుగుతోంది

ఇంక కొన్ని నవలలు పత్రికల వాళ్ళ తొందరలతో వ్రాసేవి. వీటిలో నిన్న ఒక సోదరి చెప్పినట్లు suspense కోసం రచయిత్రుల తాపత్రయాలు చూస్తాం. ఏదో రాశామని కాకుండా రాసిన నవలలు ప్రయోజనాత్మకమయినవా లేదా అని ఆలోచించాలి. అలాగని అన్నీ సమాజ స్థితిగతులపై ఆధారపడిన్నవి వ్రాసినా ప్రజలు ఆకళింపు చేసుకోలేరు. వారికి ఈనాడు సినీమా ఒక 8 గంటల వినోద సాధనం అయింది. నేడు ఎంత పేదవాడైనా చిత్రాలు చూడందే వుండలేని స్థితి కొచ్చాడు సినీమాలు చూసి రోజుకు రూపాయి సంపాదన లేనివాడు కూడా స్కూటరు కొనుక్కుంటే అని కలలు కంటూ వుంటాడు. జీవితం అంతా హఠాత్సంఘటనలు, అదృష్టంతో కూడి వుంటుందని వీరి ఉద్దేశ్యం. సస్పెన్స్ క్రైమ్ చిత్రాలు సినీమాని వినోదం స్థాయి నుంచి కాలక్షేపానికి చూసేవిగా మార్చేశాయి. తెలుగులో లేకపోతే హిందీ ఇంగ్లీష్ క్రైమ్ చిత్రాలకి ఎగబడుతున్నారు. యీ సినీమాలకి రాజ పోషకులు యువకులు విద్యార్థులు. వీరికి సినీమాకు మించిన హాబీ లేదు. వీళ్ళమీద సినిమా ప్రభావం యింతా అంతా కాదు.

ఇక సినిమాలలోని చౌకబారు మాటలు ఊతపదాలు కుర్రాళ్ళ నోట్లోంచి అమ్మాయిలని ఏడిపించటానికి బాగా ఉపయోగింపబడుతున్నాయి. కనక్షన్ కన్నప్ప, adjust అయిపోవాలి (కల్యాణి), కాంప్రమైజేషన్ గురూ !

మన స్త్రీలు వెనుకబడి వుండటానికి కూడా ఈ సినిమాలు కొంతవరకు కారణమని చెప్పవచ్చు. స్త్రీని ఒక పతివ్రతగా చూపి ఆమెకు కొన్ని లక్షణాలు ఆపాదిస్తున్నారు. గోరంతదీపంలో చూడండి. హీరోయిన్‌కి తండ్రి ముందే చెప్తాడు. అత్తగారింటికి వెళ్ళాక ఎన్ని కష్టాలువచ్చినా పుట్టినింటికి రాకూడదనీ ధైర్యంగా సమస్యలని ఎదుర్కోగలగాలనీ. అలాగే ఆమె పుట్టింటికి ఉత్తరమైనా రాయకుండా నిబ్బరంగా నిలబడి కాపురాన్ని సరిచేసుకుంటుంది. కాని నిజానికి ఏ స్త్రీ యిలా చేయగలుగుతోంది! ఇది వాస్తవానికి చాలా దూరం.

ఇక-సినీమాలు పుట్టి అర్థశతాబ్దం కావస్తోంది. ఈ కాలంలో కథా కథనం సంగీతం నటన సాంకేతికపరంగా అద్భుతమైన మార్పులు వచ్చాయి. కాని మార్పురానిది ఒకటే-మన చిత్రాలలో తల్లి పాత్ర. ఒక సినీమాలో తల్లి పాత్ర వుందంటే ప్రపంచంలోని దురదృష్టం బాధలు కష్టాలు కన్నీళ్ళు అన్నీ ఆమెనే అంటిపెట్టుకొని వుంటాయి, పాపం. తెరమీద అంజలీదేవి, నిర్మల, పండరీబాయి కనిపించారంటే త్వరలోనే వాళ్ళకు కష్టాలు ప్రారంభమవుతాయని ముందే ప్రేక్షకులకు తెలిసిపోతుంది. ప్రపంచంలోని తల్లులంతా యిలాగే వుంటున్నారా అని ఆలోచించుకుని రచయితలు రాస్తే ప్రేక్షకులకు దీనులైన తల్లులనుచూసే బాధ తప్పుతుంది. సూర్యకాంతాన్ని చూస్తే గయ్యాళిగానే వుంటుంది.

*ఇక సినీహీరోలు:-* హీరోస్ అంటే నేటి నిర్వచనం తాతయ్యలని. ఈమధ్య ఒక జోక్ చదివాను. అమ్మాయీ ఎందుకమ్మా ఆయనతో నటించటానికి సిగ్గు పడుతావు. ఆయన నీకు తాతయ్యలాంటివాడమ్మా అని. ఇక వీరు Fashions కిచ్చిన ప్రాధాన్యత నటనకి గాని సమస్యల పరిష్కారానికి గాని యివ్వరు. అంటే అందరూ కాదులెండి. ఎంత రౌడీలా తిరిగినా First class లో Pass అవుతూవుంటారు. పూటకు గతిలేకపోయినా లైసెన్సు లేకపోయినా ఎంతటి

latest కారనయినా బాగుచేయగలరు డ్రైవ్ చేయగలరు. ఒక్కడే బట్ట నలగకుండా,మాయకుండా పదిమందిని చితుగా బాదేయగలడు. ఇక అవసరానికి అనేకకుస్తీ బల ప్రదర్శన పోటీలలో వస్తాదులను గెల్చి, వేలు గెల్చుకుంటారు. మారువేషాలు వేసుకుని పనులు సాధించుకుంటారు. మనకు తెలిసిపోతూనే వుంటుంది, ఎదటివాళ్ళకు ఎందుకు తెలియదో మరి. ఇక ఒక గొప్ప ఆస్తిపరుడు పేదపిల్లని ప్రేమించటం, పేద హీరో గొప్పింటి పిల్ల ఆశ్రయం పొందటం (గోరింటాకు), ఆఖరికి అతడు నౌకరయినా సరే ఆమె ప్రేమించటం. ఇటువంటి అభూత కల్పనలు ఇంకెంతకాలం చూడాలో. ఇక వారిబిల్డింగ్స్ furniture, dress చూస్తుంటే మనకి మతులు పోతుంటాయి. వాళ్ళుచేసే ఉద్యోగానికి అంతస్తోమత ఎలా వస్తుందో మరి!

*నటీనటుల వాద్యాల విషయానికి వస్తే-*

కొన్ని చిత్రాలలో నటీనటులు పియానో,గిటార్,సితార్, వీణ, అకార్డియన్ వంటి వాద్యాలు Play చేయాల్సి వస్తుంది. కాని చాలా మందికి వాటిని ఎలా వాడాలో తెలియదు. సినీమాల్లో వస్తున్న Music కి వీరివేళ్ళ కదలికకీ ఏ విధమైన సంబంధం వుండదు. ఒకప్పుడు ఈ వేళ్ళు కదలకుండానే Music వచ్చినా ఆశ్చర్యంలేదు. ఇలాంటి సన్నివేశాలలో కొంచెం శ్రద్ధవహించి నిపుణులదగ్గర Practice చేస్తే సహజంగా నటించవచ్చుగా. అమావాస్య చంద్రుడు సినీమా కోసం కమల్‌హాసన్ వయొలిన్ సాధన చేస్తున్నాడట. ఇక డాక్టర్లు. వీరికి కూడా స్టెతస్కోపు వాడటం మొ॥నవి Practice చేయిస్తే మంచిది. మన సినిమాల్లో Doctors ని అమాయకులుగా హాస్యం కోసం చూపిస్తూ Dr. కి విలువలేకుండా చేస్తున్నారు. ఉదా:- *నగేశ్* నా చేతుల్లో ఏమీలేదు, నేను చేయగలిగింది చేశాను అంటాడు. ఇక దేవుడిదే భారమన్నమాట.

*ఇకకథలు*: ముచ్చటైన ముగ్గురు కొడుకులతో సంసారం. ఆ ముచ్చటను రచ్చకీడ్చే ఓ స్మగ్లింగ్ ముఠా. షాట్ కొకడు Street కొకడు తప్పిపోవటం. ఆఖరికి ఫెరిగి చివరి సీనులో కథనిలా ఒక కొలిక్కి తీసుకురావాలి అని ప్రయ.

త్నించడం. లేదా మూడు మతాల నీడనపెరిగి జాతీయ సమైక్యత అనే group Photo కు అవకాశమియ్యడం. లేదా స్మగ్లింగ్ వ్యాపారంతో కోటీశ్వరుడైన హీరో. అతనికి చెల్లి తప్ప ఎవరూ లేకపోవడం. స్మగ్లింగు కారణంగా చెల్లెలికి పెళ్ళి చేయలేకపోవటం. దీని కారణంగా హీరో మరణించడం. దీనివలన ఎవరికి లాభం? తరువాత A సర్టిఫికేట్ చిత్రాలు. అంటే A సర్టిఫికేట్ యిచ్చారంటే పిల్లల్ని తప్పక చూడమని indirect గా చెప్పారన్న మాటే. ఇదీమన చిత్రాలలోని సామాజిక బాధ్యత. ఇక సినీమా చూసిన తరువాత కథేమిటి అని ప్రశ్నిస్తే బిక్కమొహం పెట్టాల్సి వస్తోంది ఈ రోజుల్లో. హిందీలో Success అయిన యాదోంకి బారాత్ ఆధారంగా తెలుగులో ఎన్నో సినీమా కథలు వచ్చాయి. ఒకే మూసలో పోసినట్లున్న యీ కథల వలన సమాజానికి కక్షలు కార్పణ్యాలు హత్యలే తప్ప ఏమి సందేశం లభించింది ?

ఇటీవల విడుదల అయిన శంకరాభరణం చిత్రం కూడా కొంత ఊహే. కాని సాంప్రదాయబద్ధమైన సంగీతాన్ని నిర్లక్ష్యం చేసి, మలేరియా వణుకు వంటి పాశ్చాత్య సంగీతాన్ని ఆదరించే వ్యామోహాన్ని విడనాడమంది. కులానికి కాక గుణానికి ప్రాధాన్యత యిమ్మని ప్రబోధించింది. ఈ చిత్ర ప్రభావం సమాజంపై బాగా పడిందనే చెప్పవచ్చు. ఏ యింట చూసినా సామజవరగమనా, బ్రోచే వారెవరురా పాటలే.

మళయాళం, కన్నడం చిత్రాలలో బాగా వాస్తవికత కన్పిస్తుంది. ఇవి ఘటశ్రాద్ధ, అగ్నిపుత్రి, సంస్కార, తులాభారం మొ॥నవి. అలాగే మృణాల్ సేన్, సత్యజిత్‌రాయ్, బాసుఛటర్జీ, గిరీష్ కర్నాడ్, గుల్జార్ మొ॥ వారు సామాజిక సమస్యలకి దర్పణంపట్టి చిత్రాలను తీశారు. ఇటీవల ప్రాంతీయ జాతీయ బహుమతి పొందిన నగ్నసత్యం చిత్రం కూడా హైదరాబాదులోని ఒక ఉదంతం ఆధారంగా నిర్మించబడింది. కాని ఆ చిత్రాన్ని చూసింది ఎంతమంది? కనుక ఒకవేళ సామాజిక సమస్యలను ప్రతిబింబించే చిత్రాలు తీస్తే ముఖ్యంగా పేదప్రజలే వాటిని చూడరు. వాటిని చూసేది పైతరగతి వారే. పేదవానికి

అల్పాదాయ వర్గాలవారికి సినిమా అంటే తాత్కాలిక సమస్యలని కొంతసేపు మర్చిపోయేందుకు సాధనం మాత్రమే. సినిమా అనేది కాసేపు అలా కలలో తేలిపోయి హాయిగా 3 గంటలు వినోదాన్ని కల్గించేదిగా వుండాలి వారికి. అందు చేతనే అనుగ్రహం, ప్రాణం ఖరీదు, చలిచీమలు, మా భూమి వంటి చిత్రాలు బాక్సాఫీసువద్ద ఫెయిలయ్యాయి.

కళగా మొదలయిన సినిమా నేడు వ్యాపారంగా మారింది. మరొక కళ అందుబాటులో లేని కారణంగా ప్రజలు సినిమా మీదే ఆధారపడుతున్నారు. కనుక ఒకే మూసలో పోసినట్లుండే ప్రేమలు పెళ్ళిళ్ళు ధనవంతుడు పేదపిల్ల లేక గొప్పింటి అమ్మాయి పేదవాడ్ని ప్రేమించటం, ఒకే వ్యక్తికి యిద్దరు భార్యలు చివరికి ఒకర్తె చనిపోవటం, యిటువంటి కథలు కాక సమాజంలోని అనేక సమస్యల్ని తీసుకుని ప్రేక్షకులలో కనీసం వేయికి ఒకరిలోనైనా పరివర్తన తీసుకురాగలిగే సామాజిక కృషితో సినిమాలు తీస్తే అప్పుడే ఏ నవలైనా ప్రయోజనాన్ని సాధిస్తుంది.

# సినిమాలు - (సమాజం) మనం

వి. లీలావతీ రాఘవయ్య

సినిమా, సినిమా, సినిమా! ఎవరినోట విన్నా, ఎక్కడ చూసినా యిదే మాట, ముక్కుపచ్చలారని మూడేళ్ళ పాప "జోరుమీదున్నావు తుమ్మెదా" అని రాగం తీస్తుంటే, ముక్కుమీద వేలేసుకుంటున్నారు ముందరి తరంవారు. మనిషి నిత్యజీవితానికి అంత దగ్గరగా వచ్చింది సినిమా! ఏమాత్రం తీరిక దొరికినా, మనలో ఎక్కువ మంది కాలక్షేపానికి యెన్నుకొనేది సినిమానే. చర్చించేది సినిమాని గురించే. సినిమాలో హీరో గుర్రంమీద యెక్కి స్వారీ చేసినట్టు, సినిమా ఆధునిక మానవుడి జీవితం మీద స్వారీ చేస్తోంది! ఇందరిని ఇన్ని రకాలుగా ఆకర్షించి, యింత పెట్టుబడితో, యిందరు కళాకారులతో ఆనందంగా యెదుగుతూ, సమాజాన్ని తన రంగుల వలలోకి ఆకర్షిస్తున్న ఈ సినిమా యెక్కడ, యెలా పుట్టింది?

ఎక్కడో టిబెట్‌లో మానస సరోవరంలో చిన్న నీటిపాయగా పుట్టిన బ్రహ్మపుత్రానది అస్సాంలో ప్రవేశించేటప్పటికి వరదముంపుతో ఊహించలేని రూపాన్ని పొందుతుంది. పంధొమ్మిదో శతాబ్దపు చివరి సంవత్సరాలలో పుట్టిన సినిమా ఇరవయ్యో శతాబ్దపు మహాద్భుతంగా పరిణమించి నేడు జగాన్ని సినీ మాయామేయజగంగా మార్చి వెల్లువలా ముంచెత్తి వేస్తోంది.

ఈ లైట్లు వెలగడానికీ, ఈ మైకు పనిచేయడానికీ మూలకారకుడైన సాంకేతికశాస్త్ర బ్రహ్మ "థామస్ ఆల్వా ఎడిసన్" సృష్టించిందే "సినిమా" కూడా. 1889 లో అక్టోబరు 6 న ఎడిసన్ సహాయకుడు డిక్సన్ ఎడిసన్‌కి నమస్కారం చేస్తూవుండగా తీసిన చిన్న చలన చిత్రాన్ని ఎందరో ప్రేక్షకులు

చూసి ఆశ్చర్యంతో నోట మాట రాకుండా వుండిపోయారు! ఆనందంతో లేచి చిందులు వేశారు. పైగా అది నేటి సినిమావలె శబ్ద చలన చిత్రం కూడా! దీనిని బట్టి ప్రపంచంలో మొట్టమొదట తయారైన చలనచిత్రం టాకీయే!

1896 జూలై 7న, ఫ్రాన్స్‌కి చెందిన ల్యూమెరీసోదరులు నిర్మించిన ఒక నిముషం, రెండు నిముషాల చలన చిత్రాలు ప్రదర్శించబడినాయి. ఈనాడు మనం చూస్తున్న కథా చిత్రాలకు వరుసలో మొదటి చిత్రం 1898 లో, ఏసు క్రీస్తు జీవిత కథని నాటకంగా ప్రదర్శిస్తూ వుండగా తీసిన చలనచిత్రం. ఇది అమెరికాలో నిర్మించబడింది.

ఇప్పుడైతే కలర్ చిత్రాలు సర్వసాధారణమై పోయాయి కానీ, ప్రపంచం లోని మొట్ట మొదటి వర్ణ చలన చిత్రం మూడు రంగుల్లో చిత్రీకరించబడింది. 1910 లో ఐదవ జార్జి పట్టాభిషేక మహోత్సవాన్ని, ఇంగ్లండులో రంగుల్లో చలనచిత్రీకరించారు.

భారతదేశానికి కథా చలనచిత్ర గంగని తరలించుటకు వచ్చిన చిత్ర భగీరథుడు దాదాసాహెబ్ ఫాల్కే! భారతదేశపు మొదటి కథా చిత్రమైన "రాజాహరిశ్చంద్ర"ని పాల్కె 1913 లో నిర్మించాడు. ఈ సినిమాకి ఛాయా గ్రాహకుడూ, రచయితా, ఎడిటరూ, రచయితా, నిర్మాతా, దర్శకుడూ అన్నీ ఆయనే. ఎడ్లబండి మీద తన సినిమాని, చేతితో హ్యాండిల్ తిప్పే ప్రొజెక్టరునీ తీసుకొని ఆయన పల్లెటూళ్ళకి వెళ్ళి ప్రదర్శలు యిచ్చేవాడు! రోజులు మారాయి! ఆధునిక సాంకేతిక ప్రగతితో సినిమా కొత్త ఆకర్షణలను సంతరించుకుంది, ప్రజలకి "కలలో నాలుకైంది", సినిమాలు యింతగా ప్రజల నిత్య జీవితంతో కలసిపోవడానికి, అవి అందరికీ అందుబాటులో వుండడమే ప్రధాన కారణం. కాగా, మారుతున్న కాలంతో బాటు మనిషి అభిరుచులు కూడా మారుతున్నాయి. మనిషి ఊహాలోకం యిప్పుడు మరింత విస్తృతమైంది. కాలక్షేపానికీ, వినో దానికీ యిప్పుడు మనం పద్యాల నాటకాలనో, వీధి భాగవతాలనో ఆశ్ర

యించడం లేదు. అమెరికా వంటి అభివృద్ధి చెందిన దేశంలోవలె, టెలివిజన్ తెరలమీద ఆడుతూ వినోదాత్మక కళారూపాలు మన డ్రాయింగ్ రూములలోకి రాకపోయినా, కాస్త ఓపిక చేసుకుని థియేటర్ల దాకా వెళితే అక్కడ ఇంగ్లీషు సినిమాలతో సహా అన్ని రకాల చలనచిత్ర వినోదమూ పుష్కలంగానే లభిస్తుంది.

పట్టణాలు, నగరాలలో నివసించేవారికి అందుబాటులో వున్నంతగా పల్లెలలో నివసిస్తున్న ప్రజలకు సినిమా అందుబాటులో లేదు. దేశంలో వున్న సినిమా హాళ్ళలో అధిక భాగం నగరాలలోనే వున్నాయి. పల్లె ప్రాంతాలలో, సినిమా థియేటర్లున్న, యే తాలూకా కేంద్రానికో ప్రజలు బళ్ళు కట్టుకుని వెళ్ళడం యిప్పటికీ జరుగుతోంది.

రామాయణాన్ని, భారతాన్ని కథలుగా వర్ణించి చెప్పుకుని, పాడుకుని ఆనందించేవారికి, ఆయా కథలూ, పాత్రలూ, ప్రాణం పోసుకుని, తెరమీద కనిపించడం మహాద్భుతంగానే కనిపిస్తుంది. రంగస్థలంమీద సాధ్యంకాని సాహసాలు, అద్భుతాలు తెరమీద కనిపించడంతో ప్రేక్షకుడు సినీమా మాయలో పడిపోయాడు. సినిమాలు వచ్చాక నాటక రంగం వెనుకబడిపోవడానికి ఇదే కారణం.

''నా చేతిలో ఒక పత్రిక వుంటే నేను ప్రపంచాన్ని జయిస్తాను'' అన్నాడట నెపోలియన్. నెపోలియన్ ఈనాటి చలనచిత్రాల విశ్వస్వరూపాన్ని చూస్తే నా చేతికొక ప్రొజెక్టరూ, నా భావాలని ప్రచారంచేసే సినిమా రీళ్ళూ ఇవ్వండి, ప్రపంచాన్ని పాదాక్రాంతం చేసుకుంటానని అని ఉండేవాడు. ప్రేక్షకుల మీద సినిమా ప్రక్రియ ప్రభావం అటువంటిది.

ప్రపంచం మొత్తంమీద ఇప్పుడు నూటయాభై కోట్ల మంది సినిమా ప్రేక్షకులున్నారు. ఒక్క తెలుగు సినిమారంగమే ఏటా సుమారు వంద సినిమాలను నిర్మిస్తోంది. భారతదేశంలో వివిధ భాషలలో నిర్మించబడుతున్న సినిమాల

సంఖ్య సంవత్సరానికి నాలుగు వందలకి తక్కువ వుండదని ఒక అంచనా. 1979-80 సంవత్సరానికి భారత చలనచిత్ర పరిశ్రమ రాబడి అయిదు వందల నలభై కోట్ల రూపాయలు! సినిమా అనే మూడు అక్షరాలలో ఎంత శక్తి ఇమిడి వుందో, కోట్లాది ప్రేక్షకుల మీద సినిమా ఎటువంటి ప్రభావాన్ని ప్రసరించ గలదో ఈ అంకెల్నిబట్టి మనం అర్థం చేసుకోవచ్చు. 1897లో బొంబాయిలో జరిగిన ఒక కుస్తీ పోటీని భట్వాడేకర్ అనే పెద్దమనిషి సినిమా తీశాడు. అదే మన తొలి న్యూస్‌రీల్! ఆ మహానుభావుడు ఏ ముహూర్తాన ఈ వార్తాచిత్రం తీశాడో కానీ, ఈనాడు సినిమా వార్తలులేని పత్రికని వార్తాపత్రికగా గుర్తించ డానికి నిరాకరిస్తున్నారు మనవాళ్ళు. కదిలే బొమ్మల కథలమీద ప్రజల కన్ను పడి శతాబ్దం నిండడానికి ఇంక రెండు దశాబ్దాలే అడ్డం! ఇప్పుడు మన దేశంలో ప్రతి 24 గంటలకీ ఒక సినిమా చొప్పున నిర్మించబడుతున్నది!

ఇప్పుడొస్తున్న సినిమాలలో వ్యాపార చిత్రాలు, కళాత్మక చిత్రాలు అనే రెండు రకాలున్నాయని కొందరంటున్నారు. కొందరు ఈ విభజన అసహజ మైనదని కొట్టి పారేస్తున్నారు. సినిమాలన్నీ కమర్షియల్ సినిమాలే, ఆర్ట్ సినిమా అంటూ ప్రత్యేకంగా వుండదు అని శ్యామ్ బెనెగల్ వంటి ప్రసిద్ధులంటున్నారు. చూడగా బెనెగల్ వాదనే సమంజస మనిపిస్తోంది. పెట్టిన పెట్టుబడైనా తిరిగి రాకపోతే ఆ నిర్మాత మళ్ళీ ఒక మంచి సినిమా యెలా తీస్తాడు? ఆర్ట్ సినిమా లుగా ముద్ర వేయబడిన 'అంకుర్', 'మా భూమి' వంటి చిత్రాలు ఆర్థికంగా విజయవంతమయ్యాయి. డబ్బులు బాగా వచ్చాయి కనుక యిప్పుడవి కమర్షియల్ సినిమాలు అయిపోవు కదా- కనుక వ్యాపార చిత్రాలు, కళాత్మక చిత్రాలు అనే ఈ గీత అర్థం కానిది. ఒక చిత్రాన్ని ప్రేక్షకులు ఆదరించారా లేదా? ఫలానా సినిమా ప్రేక్షకులకి చెప్పిందేమిటి అనే అంశాలే ముఖ్యం. సినిమాలు ప్రేక్షకుల మనో భావాలని తీర్చి దిద్దుతాయా, వారిని ప్రభావితం చేస్తాయా అనే ప్రశ్న అర్థంలేనిది. సినిమాతో సరితూగ గల ప్రచార సాధనం ప్రపంచంలో మరొకటి లేదు. ప్రచారంతో సాధించలేనివి ప్రపంచంలో బహు తక్కువగా వున్నాయి. రెండవ ప్రపంచయుద్ధంలో హిట్లర్ సమాచార శాఖ మంత్రి గోబెల్స్ సాగించిన

అసత్య ప్రచారం ప్రపంచ ప్రజలను తికమక పెట్టి నిజానిజాలు స్పష్టంగా తెలియకుండా చేసింది. ఇప్పటికీ అబద్ధ ప్రచారం చేసేవారిని గోబెల్స్‌తో పోల్చడం మనకు తెలుసు.

సినిమా చూసి మనిషి మారతాడా అని ప్రశ్న. మారడానికే అవకాశా లున్నాయి. పిల్లికి బిచ్చం పెట్టని ఒక పిసినారి, మూగ చెవిటి దంపతులుగా సంజీవ కుమార్, జయభాదురీ నటించిన హిందీచిత్రం ''కోషిష్'' చూశాక, వీధిలో యెక్కడ వికలాంగులు కనిపించినా జేబులోంచి ఎంతో కొంత చిల్లర తీసి వారికి దానం చేయడం ప్రారంభించాడట.

అలాగే 'సిగప్పు రోజాగళ్' అనే తమిళ చిత్రం చూసి బెంగుళూరులో, యువకులు కొందరు ఆ చిత్రంలో చూపించిన విధంగానే ఇద్దరు యువతులను చెరిచి చంపి వేశారని పత్రికలలో చదివాము. మానవ మేధస్సును సినిమాలు ప్రభావితం చేస్తాయనడానికి ఈ రెండు సంఘటనలనీ ఉదాహరణగా చెప్పవచ్చు. 'శంకరాభరణం' చిత్రం చూసి, కళ్ళు చెమ్మగిల్లని మనిషి వుంటాడా !

సినిమాకు ప్రేక్షకుడి ఆలోచనలను మలచగలశక్తి వుందని గుర్తించినప్పుడు ఈ ప్రక్రియని ప్రజల ముందుకి తీసుకువచ్చేవారు మరింత జాగ్రత్త పడవలసిన అవసరం ఉందనిపిస్తోంది. చిన్నపిల్లలకి బడిలో పారిశుధ్యాన్నిగురించీ, పరిసరాల శుభ్రతని గురించీ నేర్పుతారు. రోడ్డు మీద అరటి తొక్కలు వేయవద్దనీ, అలా వేస్తే నడిచి వెళ్ళేవారు కాలుజారి పడతారనీ చెపుతాము. ఈ స్వల్పవిషయాన్ని సినిమారంగం గుర్తుంచుకుంటే చాలు, మనకు అత్యంత ఆరోగ్యకరమైన, ఆహ్లాద కరమైన సినిమాలు వస్తాయి. సినిమాకి సామాజిక ప్రయోజనం వుండాలి అనే పెద్ద మాటలు మాట్లాడను కానీ, ప్రజల నడవడినీ, జాతి సంస్కృతినీ తీర్చిదిద్దే విధంగా, మరికొంత తక్కువ శృంగారంతో, మరికొంత తక్కువ హింసా కాండతో సినిమాలు తీయడానికి వీలుందని నా అభిప్రాయం. ఆనాటి మల్లీశ్వరి, బంగారు పాప, విజయావారి చిత్రాలు, నిన్న మొన్నటి ఆదుర్తి సుబ్బారావుగారి చిత్రాలు, నేటి శంకరాభరణం, ఏమి శృంగారం వుందని, రక్తం స్రవించే ముష్టి యుద్ధాలు యేమున్నాయని విజయవంత మయ్యాయి ?

ఒకవైపు స్త్రీ విమోచనోద్యమాలు ప్రపంచాన్ని నిలదీసి ప్రశ్నిస్తూవుంటే, మనవాళ్ళు ఇంకా, స్త్రీని వంట యింటికే అంకితమై పోయిన ఛాందసురాలుగా, భర్తతో సమానంగా సంపాదిస్తున్నా భర్త మాట జవదాటలేని, జవదాటి బతక లేని అబలగానే చూపించడం విచారించవలసిన విషయం !

మన సినిమాలలో స్త్రీ పాత్రలని గురించి ఆలోచిస్తోంటే నాకొక విషయం గుర్తొస్తోంది. ఈమధ్య ఒక సినిమాలో ఒక హీరోగారు ''నేను శీలవంతుడినే'' అనో, ''ఆ మాత్రం శీలం నాకూ ఉంది'' అనో ఒక డైలాగు చెప్పవలసి వచ్చిం దట. ''ఇదేమిటండీ, ఆడవాళ్ళకే కానీ మగవాళ్ళకి యెందుకుంటుంది శీలం ?'' అంటూ బోలెడు ఆశ్చర్యపడ్డారట హీరోగారు. రచయిత వచ్చి, శీలం అంటే ఆడవాళ్ళ శరీర భాగంకాదనీ, పవిత్రతనీ, సద్గుణాన్నీ శీలం అంటారని వివరించే వరకూ ఆ డైలాగు చెప్పలేదట ఆయన.

ఇది పైకి, భాషాజ్ఞానానికి సంబంధించిన విషయంగా, కాసేపు నవ్వుకోడా నికి పనికి వచ్చే సంఘటనగా కనిపించినా, దీనివెనుక భారతీయ చలన చిత్రాలలో తొలిమంచీ స్త్రీకి మాత్రమే పవిత్రతనీ, నైతిక బాధ్యతనీ, నిష్కళంక ప్రవర్త ననీ ఆపాదించి, పురుషుడికి యివి యేమీ లేకపోయినా పరవాలేదనే ఆలోచనని వ్యాపింప చేసిన ఒక ధోరణి తొంగి చూస్తోంది. మన సినిమాలలో ''పవిత్ర భారత స్త్రీ'' అనే మాటేకానీ, పవిత్ర భారత పురుషుడు అనే మాట యెప్పుడైనా విన్నామా ?

మన సినిమాలలో కొన్ని స్త్రీల సమస్యలను ప్రధానంగా తీసుకుని నిర్మించి నట్టు, స్త్రీల సమస్యలకి పరిష్కార మార్గం సూచించబడటానికి నిర్మించినట్టు కని పిస్తాయి పైచూపులకు. విశ్రాంతి కార్డు పడేవరకూ ఎంతో చైతన్యవంతురాలుగా, తన న్యాయమైన హక్కుల కోసం పోరాడే వనితగా వున్న కథానాయిక సినిమా రెండవ భాగంలో భర్తకి దూరమై, పడరాని కష్టాలన్నీ పడి, భర్తే దైవం, భర్తే సర్వం, భర్తే తన జీవితం అని గుర్తించి పశ్చాత్తాప పడి, భర్త కాళ్ళమీద పడి

నేను మీ పాద దాసినండీ, నా చోటు మీ పవిత్ర పాదాల చెంతనేనని తెలుసుకున్నానండీ, అని యిన్ని గ్లిసరిన్ కన్నీళ్లు కారుసుంది -

ఏడవడానికి స్త్రీ పాత్రలే - వెకిలి హాస్యం సృష్టించడానికి స్త్రీ పాత్రలే, అర్థ నగ్న నృత్యానికి స్త్రీ పాత్రలే - వ్యాపార ప్రకటన కర్తల దగ్గరి నుంచి సామాన్య సినిమా నిర్మాతల వరకు అందరూ స్త్రీని వీలైనన్ని రకాలుగా, సాధ్యమైనన్ని దశలలో, కోణాలు ప్రదర్శించి డబ్బు చేసుకొనేవారే -

మానభంగాలకు వ్యతిరేకంగా యిటీవల దేశమంతటా చెలరేగిన నిరసనోద్యమం వంటిది సినిమాలలో స్త్రీని ఆధునిక బానిసగా ప్రదర్శించే పద్ధతికి వ్యతిరేకంగా సాగించవలసిన అవసరం వుందనిపిస్తోంది. ఎక్కడైతే స్త్రీలు సుఖశాంతులతో వుంటారో, దేవతలు అక్కడే వుంటారని పెద్దలంటారు. ఈ లెక్క ప్రకారమైతే మనదేశంలో ఒక్క దేవుడు కూడా వుండివుండడు ! స్త్రీపురుషభేదం లేకుండా, జాతి నైతిక విలువల్ని తీర్చిదిద్దే అర్థవంతమైన, అందరికీ అర్థమయ్యే ఆరోగ్యకరమైన, సినిమాలు వచ్చిననాడు సినిమా జాతిభవిష్యత్తును నిర్ణయించగల గొప్ప సృజనాత్మక శక్తిగా మారుతుంది. సినిమా మానవుడి మేధస్సుకి పదును పెట్టేదిగా, మానవుడు తనని తాను దర్శించుకొని సవరించుకునే దర్పణంగా మారాలి. మనిషి ఆవేశాలు, అనుభవాలు, ఆశయాలు సినిమాలో సహజాతి సహజంగా, సమర్థవంతంగా, మనసుని ఆకట్టుకునే విధంగా ప్రదర్శించబడాలి. ప్రపంచ ప్రఖ్యాత చలనచిత్రకారుడు ఫెడ్రికో ఫెల్లినీ సినిమాని గురించి చెప్పిన మాటలతో నా యీ ప్రసంగ వ్యాసాన్ని యిక ముగిస్తాను.

"Cinema, the Art in which man recognises himself in the most direct way, the mirror in front of which we must have the courage to discover our souls!"

# సినిమాలు - సంఘముపై ప్రభావము

సి. వేదవతి

మనిషి జీవితంలో తిండి, బట్ట, ఇల్లు - వంటి కనీసావసరాల తర్వాత సౌందర్యారాధన, కళాతృష్ణ - ఒక ముఖ్యమైన భాగం. వివిధ లలిత కళా ప్రక్రియలు ఈ ఆరాధనా భావం నుండి పుట్టుకువచ్చినవే! సకల కళా సమన్విత మైన సినిమా-విజ్ఞాన వినోదాలను అందించే మహాశక్తివంతమైన ప్రచార సాధనం ఈనాడు.

మనుషుల రూపాన్ని, అంతరంగాన్ని, స్వభావాన్ని, నడవడికన్ను, సంఘ స్వరూపాన్ని - బహుముఖంగా ప్రదర్శించగలది సినిమా. నాలుగు రోజులకొక సారి అయినా సినిమాకు పోకపోతే వెఱ్ఱెత్తి పోయేవాళ్లూ, కొత్త సినిమా వచ్చిన మొదటి రోజు మొదటి ఆటకు పోకపోతే సర్వం పోగొట్టుకున్నంత బాధపడేవాళ్లూ ఉన్నారు. సినిమా - అనేక విధాలుగా ఆకర్షిస్తుండటం చేత - సినిమా చూడటం కొందరికి ఇంచుమించు వ్యసనంగా మారిందని చెప్పవచ్చు.

నాటకాలు, Opera, Ballet (ఓపెరా, బాలే నృత్యాలు), టి.వి, విడియో టేప్స్ (Video Tapes) వంటి వినోద సాధనాలు (Forms of entertainment) - ఇతర దేశాలలోవలె మనకు విస్తృతంగా లేకపోవటంతో - సినిమా - సామాన్యుడికి కూడా అందుబాటులోకి వచ్చిన వినోద సాధనం అయింది.ఏ మారుమూల ప్రాంతాంలోనో గిరిజనుల వంటివారు-అసలు సినిమాని ఎరుగని వారు ఏ కొద్ది శాతమో ఉంటే ఉండవచ్చును కాని-నేటి సంఘజీవితంలో ఇంచుమించు సగభాగమై పోయింది సినిమా. ప్రకృతి దృశ్యాల నుండి, ప్రజా జీవితపు సమగ్ర స్వరూపాన్ని - మనస్సుకు హత్తుకుపోయే విధంగా, ఒక దృశ్య కావ్యంగా మనముందు నిలబెట్టగల శక్తికలది నేటి సినిమా. రెండున్నర గంటల

సేపు మనల్ని ఊహాలోకాల్లో విహరింప చేసి, నవ్వించి, ఏడ్పించి, నవరసాల అనుభూతుల్ని కలగచేస్తుంది.

చలన చిత్రకళ పెద్ద వ్యాపార పరిశ్రమగా అభివృద్ధి చెందటంతో - ఎన్నో రకాలుగా ప్రజాజీవితంతో ముడిపడి పోయింది. అన్ని తరగతుల వారిని, వయస్సుల వారిని - ఎన్నో రకాలుగా అలరించి ఆకర్షించి ప్రజల మనస్సులలో తనకైన ప్రత్యేక స్థానం ఏర్పరచుకున్నది సినిమా.

వెనుకటి రోజుల్లో, ప్రజల వినోదం కోసం ఎన్నో జానపద కళారూపాలు ప్రదర్శింప బడుతూ ఉండేవి. వీధి భాగవతాలు, జంగం కథలు, పగటివేషాలు, తోలుబొమ్మలాటలు, జముకుల కథలు, నాటకాలు - వీటిని తెల్లవార్లూ చూచి ఆనందించే ఓపిక, కళాత్మక దృష్టి- మనవాళ్లకు ఆనాటి నుంచీ ఉండేది.

మన దేశానికి సినిమా వచ్చిన క్రొత్తలో - మూకీలు టాకీలుగా మారిన రోజుల్లో - తెరమీద బొమ్మ కదలడమే క్రొత్త ఆకర్షణతో ఆకట్టుకుంది. ప్రజల మనోభావాలను సంఘర్షణలను స్పందింప చేసే సాధనంగా ప్రజలకు మరింత దగ్గరగా వచ్చింది సినిమా.

తెలుగులో అసంఖ్యాకంగా చిత్రాలు వస్తున్నాయి. సాంకేతికంగా ఎంతో పరిణతి చెందాయి. అభిరుచిలో, కథా సంవిధానంలో, సన్నివేశ కల్పనలో, చిత్రించే తీరులో- ఎన్నో మార్పులు వస్తున్నాయి. ఈనాటి సినిమా సమాజంపైన ఎటువంటి ముద్ర వేయగలుగుతున్నదో పరామర్శ చేయాలంటే - సినిమా తీసే స్థాయిలో, అభిరుచిలో- ఏ విధమైన మార్పులు వస్తున్నాయో స్థూలంగా చర్చించ వలసి ఉంటుంది.

మన దేశంలో ప్రథమంలో పౌరాణిక చిత్రాలే ఎక్కువ తీశారు. ఇవి ప్రజలకు తెలిసిన ఇవి ప్రజలకు తెలిసిన పురాణకథలే కనుక-వాటిని ఒక భక్తిభావంతో చూచే వాళ్లు. ఆ తరువాత వచ్చిన సాంఘిక చిత్రాలు ఆనాటి సమకాలీన సమస్యల్ని దృష్టిలో

పెట్టుకుని తీయబడినవి. అస్పృశ్యతా నివారణ, జమీందారీ విధానంపట్ల నిరసన, సంఘ విద్రోహుల అవినీతి, స్త్రీ పునర్వివాహం, రైతు సమస్యలు, లంచగొండి తనం, కార్మికుల తిరుగుబాటు, వరకట్నం, ధనిక పేద వర్గాలమధ్య సంఘర్షణ- వంటి సమస్యలతో వచ్చిన సినిమాలు ప్రజలను ఆలోచింప చేసేవిగా ఉండేవి. సాంకేతికంగా ఇంతటి పురోగతిని పొందక పోయినా, మంచి కథ, సంగీతం, వేషధారణతో- సంఘంపైన ఆరోగ్యకరమైన ముద్ర వేయగలిగేలా ఉండేవి.

రానురాను సినిమా వ్యాపార దృష్టితో తీయటం ప్రారంభమైంది, చలన చిత్రం ఒక కళగా, సమస్యలను ఎత్తి చూపేదిగా ఉండటం తగ్గి, జనాన్ని ఆ కాస్సేపు ఏవో ఊహాలోకాల్లో విహరింపచేసే వినోద సాధనంగా మారింది.

మాయా మంత్రాలు, చౌకబారు నృత్యాలు, ట్రిక్ ఫొటోగ్రాఫీ, కత్తి యుద్ధాలు, స్టంట్సు వంటి ఆకర్షణలతో వచ్చిన జానపద చిత్రాలు జనసామాన్యాన్ని బాగా ఆకర్షించాయి. తాత్కాలికమైన ఉత్సాహం, ఉద్రేకం, ఊపుతో- ఆ కాస్సేపు ఆనందించటానికి తప్ప మరే ఇతర ప్రయోజనం జనానికి వాటివల్ల కలగదు.

మధ్య మధ్యలో వచ్చిన పౌరాణిక చిత్రాలు కూడా- మూలంతో పాటు చిత్ర విచిత్ర కల్పనలతో, హంగులతో తీయబడి ప్రజల్ని ఆకర్షించాయి. పురాణ శ్రవణానికి అలవాటుపడిన జనానికి దానిని దృశ్యకావ్యంగా చూడటం గొప్ప అనుభవంగా తోస్తుంది. కొన్ని సందర్భాలలో ఆయా పురాణ పురుషుల పాత్రలను ధరించిన పాత్రధారుల్ని నిజంగా దివి నుండి భువికి దిగి వచ్చిన దేవుళ్లుగా భావించి కొలుచుకునే అమాయకత్వం కూడా ప్రజల్లో ఉండేది. సినిమాలో దేవుడి బొమ్మను చూస్తూ లెంపలు వేసుకుంటూ, దణ్ణాలు పెట్టే అమాయకపు ప్రజ పౌరాణిక చిత్రాలలో ఎంత తాదాత్మ్యం చెందుతారో అనిపిస్తుంది.

ఆ నాటికీ ఈ నాటికీ సినిమా చూచే వారి సంఖ్య కూడా ఎక్కువే అయింది. వెనుకటి రోజుల్లో బట్ట కట్టుకుని బస్తీకి వెళ్ళి సినిమాలు చూచేవారు.

ఈనాడు ఈ బస్సుకి వెళ్ళి సినిమా చూచి ఆ బస్సుకి వస్తున్నారు. నాలుగు పకోడీల పొట్లాలు కొనుక్కొ తిని, ఒక కప్పు టీ గుటకలేస్తూ సినిమా చూచే బెంచీ క్లాసుకి ఒకరకమైన రసానుభూతి కలిగితే, చిప్స్‌తింటూ, కూల్‌డ్రింక్ తాగుతూ సినిమా చూచే బాల్కనీ క్లాసుకి మరొక రకమైన అనుభూతి కలగవచ్చు. ఆయా వర్గాలవారి మనస్తత్వానికీ, అనుభూతికీ తగినట్లు వేర్వేరు విధాలుగా సినిమా వారిని స్పందింప చేస్తుంది.

సినిమా చూచేవారిని రెండు వర్గాలుగా మనం విభజించుకుంటే - ఒకటి మేధావి వర్గం-రెండు సామాన్య ప్రజానీకం.

ఏదో ఒక ప్రయోజనాన్ని అందచేసేదిగా, మనస్సుకు ఉల్లాసంతోపాటు ఉత్తేజాన్ని కూడా కలగజేసి ఆలోచింప చేసేదిగా ఉండే సినిమాని ఆశిస్తుంది మేధావి వర్గం. అసహజ వాతావరణంతో, ఇతర భాషల సంప్రదాయాల అనుకరణతో, ఫార్ములా చిత్రీకరణతో - అతుకుల బొంతలుగా వచ్చే సినిమాలపట్ల వీరు ఆకర్షితులు కావటంలేదు. కేవలం సెక్సు, క్రైమ్- ప్రధానంగా కల సినిమాను చూచి ఆనందించే ఓర్పు వీరికి ఉండదు. అడపాదడపా వచ్చే సంచలన చిత్రాలు (New wave Pictures) వీరిపైన కొంత ప్రభావం కలిగించేవిగా ఉంటాయి.

సినిమాకు మహారాజ పోషకులనబడే సాధారణ ప్రేక్షకులకు ఏ సినిమా అయినా కాస్సేపు కాలక్షేపానికి పనికివచ్చే సాధనంగానే ఉంటుంది. సినిమాలలో చూపబడే అసహజ వాతావరణం, కల్పనా ప్రపంచాన్ని టెక్నికలర్‌లో చూచి దృశ్యానందం అనుభవించటంతప్ప- ఈ రకమైన సినిమాలవల్ల వీరు పొందే ప్రయోజనం అంతగా ఉండదు.

ఈనాడు వస్తున్న సినిమాలు కుటుంబ సభ్యులందరూ అరమరిక లేకుండా ఒక దగ్గర కూర్చుని చూడటానికి అనువుగా ఉండటం లేదనేది చాలామంది అభిప్రాయం. మన సంస్కృతికి విభిన్నమైన రీతిలో వేషధారణ, అలంకరణ

చూపించటమే కాక మోతాదు మించిన శృంగారం చూపించటంతో - జనం మొదట్లో ఆకర్షింపబడ్డా, జుగుప్స కలిగించే దృశ్యాలని చూచి ఏవగించు కుంటున్నారు.

పిల్లలు—భావిభారత పౌరులు - మన పిల్లలు, మనస్సు వికసిస్తూ ఉన్న తరుణంలో-సినిమావల్ల ఏ విధంగా ప్రభావితులవుతున్నారో చూద్దాం.

మంచికానీ, చెడుకానీ-చిన్నపిల్లలకు మొదటినుంచీ అలవడితే-అది వారికి ఉగ్గుపాలతో నేర్పిన విద్య అని అంటాం. ఈనాడు పిల్లలకు సినిమాలు చూడ్డటం కూడా ఉగ్గుపాలతో నేర్పిన అలవాటుగా మారిందనటం అతిశయోక్తి కాదను కుంటాను. అద్దాలలో పిల్లలకు తల్లులు సినిమా చూపించటం మామూలు విష యమైపోయింది. వెనకటికి రాముడు చిన్నతనంలో ఆకాశంలో చందమామని తెచ్చిస్తే కాని అన్నం తినని మారాం చేసేవాడట. మన చిన్నతనంలో కూడా 'చందమామ రావె - జాబిల్లి రావె!' అని పాడుతూ అమ్మలు అన్నం తినిపిస్తే తినేవాళ్ళమనుకుంటాను. ఈ కాలం పిల్లలు సినిమా చూడటానికి డబ్బులిస్తామని ఎరపెడితే చెప్పిన మాట వినేట్లు తయారయ్యారు. అందరు పిల్లలూ ఇంతే అనను కాని-పిల్లలకు సినిమా మోజు బాగా పెరిగింది-అనటంలో సందేహం లేదు. కొంత మంది పిల్లలకు పుస్తకాల్లో ఏ పాఠం ఎక్కడ ఉందో తెలియకపోయినా— సినిమా కథ, తారలు, టెక్నీషియన్స్ పేర్లతోసహా క్షుణ్ణంగా తెలిసిఉంటుంది. అయిదారేళ్ళ ఆడపిల్లలు కూడా 'ఆరేసుకోబోయి పారేసుకున్నాను' అంటూ నడుం తిప్పి ఆడుతుంటేనూ-పదేళ్ళలోపు మొగపిల్లలు కూడా 'దమ్ మారోదమ్' అంటూ ఊగుతూ పాడుతుంటేనూ - చూచి ఆనందించే తల్లిదండ్రులున్నంత వరకూ పిల్లలు ఈ దుస్థితి నుండి తప్పుకోలేరు. ఊహ తెలిసీ తెలియని వయ స్సులో-వాళ్ళు సినిమాల్లో చూచే పచ్చి శృంగార చేష్టలూ, స్త్రీని బలాత్కరించే ఘట్టాలూ-వాళ్ళ మనోభావాలను ఎంత మలినం చేస్తాయో వేరే చెప్పనక్కర లేదు. సినిమాలో నాయకీ నాయకులు ఒకళ్ళమీద ఒకళ్ళు పడి ఎందుకట్లా దొర్లి గింతులు వేస్తారోనని అడిగే పిల్లలకి సంజాయిషీ (Explanation) ఇచ్చు

కోవాల్సిరావడం తల్లిదండ్రుల దౌర్భాగ్యమేనని నేను అనుకుంటాను. వినోదంతో పాటు విజ్ఞానాన్ని కూడా అందించి - పిల్లల మానసిక వికాసానికి తోడుపడే సినిమాలు ఎక్కువగా మనకు వస్తే, అవి వాళ్ళు చూస్తే-దానివల్ల వారు ఎంతో స్ఫూర్తినీ, చైతన్యాన్నీ పొందుతారు.

పిల్లల లేత మనస్సులపైన పడే ముద్రని బట్టి వారి భవిష్యత్తు, తద్వారా దేశ శ్రేయస్సు-ఆధారపడి ఉంటాయి. ఈ విషయంలో సినిమా వాళ్ళను ఎంతగానో ప్రభావితులను చేయవలసి ఉంది. అంతేకాని వాళ్ళను రెచ్చగొట్టేదిగా, **eve teasers**గా, రౌడీలుగా, దొంగలుగా తయారుచేసేదిగా ఉండకూడదు సినిమా.

మరొక విచిత్రం - 'ఎ' సర్టిఫికెట్‌తో చూపించే సినిమా హాళ్ళనిండా Adults కానివారే ప్రేక్షకజనంలో ఉండటం మనం అందరం ఎరిగిన చేదు నిజం. ఏ ప్రయోజనంతో అవి 'ఎ' సర్టిఫికెట్ తెచ్చుకుంటున్నాయో-వాటిని పిల్లలకు చూపిస్తున్నారో-అది వ్యాపారానికి సంబంధించిన విషయం కావచ్చు. కాని దీని ప్రభావంతో ఎంతో అనర్థం జరుగుతూ ఉంది - అనటంలో సందేహం లేదు.

యువత—విద్యార్థులు, యువతీ యువకులు-వీరు కూడా వినోదం కోసం సినిమాని ఎక్కువగానే చూస్తున్నారు. సినిమాలలో కనిపించే సెక్స్, క్రైమ్, విలనీ-వీటిపట్ల ఆకర్షితులవుతున్నారు. ఇవి మోతాదుమించి చూపటంలో నిర్మాతలకు వ్యాపారదృష్టి ఉండవచ్చుగాక - కాని అది సంఘానికి చాలా హాని కలిగిస్తున్న మాట నిజం.

క్రైమ్ సినిమాల ప్రభావంతో ఒక నిర్ణీత పద్ధతిలో బ్యాంకు దోపిడీలు, బందిపోటుతనాలు, హత్యలు జరిగిన ఉదంతాలు ఉన్నాయి. To Catch a Thief వంటి ఆంగ్ల చిత్రాలు-దొంగతనాలు, కుట్రలు, మోసాలు చేయడానికి ప్రేరేపణ కలిగించేవిగా ఉంటాయని పరిశీలకుల అభిప్రాయం.

ఈమధ్యనే హత్య చేయబడిన నిరంకారీ బాబా గురుబచ్చన్ సింగ్ హత్యకూ అప్పుడు సిటీలో ఆడుతున్న 'The Day of the Jackal' ఆంగ్ల చిత్రంలో చూపబడిన ఘట్టాలకూ దగ్గర పోలికలున్నట్లు పోలీసులు అభిప్రాయపడినట్లు వార్త వచ్చింది. కేవలం ప్రజల్ని ఆకర్షించి వ్యాపారాన్ని పెంపొంద చేసుకోవాలని ఇటువంటి చిత్రాలు తీసేవారికి ఒక విజ్ఞప్తి: సంఘంలో సంఘ విద్రోహక శక్తుల్ని మేల్కొలుపకండి! కాస్తంత మానవతనూ, ఉదాత్తతనూ ప్రజల మధ్యకు తీసుకు రండి. హింసా ప్రవృత్తిని మాత్రం ప్రోద్బలం చేయకండి!

ఇంతేకాక, జీవితం అదృష్టాలతో, హఠాత్సంఘటనలతో నిండిఉంటుందనే భ్రమ - సినిమాలలో కనిపించే అసహజ కల్పనా ప్రపంచం - యువతీ యువకులకు కలిగిస్తూ ఉంది. ఇది ఒక రకంగా (escapist attitude)-నిజాన్ని ఎదుర్కోలేని అశక్తతగా పరిణమిస్తూ ఉంది.

వ్యక్తి ఆరాధన — చిత్రాల్లో కళ్ళముందు నిలిచేవి పాత్రలు. ఆయా పాత్రలను ప్రతిబింబింపజేసి - కల్పిత పాత్రలే తాము - అన్న భ్రాంతిని మనకు కలిగిస్తారు పాత్రధారులు. అది ప్రేక్షకుల మనస్సులను స్పందిస్తుంది. ఆయా పాత్రధారుల పట్ల జనానికి అభిమానం కలిగిస్తుంది. మంచిదే! కాని సినిమా తారల పట్ల విపరీతమైన మోజుతో వారిని వ్యక్తులుగా కాక దేవతలుగా ఆరాధించటం మామూలైపోయింది. ఈ వ్యక్తి ఆరాధనతో ఏర్పడిన అభిమాన సంఘాలు, వాటి మధ్య కక్షలు, కార్పణ్యాలు, తగాదాలు, తారల సినిమా పోస్టర్ల మీద పేడ ముద్దలు విసరటం, చించటం వంటి అర్థ రహితమైన చేష్టలు! ఇది చాలా అనారోగ్యకరమైన వాతావరణంగా మారింది.

ఈమధ్యనే పత్రికలలో వచ్చినవార్త-ఈ దురభిమానం, ఎంతటి కక్షకు దారి తీస్తుందో తెలిపే ఉదంతం ఇది. మంగలి షాపులో మంగలి వాడికీ, క్షౌరం చేయించుకునే ఆసామీకీ వాగ్వాదం లేచిందట. రజనీకాంత్ గొప్ప యాక్టరని ఒకరూ, కమలహాసన్ గొప్పవాడని మరొకరూ కాస్సేపు వాదించుకున్నారట.

మంగలికి వీరావేశం వచ్చి గడ్డం గీయటానికిబదులు ఆ ఆసామీ ముక్కు చెక్కేశాడట! ఇదీ మన సినిమా తారల అభిమానుల స్థితి!

నటులుగా గొప్ప ప్రతిభను ప్రదర్శించగలిగిన ఆ కళారాధకులను గొప్ప వ్యక్తులుగా అవశ్యం గుర్తించి గౌరవించవచ్చు. అభిమానించవచ్చు. కాని ఈ అభిమానం దురభిమానంగా, ఆరాధనగా మారకూడదు, ఈ జాడ్యం సంఘానికి చీడ పురుగులా పట్టింది. మధ్య యుగాల్లోని మత వైషమ్యాలకు తీసిపోని విధంగా ఈ కక్షలు పెరిగి పోతున్నాయి. ఈ పిచ్చి ఎక్కువ కాకుండా చూడటం ఎంతయినా అవసరం.

ఇటీవల ఏవో వ్యక్తిగత సమస్యలను తట్టుకోలేక ఆత్మహత్య చేసుకున్న ఒక సినిమా తార అభిమాని - ఆ వార్త వినగానే - ఆమె చేసినట్లుగానే సీలింగ్ ఫ్యాన్ నుంచి ఉరి పోసుకుని నిండు ప్రాణం తీసుకున్నాడని మరొక వార్త. సినిమా తారలపట్ల పెంచుకున్న విపరీతమైన వ్యక్తి ఆరాధన ఎంతటి దారుణానికి దారి తీస్తుందో - సంఘంలో ఇది ఎంతగా పాతుకు పోయిందో - ఇటువంటి సంఘటనలు మనకు చెపుతాయి.

సినిమాలు చూచే వారందరూ ఇంత craze- వెర్రి అభిమానం పెంచుకుంటారని కాదు కాని, జీవితాన్ని ఒక కలర్ పిక్చర్‌గా ఊహించుకునే అమాయకత్వంతో - సినిమాల పట్ల విపరీతమైన మోజు పెంచుకునే కొంత మంది ఆడ పిల్లల కథలు కూడా మనం ఎరుగుదుం. సినిమా తారలు కావాలనే కోర్కెతో ఇల్లు వదలి పట్నాలకు పోయి - రెంటికీ చెడ్డ రేవడిలా బ్రతుకులు నాశనం చేసుకునే అమ్మాయిల అమాయకత్వానికి విచారించ వలసిందే! జీవితం సినిమా కథవలె జరుగుతుందనే అపోహ, డ్యూయెట్లు పాడుకుంటూ ప్రేమాయణం జరపవచ్చుననే భ్రమతో - సినిమాలలో ఉండే వేష భాషలు, కృత్రిమ అలంకరణలను అనుకరిస్తూ - వాస్తవ జీవితాన్ని ఎదుర్కోవలసి వచ్చేసరికి నిరాశ పొందుతున్నారు. Frustrate అవుతున్నారు.

## మహిళలు

సినిమా ఆకర్షణ మహిళా లోకంపైన కూడా ఎక్కువగానే ఉన్నదనే విషయం నిర్వివాదాంశం. ముఖ్యంగా మధ్య తరగతి స్త్రీలకు కావలసిన సెంటిమెంటూ, త్యాగాలూ, కన్నీళ్లూ, పాతివ్రత్యపు కథలూ - మన సినిమాల్లో పుష్కలంగా లభిస్తాయి. నిజ జీవితంలో అందుకోలేని అందమైన అనుభవాల్ని, ఖరీదైన జీవితాల్ని, glamour - తెరమీద చూచి ఆనందిస్తారు. విచారించవలసిన విషయం ఏమిటంటే - స్త్రీని చాలా చిత్రాల్లో బొత్తిగా నోరులేని వ్యక్తిత్వం లేని మర బొమ్మగానూ, చేతకాని తనంతో అర్థం లేని త్యాగాలు చేసే మట్టి బొమ్మగానూ మన వాళ్లు తెరమీద చూపించటం - ఎన్నాళ్లున్నా అవే కన్నీళ్ళు, అవే పాత్రలు. వాటినే మహిళలు ఇష్టంగా చూచి ఆనందించటం. మొగుడు తప్పతాగివచ్చి పెళ్లాన్ని చితకొట్టినా - నీ పాదదాసి నంటూ వాడి కాళ్ళు పట్టుకు వేళ్ళాడే వ్యక్తిత్వంలేనిదానిగా చిత్రిస్తున్నారు. ఇదంతా చూస్తుంటే - ఇటువంటి సినిమాలు చూచి ఆనందించే మధ్యతరగతి ఆడవాళ్ళకు తమకేది కావాలో తమకే తెలియదేమో ననిపిస్తుంది. ఇప్పుడిప్పుడే - స్త్రీని ఒక మనిషిగా నిలబెట్టే చిత్రాలు ఒకటీ అరా వస్తున్నాయి. ఇవి ఇంకా రావాలి.

మరొక ప్రక్క - స్త్రీని శృంగారానికి మాత్రమే ఉపయోగపడే ఆట బొమ్మగా - sex symbol గా - చూపించే దృశ్యాలు ఎక్కువగా చూపటంతో సంఘంలో స్త్రీ పట్ల ఉండవలసిన మన్నన, గౌరవం - స్థానంలో ఒక తేలిక భావం ఏర్పడుతూ ఉంది. ఒంటిమీద రెండు గుడ్డపేలికలు చుట్టి కుప్పిగంతులు వేయించే డాన్సులు - వాటి పోస్టర్లు, పత్రికల్లో ఫోటోలు - ఈ రోజు మనకు ఎక్కడంటే అక్కడే కనిపిస్తాయి. స్త్రీని బలాత్కరించే ఘట్టాలు తప్పనిసరిగా సినిమాల్లో ఉండటం పరిపాటి అయింది. ఇటువంటి దృశ్యాలు సభ్య సమాజానికి ఎంత జుగుప్స కలిగిస్తాయో - మనుషుల మనః ప్రవృత్తిని ఎంత దిగజార్చుతాయో నేను వేరే చెప్పనక్కర లేదు. సంఘం నైతిక విలువల మీద ఇది దెబ్బ తీస్తూ ఉంది.

స్త్రీలు దీనికి నిరసనగా ఇదివరలో కొంత ఆందోళన లేవదీశారు. ప్రద ర్శనలు జరిపారు. మహిళా లోకానికి జరిగే అవమానం జాతి అంతటిదీ కూడా కనుక అందరూ ఏక కంఠంతో సినిమాల్లో చూపే అసభ్య దృశ్యాల్ని నిర సించాలి.

నేటి సంఘంలో స్త్రీ ఎదుర్కొవలసిన సమస్యలు - అవమానాలు ఎన్నో. వీటిన్ని సినిమాలలో ప్రతిబింబించి - స్త్రీని శక్తిగల వ్యక్తిగా నిలబెట్టి చూపించే పాత్రలు వచ్చినప్పుడు వారికి సినిమా ద్వారా కూడా అభ్యుదయం కలుగు తుంది.

**పాటలు** :- సినిమాల విషయం వచ్చినప్పుడు పాటల ప్రసక్తి రాకుండా ఉండదు. ఈనాడు సినిమా పాటలకు ప్రజలలో ఎంతో ప్రాధాన్యం ఉంది. గొడ్లకాడ బుడ్డాళ్ళు పదం పాడుకోవడం మానేసి సినిమా పాటలు పాడటం మొదలు పెట్టి చాలా రోజులైంది. తల్లులు పిల్లలకు జోల పాడటం మానేసి సినిమా పాటలు వినిపిస్తున్నారు. ఆఖరుకు హరికథా కాలక్షేపాల్లో కూడా రెండు సినిమా పాటలు పాడందే హరిదాసును ప్రజలు వదిలి పెట్టడం లేదు! పెళ్ళిళ్ళలో, వేడు కల్లో, హోటళ్ళలో, దేవుడి గుళ్ళల్లో - ఎక్కడ పడితే అక్కడ సందర్భశుద్ధి లేకుండా సినిమా పాటలు పెద్ద పెట్టున పెట్టుకుని విని ఆనందిస్తున్నారు.

ఇంత బహుళంగా వ్యాప్తిలోకి వచ్చిన సినిమా పాటలు ఆధునిక సాహి త్యంలో, సంగీతంలో కూడా ఒక నూతనత్వాన్ని తెచ్చాయి. నలుగురూ కూర్చుని ఆనందిస్తూ వినటానికి వీలు కాకుండా ఇబ్బంది పెట్టే పాటల ప్రభావం పిల్లల మీద పెద్దల మీద - పడుతూనే ఉంది. తినగ తినగ వేము తీయనవు తుందనట్లు పదే పదే — అవే పాటలు, బాణీలు వినటంతో జనం వాటికే బుర్ర ఊగిస్తున్నారేమో ననిపిస్తుంది. అందుకు భిన్నంగా - మంచి సంగీతాన్ని, సాహిత్యాన్ని - జనం అర్థం చేసుకుని ఆనందించగలరు అనటానికి 'శంకరా భరణం' లోని పాటలు నిదర్శనం. సుప్రసిద్ధులయిన కవులు సినిమా పాటల సాహిత్యాన్ని ఒక మెట్టు పైకి తీసుకువెళ్ళారు.

సినిమా పత్రికలు :- సినిమా జర్నలిజం ప్రజలలో బహుళ వ్యాప్తిలోకి వచ్చింది. కేవలం సినిమా కోసం ఏర్పడిన పత్రికలే కాక ఇంచు మించు అన్ని మాస వార పత్రికలలోనూ కొన్ని పేజీలు సినిమా సమాచారం కోసం కేటాయించబడుతున్నాయి. ఏ కొద్ది పత్రికలో ఒక నిర్ణీత పద్ధతిలో - ఒక ప్రయోజనం దృష్టిలో పెట్టుకుని విమర్శలు, సమాచారాలు - అందజేస్తున్నాయి. కాని, చాలా భాగం సినిమా తారల వ్యక్తిగత జీవిత విశేషాలు బయటకు ఈడుస్తూ - వానివి గురించి ఉన్నవీ లేనివీ అసభ్యంగా కల్పించి వ్రాస్తున్నాయి. ఇవి ఎంతో ఆసక్తిగా చదివి ఆనందించే వారు కూడా ఎక్కువయ్యారు. ఇటువంటి పత్రికలు పుట్టకొక్కుల్లా వచ్చి ప్రజల కుతూహలాన్ని ఇంకా ఎక్కువ చేస్తున్నాయి. అభాండాలతో (Scandals తో) కూడిన ఈ వార్తలు తాత్కాలికంగా ప్రజల్లో ఒక ఉత్సుకత రేపెట్టటం తప్ప - దీనివల్ల సమాజానికి ఎటువంటి ప్రయోజనమూ ఉండబోదు. చూడగా చూడగా సినిమాల కంటే కొన్ని సినిమా పత్రికలే సంఘానికి చెరుపు చేస్తున్నాయేమో ననిపిస్తుంది. మంచి విమర్శనాత్మక దృష్టిని, ఉత్తమ కళాభిరుచిని - పెంపొందించేటట్లు పత్రికలు వస్తే ప్రజలకు మార్గదర్శకంగా ఉంటాయి.

సినిమావాళ్ళు, సినిమాతారలు - ఎక్కడినుండో పుట్టుకువచ్చిన అతిలోక వ్యక్తులు కారు. వారు మన మధ్య నుంచి వచ్చినవారే ! మనలాంటివారే అనే స్పృహ జనంలో రావాలి. చిత్రరంగంలో కళాకారులుగా అడుగుపెట్టి-ఆర్జనతో పాటు కళాసేవ కూడా చేస్తున్న వారిని ఎక్కువగా గౌరవించవచ్చు. చిత్రరంగం ఒక రంగుల ఛమక్కుల ఆకర్షణల జగత్తు. ఆ చమక్కులను చూచి ఆనందించాలి తప్ప, ఆ ఆకర్షణకు శలభాలవలె బలి కాకూడదు.

కరువు కాటకాలతోను, తుఫానులు, ఇరుగు పొరుగు దేశాలతో యుద్ధాలతోను దేశానికి ఉపద్రవం వచ్చినప్పుడు ఈ కళాకారులు ముందుకు వచ్చారు. లక్షల రూపాయలను విరాళాలుగా పోగుచేసి దేశ శ్రేయస్సుకై పాటుపడ్డారు. ప్రజల అభిమానం సినిమారంగంపైన ఎంతగా ఉందో - సినిమారంగం కూడా

ప్రజల కష్టసుఖాల్లో అంతగా పాలుపంచుకుంటూ ఉన్నదన్న విషయం నిరూపించారు.

సినిమా సాహిత్యం— కథనంలో, భాషలో-అచ్చపు తెలుగుతనం ప్రతిబింబించే సినిమాలు కూడా వస్తున్నాయి. ఇదికాక - మాండలికమైన భాష, ప్రాంతీయమైన ఆచారాలు-విభిన్న సంస్కృతులు-సినిమాలలో చూపించటంతో-విభిన్న ప్రాంతాలవారిని దగ్గరకు తీసుకువచ్చే ప్రయత్నం జరుగుతున్నది. ఇది జాతీయతా భావనకు (National Integration)కి తోడుపడుతుంది.

సినిమా కథలు వాస్తవానికి దూరంగా ఉంటున్నాయని చాలా మంది భావిస్తున్నారు. సినిమాకోసం కథ వ్రాయటంకన్నా, వ్రాసిన కథను సినిమాగా తీస్తే - అది ప్రజల మనస్సులలో గొప్ప ప్రభావం కలుగజేసేదిగా ఉంటుంది. వ్యక్తులమీద ఆధారపడిన కథలు మాత్రమే కాక-సామాజిక, సామూహిక, సమకాలీన సమస్యలని తెరమీద చూపించినప్పుడు అది అందరినీ కదిలించే శక్తివంతమైన సాధనం అవుతుంది. ఇటీవల రచయిత్రుల కొన్ని మంచి నవలలు ఎక్కువగా చిత్రాలుగా రావడం సంతోషదాయకం.

ప్రజా జీవితాన్ని బాగా అర్థం చేసుకున్న మేధావులు తీసిన సినిమాలు వేరుగానే ఉంటాయి. వాటి ప్రభావంతో సమాజం చైతన్యవంతం కాగలుగుతుంది.

సినిమాల్లో చూపించే అర్థ రహితమైన దారుణ హింసాకాండను (violence) అసభ్య దృశ్యాలని (Sex) అరికట్టటానికి ప్రభుత్వం చర్య తీసుకుంటున్నదనే పత్రికా ప్రకటన ఈ మధ్యనే వచ్చింది. ఈ చర్య నిజంగానే వారు తీసుకుంటే-సినిమాలవల్ల సమాజానికి జరుగుతున్న చెడును అరికట్టటమేకాక ఎంతో మంచి సినిమాలు రావటానికి అవకాశం ఉంది. ముందు ముందు-ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ, సాహిత్యపు విలువలని ప్రదర్శింపజేసే ఉత్తమ సాధనంగా సినిమా మన ముందు నిలుస్తుందని ఆశించుదాం.

# సంఘము–సినిమాల ప్రభావము

కొండముది రుక్మిణీదేవి

సాహిత్యానికి పరాకాష్ఠ నాటకం అయితే, సర్వకళాప్రక్రియలకు సమాహారం చలనచిత్రం. నటన, సాహిత్యం, సంగీతం, ఫోటోగ్రఫీ మొదలయినవన్నీ సమపాళ్ళలో రంగరింపబడి, ఏకోన్ముఖమైన ఒక రాగమయ, రసమయ స్థితికి దోహదం జరిగినప్పుడే చలనచిత్రానికి సార్థక్యత లభిస్తుంది.

ఉదాహరణకు, ''వేజెస్ ఆఫ్ ఫియర్'' ''బై సికిల్ తీఫ్'' ''యూకీ వారిసూ'' వంటి విదేశీ చిత్రాల్నీ, ''దోబీఘా జమీన్'' ''ఝనక్ ఝనక్ పాయల్ బాజే''వంటి హిందీచిత్రాల్నీ, ''మల్లీశ్వరి'' ''సీతాకల్యాణం'' ''శంకరాభరణం'' వంటి తెలుగు చిత్రాల్నీ చెప్పుకోవచ్చు.

ఈ చిత్రాల్లో ఏ ఒక్క ప్రక్రియ విఫలమైనా, అది చిత్రవైఫల్యానికి దారితీసివుండేది. విఫలమైన చిత్రాలు సమాజంలో వైక్లబ్యాన్ని సృష్టిస్తే, కళా సఫలతను సాధించిన చిత్రాలు జన జీవితంలో శాంతిపుష్పాలు పూయిస్తాయి. అది వైఫల్యమైనా, ఆనందసాఫల్యమైనా, నిశ్చయంగా అదొక అనుభవం. ఆ అనుభవం మరీ ఎక్కువయితే, అదొక నల్లమందు. ఈనాడు ఏ ఇద్దరు కాలేజీ కుర్ర వాళ్ళు కలుసుకున్నా, ''మీ బాస్ సినిమా ఎట్లా వున్నది?''తో మొదలయి, మీవాడు వెధవ అంటే మీవాడు వెధవ, మీవాడు రోగ్ అంటే మీవాడు దగుల్బాజి వరకు వెళ్తున్నది వాళ్ళ వాగ్వాటి. ''మాన్ డజ్ నాట్ లివ్ బై బ్రెడ్ ఎలోన్'' మనిషికి ఆహారం మాత్రమేకాదు కావలసినది, విరామం కావాలి. అందులోనూ తనదైన ఒక ఆనందమార్గాన్ని అన్వేషిస్తాడు మానవుడు. నేడు అతి చవకగా లభ్యమయ్యేది, అమూల్యమైన ఆనందాన్ని కల్గించేది–సినిమా!

ఈ ఆధునిక ప్రపంచంలో సంఘర్షణ ఎక్కువై, సంక్లిష్టత పెరిగి, సగటు మనిషి రిలీఫ్‌కోసం తపనపడిపోతున్నాడు. అందుకనే మన తెలుగునాట ఈనాడు శ్రామికులు, కర్షకులు, మధ్యతరగతి త్రిశంకువాసులు అన్నమయినా మానుకుని సినిమాకు వెళుతున్నారు. చూడటం మానుకోలేకపోతున్నారు. చూసిన కొద్దీ సినిమాల్ని మరీమరీ చూస్తున్నారు. గంగవెర్రులెత్తిపోతున్నారు. అటు మద్రాసుకో, ఇటు హైదరాబాదుకో పరుగులుపెడుతున్నారు. తీరని ఆశల సుడి గుండంలో చిక్కి ఆత్మహత్యలు చేసుకుంటున్నారు.

మా ప్రక్కవాళ్ళబ్బాయి చాలా తెలివయినవాడు. చిన్నప్పటి నుంచి సినిమా హీరోలంటే తగని పిచ్చి. పాకెట్‌మనీ ఇస్తే తారల ఫోటోలు, సినిమా పుస్తకాలు కొనేవాడు. ఎం. ఏ. ప్యాసైన తరువాత ఉద్యోగ ప్రయత్నం చేయ మంటే, "నా అభిమాన హీరో దగ్గరకు వెళ్తాను" అన్నాడు.

తల్లిదండ్రులు ఆశ్చర్యపోయి, "అక్కడికి వెళ్ళి ఏం చేస్తావ్?"అన్నారు.

"ఏదన్నా పనిచేసుకు బ్రతుకుతాను. ఏదీ లేకపోతే హీరో బూట్లు పాలిష్ చేస్తూనన్నా అతని దగ్గర వుంటాను", అన్నాడు.

అక్కచెల్లెళ్ళు, అన్నదమ్ములు నచ్చచెప్పిన మీదట, నాలుగు రోజులు వూరుకుని, "మీరు వెళ్ళనివ్వనందుకు నాకు ఇంతకంటే గత్యంతరంలేదు" అని చీటీ రాసిపెట్టి వెళ్ళి రైలుకిందపడ్డాడు. ఏమిటి సంఘంమీద ఈ సినిమాల ప్రభా వం? ఏమున్నది సినిమాల్లో? అని, "ఏమీలేదు" అంటారు సినిక్స్.

"అంతా అందులోనే వుంది" అంటారు ఆశావాదులు, కానీ మధ్యేమార్గంగా ఒకమాట చెప్పవచ్చు. సమాజాన్ని సినిమాలు నడిపిస్తున్నయ్! సినిమాల్ని సమాజం నడిపిస్తున్నది. ఇలా ఒకదానిమీద ఒకటి ఆధారపడ్డయ్!

యోగి వేమన సినిమా చూసి, ఒక మహానుభావుడు బాలయోగి అయినాడు. సమాజానికి అద్దంపట్టి సత్యజిత్‌రే మహాదర్శకుడయ్యాడు. సినీ సంగీతం

మూలంగా లలితసంగీతం ప్రాచుర్యం పొందింది. అమెరికాలోవున్న అండర్ గ్రౌండ్ సొసైటీ మూలంగా, సినిమాల్లోకి దౌర్జన్య దృశ్యాలు ప్రవేశించాయి. ఏది దేనిమీద ఆధారపడ్డదీ, ఏది దేన్ని ప్రభావితం చేస్తుందీ అన్నదిమాత్రం అస్పష్టం. అయితే ఇప్పటి చర్చనీయాంశము : "సమాజము-సినిమాల ప్రభావము" కనుక ప్రసంగ విషయం వివరిస్తాను. సమాజం వ్యక్తుల కూడలి, సినిమా నవ్యతసాల కూడలి. సినిమా దేవత ఒక చేతిలో కళనూ, మరొక చేతిలో వ్యాపారాన్నీ పెట్టుకుని భక్తుల్ని ఆదరించే ఆధునిక శక్తిస్వరూపిణి. కేవలం వ్యాపారాన్నే అనుగ్రహంగా తీసుకున్నవాళ్ళు సిద్ధాంతాల్నీ, త్యాగాల్నీ వదిలేసి, కేవలం జనాన్ని దోచుకోవటానికే ప్రయత్నించేసేవాళ్ళు. ఈ కోవకు చెందినవే ఈ మధ్య కేరళనుండి దిగుమతి చేసుకున్న న్యూవేవ్ చిత్రాలు. నిజానికి అవి న్యూవేవ్ చిత్రాలు కావు. న్యూడ్ సెక్స్ చిత్రాలు, స్త్రీని దిగంబరంచేసి, స్త్రీత్వాన్ని మాంసంగా అమ్ముకునే ముష్కరుల కుటిల యత్నాలు అవి. సమాజానికి అవొక న్యూసెన్స్ చిత్రాలు.

మరికొందరున్నారు. అర్థంకాని ప్రయోగాలు చేసి, జనం వాటిని తిరస్కరిస్తే, తిట్టిపోసేవాళ్ళు. కళ అంటే వాళ్ళకు సరైన అవగాహన ఉన్నట్లు కనబడదు. ఉదాహరణకు మృణాల్ సేన్ తీసిన ఒకవూరికథ. కళ పేరిట కథానాయకుడు కాలకృత్యాలు తీర్చుకోవటం తెరమీద చూపించటం అసహ్యం అనిపిస్తుంది. మరికొంతమంది అటు కళనూ, ఇటు వ్యాపారాన్ని జమిలిగానేసి, ఆరోగ్యకరమైన వాతావరణంలో ప్రజల్ని ఆనందపరచేవారు. వాహినీవార్ని, అన్నపూర్ణ వార్ని ఇందుకు ఉదాహరణగా తీసుకోవచ్చు.

సినిమాల్లో ముఖ్యంగా చెప్పుకొనేవి మూడు రకాలు, 1. కథాచిత్రాలు, 2. డాక్యుమెంటరీలు, 3. బాలల చిత్రాలు. ఒక్కొక్క చిత్రానికి ఒక్కొక్క ప్రయోజనం వుంటుంది. ఆ మధ్య పొగత్రాగటం మీద ఒక డాక్యుమెంటరీ వచ్చింది. అది చూసిన వారెవరూ, పొ గ జో లి కి వెళ్ళరు. అలాగే సూర్య గ్రహణం మీద ఒక డాక్యుమెంటరీ వచ్చింది. సంపూర్ణ సూర్యగ్రహణం నాడు

లేని వారికి అదొక దివ్యానుభూతి. కోట్లాది రూపాయలను వెచ్చించి, జంతువులకు శిక్షణనిచ్చి, ఆ జంతువులతో సినిమాతీసి పిల్లల మనోవికాసానికి, ఆనందానికి తోడ్పడేవాళ్ళున్నారు.

ప్రతివాడలో లోపల ఒక జేమ్స్‌బాండు. అందుకనే "007" చిత్రాలు సక్సెస్ అయ్యాయి. ప్రతికన్య లోలోపల ఒక డ్రీమ్‌గర్ల్ హేమమాలిని. సినిమా వారిని అనుకరించటం వారికోసంకాదు, మనలో దాగివున్న కొన్ని ప్రచ్ఛన్నమైన కోరికలను ఆ విధంగా తీర్చుకుని సంతోషపడదామనుకోవటానికే!

"ఛీ...నీ హీరో వుట్టిమమ్! నా హీరో దుష్టం...దుష్టం...అబ్బా! ఎంత బాగా ఫైట్ చేస్తాడు!" అని ఆవేశంగా ఆరేళ్ళ పసివాడంటే చిరునవ్వు నవ్వి వూరుకోవలసిన అరవై ఏళ్ళ తాతగారు,

"పోరా వెధవా! వెధవ బుద్ధులు నువ్వూను. నా హీరో తెరమీద కనపడితే చాలు, కొబ్బరికాయలు, పూలదండలు...అబ్బబ్బా! అలనాటి పురాణ పురుషుడు. మొన్న ఆ సినిమా చూసిన తరువాత నా జన్మ తరించిందిరా!" అనటం విన్న వారి కెవరికైనా సమాజంమీద సినిమాల ప్రభావం ఎంతటిదో అర్థమవుతుంది.

సినిమా అనేక కళారూపాల సమ్మేళనం.

పాట వింటాం, బొమ్మ చూస్తాం! కథ చదువుతాం! ఈ అన్నిటిని కలిపి తయారు చేసిన మసాలా సినిమా!

"విద్యార్థులు నవ సమాజ నిర్మాతలురా!" అంటే ఈనాటి సాంఘిక, ఆర్థిక పరిస్థితులకు విసుగు చెందిన ఆ యువతీ యువకులు ఆ నవ సమాజ నిర్మాతలు తామే అని పులకరించి పోవటం సహజమే మరి.

"తాగితే మరచిపోగలను" అంటూ బాధాతప్త హృదయంతో బాధలను తట్టుకోలేని బలహీనుడు బాటిలుకు దాసుడైతే, ఇల్లాలు పిల్లలు అన్నానికి మొహం వాచిపోవలసి వస్తున్నది.

కుర్రకారు ప్రేమలేఖలు రాసుకున్నా, పొలాల్లోనూ, గడ్డివాముల వెనక రేప్‌లు జరిగినా, నడిరోడ్డుమీదా, నడుస్తున్న రైలుబండిలోనూ దోపిడీలు జరిగినా, "ఈనాటి సినిమాలు చూసి మరీ బరి తెగించిపోతున్నారు" అను కోవటమే కాదు, కొంతమంది నేరస్థులు "ఫలానా సినిమా చూసి మేము ఈ నేరం చేశాము" అని చెప్పటం మనందరికీ తెలిసిన విషయమే !

ఒక నటుడు "నేను ఫలానా పాత్రలు పోషించే సమయంలో చాలా నిష్ఠగా వుంటాను" అనటం కన్నా, ఒక ప్రేక్షకుడు ప్రక్కవారితో, "ఎదురుగా శ్రీకృష్ణ పరమాత్మ విశ్వరూప సందర్శనం జరుగుతుంటే, ఈ సిగరెట్లు కాల్చటం ఏమిటయ్యా!" అని విసుక్కోవటం- సమాజం మీద సినిమాల ప్రభావం ఎటువంటిదో తెలియజేస్తుంది.

రాగం కదిలిస్తుంది. భావం పులకరింపజేస్తుంది. భావ రాగాలకు లయ బద్ధమైన తాళం మనిషిని, మనసును రంజింపజేస్తుంది.

ఇవేవీ లేకుండా, కేవలం బ్యాక్‌గ్రౌండు మ్యూజిక్‌తో తీసే డాక్యుమెంటరీలు మనిషిని మరీ కదిలిస్తాయి. ఈ డాక్యుమెంటరీ చిత్రాలు ఎక్కువగా ప్రభుత్వమే నిర్మిస్తోంది. ప్రభుత్వం నిర్మించినా, పరిశ్రమ నిర్మించినా, ప్రజలమీద ఎక్కువ ప్రభావం చూపిస్తాయి గనక, స్వాతంత్ర్య సమరయోధుల జీవితాల్ని, కళా కారుల జీవితాల్ని, డాక్యుమెంటరీలుగా నిర్మించి, ప్రదర్శించి, ఈనాటి యువ తరాన్ని ఉత్తేజపరచవచ్చు.

రకరకాల వ్యాధుల్ని, అపరిశుభ్రత, అవినీతి, లంచగొండితనం వల్ల ఎదురయ్యే సమస్యల్ని చూపిస్తే, నిరక్షరాస్యులైన మన ప్రజల మనః ఫలకాల పైన ఎంతో ప్రభావం చూపిస్తాయి.

ఈనాడు కూడా జానపద సినిమాల్లో కనిపించే భూత ప్రేత పిశాచాలు, పుర్రెలు, రబ్బరు పాములు మొదలయిన వాటిని చూసి, "శ్రీ ఆంజనేయం,

ప్రసన్నాంజనేయం'' అనేవాళ్ళు కోకొల్లలు. నా ఫ్రెండు ఒకామె ఆ మధ్య ఏదో సినిమా చూసి, రాత్రి పడుకునేటప్పుడు మంచంకింద చీపురు, చాట, గొడ్డలి పెట్టుకున్నది. అదేమంటే, ''దయ్యాలు ఇహ నా జోలికి రావు'' అన్నది. ఆమె మాటలకు నేను ఆశ్చర్య పోయాను.

చార్లీ చాప్లిన్ హాస్యం మనల్ని ఏడిపించేది. గుండె లోతుల్ని స్పర్శించేది. అయితే ప్రతి ప్రయోగం వెనక దాన్ని అర్థం చేసుకోలేని బడుగుగుండెలవారి మూలంగా, కొన్ని అనర్థాలు జరుగుతున్న మాట వాస్తవమే! ప్రతి దానికి బొమ్మ, బొరుసుల్లా చెడువున్నట్లే, సినిమాలోవున్న నీతిని, మంచిని విడిచి, కేవలం చెడుని అనుకరించటం మన దురదృష్టం. ''సినిమాలు చూసి, నవలలు చదివి ఇల్లా తయారయ్యావే!'' అని తల్లి కూతుర్ని అనటం రోజుకు ఒకటి రెండు సార్లన్నా వినపడుతుంది. మా పక్క వాటాలోంచి ''మీ అమ్మాయికి పెళ్ళి సంబంధాలు చూస్తున్నారా?'' అని ఎవరైనా అడిగితే, ''ఆ! మేం చూడటం ఏమిటి? మొన్నటి సినిమాలో లాగా మా అమ్మాయిని ఎగిరి గంతేసి తీసుకు వెళ్తారు ఎవరైనా, అందం తక్కువా? గుణం తక్కువా?'' అంటూ ఏకరువు పెడుతుంది ఆ తల్లి. అంటే అమ్మాయిమీదే కాదు, అమ్మలమీదా కూడా సినిమాల ప్రభావం బాగానే వుందన్నమాట. ఏది ఏమైనా, సినిమాని వినోదం కోసం చూడాలి. చెడు వున్నప్పుడే మంచికి విలువ గనక, చేతనయితే మంచిని గ్రహించాలి. అంతవరకే కాని సినిమాని జీవితానికి అన్వయించుకుంటే విలువయిన మానవ జీవితం సినిమాలాగా మూణ్ణాళ్ళ ముచ్చట అవుతుంది.

# సినిమాలు- సంఘముపై ప్రభావము

డా॥ నందివాడ పుతలీ కృష్ణమూర్తి

సంఘపురోభివృద్ధినిబట్టి దేశనాగరత నిర్ణయింపవచ్చును. సమాజాభివృద్ధి కాలానుగుణంగా ఉంటుంది. కాలాన్నిబట్టి విలువలు మారుతవి. కనుకనే పూర్వానికీ యిప్పటికీ అన్ని విషయాల్లోనూ తేడా కనిపిస్తుంది. ఈ తర్వాల అంతరాలకి కారణం మానవ దృక్పథంలోని మార్పు. ఆర్థిక సాంఘిక రాజకీయ పరిస్థితుల కనుగుణంగా సంఘం మారుతూ ఉంటుంది. ప్రజలపై సాంఘిక ప్రభావం గల విషయాల్లో ముఖ్యమైనది సినిమా.

నిత్యజీవితపు బాధ్యతలు బరువులకి మనసు అలసి విశ్రాంతి, వినోదం కోరుకొంటుంది. దీనికై సామాన్యుల కందుబాటులో ఉన్నది సినిమా. సినిమా లక్ష్యం ప్రజల కాలక్షేపం, విజ్ఞాన వినోదాలు. ఆదిలో వీధి నాటకాలు, నాటకాలు వచ్చినవి. తరువాత సినిమాలు వచ్చినై.

సాంఘిక చైతన్యానికి సినిమా ముఖ్య సాధనమైందని చెప్పవచ్చును. పౌరాణిక చారిత్రక సాంఘిక రాజకీయ విషయాలు కథా వస్తువులుగా అనేక సినిమాలు వస్తున్నై. ప్రజాభిరుచినిబట్టి నిర్మాతలు చిత్రాలు తీసి విశేష ధన మార్జిస్తున్నారు. కాలానుగుణంగా కథావస్తువులో మార్పులు వస్తున్నాయి. ఈ శతాబ్ది ఆరంభంలో స్వాతంత్ర సముపార్జన, సంఘ సంస్కరణ లక్ష్యాలుగా ఉండేవి కనక సాహిత్యంలో ముఖ్య విషయమివే. అలాగే సినిమాల్లోనూ వర విక్రయం, మాలపిల్ల, వందేమాతరం వంటి చిత్రాలు వచ్చాయి. కుల మత భేదాలు పోవాలని వరకట్న నిర్మూలనం జరగాలని - ఇటువంటి సందేశాత్మక చిత్రాలు వచ్చాయి. రానురాను నిత్యజీవిత విషయాలు కథా వస్తువులయాయి. బాక్సాఫీసు

హిట్ అవడంకోసం, సినిమా ప్రొడ్యూసరు డబ్బు చేసుకోవడంకోసం సినిమాల్లో వినోదం ఎక్కువయింది. మానసికోల్లాసం కన్నా ఉద్రేకం ఉత్తేజం అధికమయాయి సినిమాల్లో.

నేటి సినిమాలు సంఘంపై చెరగని ముద్ర వేస్తున్నవి. కవిత్వంలో కథల్లో, పాటల్లో మాటల్లో అలంకరణలో, ఒకటేమిటి జీవితంలో ప్రతీ విషయంలోనూ సినిమా ప్రభావం కనిపిస్తున్నది. పూర్వం కవిత్వం ఛందోబద్ధంగా వృత్తాలలో యిమిడి పండితాశ్రయమై ఉంది. రాజాదరణపొంది సామాన్యప్రజకందుబాటులో లేదనే చెప్పాలి. నేడు సినిమాలవలన కవిత అందరినీ లాలించి ఆనందపరిచేదయింది. అలతి పదాలతో నాజూకుగా ఉంది. ప్రఖ్యాత కవులందరూ- కీర్తిశేషులు కృష్ణశాస్త్రి, మల్లాది వెంకట కృష్ణశాస్త్రి, సి. నారాయణరెడ్డి, వేటూరి సుందరరామ్మూర్తి, ఆరుద్ర మొదలైన వారందరూ సినీకవులైనారు. సినీమా పాటలు మాటలు సామాన్యుల సొత్తయినవి. ప్రతివారిలోనూ కవితా హృదయం దాగి ఉంటుంది. ఈ పాటలవలన కవితాస్పందన అధికమైంది. తన భావోద్వేగాన్ని ప్రకటించడానికి చక్కటి భాషతో గీతాల ద్వారా చెప్పగలగడం పరిపాటయిందంటే దానికి కారణం సినిమాల్లోని భావగీతాలే. అయితే నాజూకు సునిశిత భావాలుగల పాటలతోబాటు అశ్లీలగీతాలు కూడా వినవస్తున్నై. చక్కటి పాటలు పాడుకుంటున్నట్టే విటినీ పాడుకుంటున్నారు ప్రజలు. ద్వంద్వార్థ పాటల్ని యువతరం బాగా వినియోగించుకుంటున్నది. ముఖ్యంగా కాలేజీ విద్యార్థులు విద్యార్థినులని, యువతులని అల్లరి పెట్టడానికీ, చిలిపి పనులు చేయడానికీ యిట్టి పాటలు మాటలు దోహదమవుతున్నాయి. రాగమధురిమనిబట్టి అర్థం తెలియకుండా చిన్న పిల్లలు పాడేస్తూంటే నవ్వుకూడా వస్తుంది మనకు. సినిమాల్లోని మాటలు ప్రతి యింటా వినవస్తున్నవి. ముత్యాల ముగ్గులోని 'ఢిక్కీలోపడేస్తా సెకెట్రీ వంటి మాటలు నిత్యమూ వింటున్నాము. సినీగీతాలని, వరసల్ని వ్యాపారస్థులు అతి తెలివిగా వాడుతున్నారు. 'శంకరాభరణం'లోని పాటని అనుకరిస్తూ 'దొరకునా యిటువంటి ట్యూబు' వంటి ప్రకటనలు వివిధ భారతిలో రోజూ వింటున్నాం. గయ్యాళి అత్తని సూర్యకాంతం అనడం, హాస్యం ఎక్కువగా చేసే అబ్బాయిలని రాజబాబు అనడం సామాన్యమై పోయింది.

సినిమా ప్రభావం పేర్లల్లో కూడా కనిపిస్తున్నది. స్వాతంత్ర్య పోరాట దినాల్లో పిల్లలకి స్వరాజ్యలక్ష్మి, స్వతంత్ర భారతి మొదలైన పేర్లు పెట్టారు. ఇప్పుడు వాణిశ్రీ, రాజశ్రీ వంటిపేర్లు విన వస్తున్నై. నవలా రచనలో సినిమా ప్రభావం ప్రస్ఫుటంగా కనిపిస్తోంది. నేటి నవలలు చదువుతే సినిమా చూసి నట్టే ఉంటుంది. కథకులు కథావస్తువు సినిమాకి పనికి వచ్చేదిగా ఎన్ను కుంటారు. క్షమించాలి. ఒక్క విషయం చెబుతాను. నవలా రచయిత్రులకి దృక్పథం ఎక్కువగా ఉన్నట్టు తోస్తుంది నాకు. ప్రతీకథా సినిమా తీయడానికి పనికి వచ్చేలాగ వ్రాయడం వలన నవలల సంఖ్య పెరిగినా విలువ తగ్గుతుంది. చౌకబారు రచనలయి పోతున్నై.

సినిమా ప్రభావం అలంకరణలో బాగా కనిపిస్తున్నది. సరకు నాణెం లేకపోయినా సినిమా పేరు తగిలిస్తే అమ్మకానికి ఢోకా లేదని వ్యాపారస్థులు గ్రహించారు. ఫలితంగా ప్రేమనగర్ చీరలు, జయప్రద గాజులు, బాబీ బొట్టులు వచ్చాయి. వేసేది 'వేలుముడి' మాత్రమే అయినా అమ్మాయిల్లో చాలా మంది 'బాబీ ముడి' వేస్తున్నారు. జయభాదురిని సినిమాల్లో చూసి పెద్ద పమిట ధరిస్తు న్నారు. డ్రాయింగు రూము అలంకరణ కూడా శక్తిని బట్టి సినీమా పద్ధతి నవలంబిస్తున్నారు. మొన్న ఒకరింటికి వెళ్ళాను. కర్టెనులు చాలా బాగు న్నాయి బోంబే డయింగులా అన్నాను. ఆమెలేదండీ కృష్ణవేణీకర్టెన్లు! అన్నారు.

నేటి సంఘంలో సినిమాకి నిత్య జీవితానికి అవినాభావ సంబంధముంది. నేటి సమాజానికది ప్రతిబింబమయింది. చదవడం వలన కన్నా వినడం వలన, వినడం వలన కన్నా చూడడం వలన విషయం మనసుకి బాగా హత్తుకుంటుంది. అందుకనే విద్యాబోధనలో 'ఆడియో విజువల్స్' ముఖ్యమని విద్యావేత్తలు అభి ప్రాయపడ్డారు. సినిమా ప్రభావం యువతరంపై అధికంగా ఉంటుంది. ఊహా పథంలో విహరించే వారికి సినిమాల్లో చాలా అంశాలు ఆచరణీయంగా కను పిస్తాయి. దానికి కారణం వారి వయస్సు. నేనిది వరలో చెప్పినట్టు ప్రతి వారి జీవితంలో ఏదో ఒక విషయం సినిమా చూచినప్పుడు గుర్తుకు వస్తుంది.

అలాగే తమకున్న సమస్య లాటిది, సినిమాలో చూస్తే చిన్నవారా విధంగానే సమస్యా పరిష్కారానికి ఉబలాట పడతారు. మంచిమార్గం కన్నా సులభమార్గం వారి నాకర్షిస్తుంది. అందుకనే సినిమాల వలన యువతరం దెబ్బతింటున్నదని పెద్దల అభిప్రాయం. తల్లి దండ్రుల నెదిరించడం, చిన్నా పెద్దా విచక్షణ లేక పోవడం, హద్దుమీరి ప్రవర్తించడం సినిమా ప్రభావమని పెద్దల అభిప్రాయం. హెర్బర్టు బ్లూమర్ Movies and conduct అను తన గ్రంథములో ఇలా పేర్కొన్నాడు: 'From pictures they are likely to derive the ideas of Freedom of Relation to parents and of conduct towards one's associates. In this way motion pictures give sanction to codes of conduct and serve as an instrument for introducing the individual into a new kind and art of life.' సినిమా సునిశితంగా పరిశీలించి చేసిన ఈ వ్యాఖ్య సమంజసమైనది.

సినిమాల వలన మంచీ చెడూ రెండూ ఉన్నవి. చిత్ర నిర్మాతలు వాస్తవ జీవితానికి దగ్గరగా చిత్రాలని తీస్తున్నారు. సంఘంలో ఉన్న దోషాలను ఎత్తి చూపిస్తున్నారు. కాని సినిమా కూడా ఒక పరిశ్రమ గదా. నిర్మాతలు చిత్రం వలన డబ్బు చేసుకోడానికి కొన్ని పద్ధతు లవలంబించక తప్పదు. అవి అశ్లీల సన్నివేశాలు కావచ్చును. చౌకబారు సంభాషణలు, నగ్న నృత్యాలు కావచ్చును. అసందర్భాలైనా, వాటికోసం జనం ఎగబడుతున్నప్పుడు నిర్మాత తన లాభం చూసుకుంటాడు. అందువలన చిత్రంలో చెడు అనేది ప్రవేశిస్తున్నది. కాని చిత్ర నిర్మాత కేవలం చెడుని ప్రతిబింబించడం తన లక్ష్యమనుకోడు. అయితే ప్రతి వ్యక్తి మీద సినిమా ప్రభావం అంతో యింతో ఉన్నప్పుడు సంఘం మంచి చెడ్డలు, అభివృద్ధి సినిమాపై కొంతవరకు ఆధారపడి ఉన్నవనే చెప్పాలి. ముఖ్యంగా యువతరం దృక్పథంలో సినిమా ప్రభావం ఎక్కువగా ఉంది.

పౌరాణిక చిత్రాలు జనరంజకంగా ఉన్నా ప్రజల్లో పెద్ద మార్పు తేవడం లేదు. కపట సన్యాసులూ బాబాల గురించి కొద్దిగా జాగ్రత్త పడుతున్నారు.

పోతన సినిమా చూసిన యువకుడొకడు ఆధ్యాత్మిక చింతనలోపడి బాలయోగి అయినాడు. సాధారణంగా యిటువంటి చిత్రాలు కుర్రవారిని ఆకర్షించవు. రాజకీయాలు, సంఘ విద్రోహక చర్యలు యితివృత్తంగా గల సినిమాలకి జనాదరణ ఎక్కువగా లభ్యమౌతున్నది. సమతా తత్వాన్ని, వర్ణాంతర వివాహాల్ని ప్రోత్సహించే సినిమాలపట్ల కూడ ప్రజ మొగ్గుతున్నది. నేటి విద్యార్థులు స్టూడెంటు యూనియన్ ఎలక్షను కిచ్చే ఉపన్యాసాలు సినిమాల్లో రాజకీయ నాయకుల ఉపన్యాసాలని గుర్తుచేస్తాయి. ఆ విధంగా వారికి రాజకీయాల్లో ఆసక్తిగలగడానికి అవకాశం ఉంటున్నది. రాజకీయరంగంలో జరిగే యుక్తులు, కుయుక్తుల్ని గ్రహించి యువకులు రాజకీయవేత్తలు కాగలుగుతున్నారు. ప్రపంచ జ్ఞానం, లోకం పోకడ తెలుసుకోడానికి సినిమాలు బాగా ఉపయోగపడుతున్నై. స్త్రీలు జీవితంలో మోసపోయినా, దెబ్బతిన్నా ఆత్మ స్థైర్యంతో నిలబడడానికి కొన్ని సినిమాలు ప్రోత్సాహకరంగా ఉంటున్నవి. కవిత, ఇది కథకాదులో యిటువంటి సంఘటనలు బాగా చిత్రీకరించారు. 'పండంటి కాపురం' చూసి, విడిపోయిన అన్నదమ్ములు తిరిగి ఒకటవడం నేనెరుగుదును. తల్లిదండ్రులతో ఘర్షణ పడి విడివడిన వారి కిలాటివి ఆత్మ పరిశీలనకి తోడ్పడుతున్నా యనడంలో సందేహం లేదు. తాయారమ్మ బంగారయ్య చిత్రం కొత్తగా వివాహమయిన దంపతులు ఆవేశాలకి పోయి ఎలాగ కాపురాలు పాడు చేసుకోగలరో నిరూపించింది. పెద్దలు కలుగ చేసుకుని అటువంటి పరిస్థితులని చక్కదిద్దగలరని తెలియ చెప్పేదీ సినిమా. ఈ మధ్య పాశ్చాత్య సంగీతంపై మోజు హెచ్చింది. ప్రజకి పాప్ సంగీతం, జాజ్ మ్యూజిక్ పై అభిరుచి పెరిగింది. పాటల్లో పాశ్చాత్య సంగీత బాణీలు వినవస్తున్నై. కర్నాటక సంగీతంపై యువతీయువకులకి చిన్న చూపు ఏర్పడింది. అట్టివారికి కర్నాటక సంగీతం విలువ తెల్పిన సినిమా శంకరాభరణం. ఆణిముత్యం వంటి ఈ చిత్రం భారతీయ నాగరకత, ధర్మం, సంస్కృతుల విలువ తెలియ చెప్పింది. సామజవరగమనా అని అందరూ పాడడానికి ప్రయత్నిస్తున్నారంటే ఒక్క చిత్రం వలన వచ్చిన ప్రభావం ఎంతటిదో మనం గ్రహించవచ్చును.

మంచిలాగే సినిమా ప్రభావం చెడువైపుకి కూడా దారి తీస్తుంది. మంచి కన్నా చెడు త్వరగా ప్రాకుతుంది సంఘంలో. చారిత్రక చిత్రాలు ప్రజాదరణ

పొంది దేశాభిమానాన్ని పెంపొందిస్తున్నై. కాని కథరక్తి కట్టడానికై కథ చరిత్ర సత్యం లేకుండా పోతున్నది. ఫలితంగా ప్రజలు నమ్మేది అసత్య చరిత్ర.

సాంఘిక చిత్రాలలో యువతరాన్ని ఆకర్షించే ఘట్టాలు ఉంటున్నాయి. కాలేజీ అమ్మాయిలు పిక్నిక్‌కి బయల్దేరడం, కారు దారిలో చెడిపోవడం. కథానాయకుడి సహాయంతో కారు కదలడం- కారు కదలికతో బాటు హృదయాలు కదిలి - ఏకమై వివాహానికి దారితీయడం సినిమాల్లో సామాన్యంగా చూసే విషయం. లేదా దారి తప్పిన అమ్మాయిల్ని మానభంగం చేయడం. ఫలితంగా పడుపు వృత్తికి దిగి మనసు సమాధాన పరచుకోవడం వంటివి చిత్రీకరిస్తున్నారు. ఇవే నిత్యం జరుగుతున్నాయి. భార్య పేరట ఇన్స్యూర్ చేసి డబ్బు కోసం ఆమెని/చంపడం 'ఆమె కథ'లో యితి వృత్తం. ఇటువంటి వార్తలు పేపరులో చదువుతున్నాం. అదే చిత్రంలో ప్రేమ అని మోసం చేసి పడుపువృత్తికి దింపుతాడు స్త్రీని. స్త్రీ నిస్సహాయత అలుసుగా తీసుకుని సంఘంలో జరిగే అన్యాయాలు అత్యాచారాలు సినిమాల్లో చూస్తున్నాం. లక్ష్మణరేఖ, కవిత- అటువంటి సినిమాలే. ఇటువంటి చిత్రాలు దుర్మార్గుల దుశ్చర్యలకి దోహద మవుతున్నాయనడంలో సందేహం లేదు. కాలేజీ అబ్బాయికి చాలా మంది విద్యార్థినులతో పరిచయం ఉండడం ఒక గొప్ప. సెక్రటరీ, ఏజంటుగోపీ వంటి చిత్రాలిటువంటి ఊహల్ని యువకులకి కలుగ చేస్తాయి. అమ్మాయి అబ్బాయి స్నేహం, గొప్పింటి అబ్బాయి పేదింటి అమ్మాయిల ప్రేమ వ్యవహారం, వివాహం చూసి సినిమాల్లోలాగే జీవితంలో కూడ సాధ్యమనుకుని ఆశపడే కన్నెలు కోకొల్లలు. లేనిపోని ఆశలకి పోయి విచక్షణ లేకుండా మోసపోయి ఆశాభంగం చెందిన అమ్మాయి లెందరో ఉన్నారు. ప్రపంచాన్నెదుర్కొనే ధైర్యం లేక ఆత్మహత్యకి పాల్పడిన అభాగిను లెందరో ఉన్నారు.

సినిమాలెక్కువగా చూసేవారి దృక్పథం సినీపథమే. హుషారుగా, ఖుషీగా ఉండడమే వారి జీవిత లక్ష్యం. ముఖ్యంగా వారి నాకర్షించే సన్నివేశాలు చేతిలో పానపాత్ర, పక్కన సుందరి వంటివి. ఇమిటేషన్, ఏకపాత్రాభినయం

చేసేవారికి, నిషాతో మత్తుగా మాట్లాడడం, దేవదాసు నటన ప్రతి యింటా అబ్బాయిలాడే ఆట. దోపిడీలు, దౌర్జన్యాలు, గృహదహనాలు ఉన్న సినిమాలో దుర్మార్గులలో నిక్షిప్తమై ఉన్న దౌర్జన్యాన్ని రేపుతున్నాయి. హత్యా పద్ధతులు, దొంగతనాలు సినిమాలో ట్రైనింగిచ్చినట్లు నేర్పరులౌతున్నారు దొంగలు. వేలి ముద్రలు పడకుండా తలగడతో మొహం కప్పి ఊపిరాడకుండా చేసి చంపడం, ముక్కూ నోరూ మూసి చంపడం వంటివి సినిమా ప్రభావమే. ఇటీవల హైదరాబాదులోని పాతబస్తీలో జరిగిన హత్యాపద్ధతి Pink Panther సినిమాలోలాగే జరిగింది. The Heist, How to steal a million వంటి సినిమాల ప్రభావం వార్తాపత్రికలు ప్రకటించాయి. సికిందరాబాదు నివాసి యాదగిరి అనే నిరక్షరాస్యుడు 'How to steal a million' సినిమా చూసి ఢిల్లీ మ్యూజియంలో అతి విలువైన ఆభరణాలు దొంగిలించానని పట్టుబడినపుడు పోలీసులకి చెప్పాడట. మరొక చెయ్యి తిరిగిన దొంగ సినిమా ఆధారంతో బ్యాంకికి సొరంగం తవ్వి, ఇనప్పెట్టె స్క్రూలు తీసి, తాళాలూ తలుపులూ ముట్టకుండా బ్రహ్మాండమైన చోరీ చేశాడు.

సినిమాలవలెనే సినీ పోస్టర్లు కూడా. సెన్సార్‌వారు చిత్రాన్ని సెన్సార్ చేస్తారుగాని వాల్‌పోస్టర్ల జోలికి పోరు. వానిలోని అశ్లీలత రోడ్డుమీద నడిచే వారికి నేను ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. చిత్రం ప్రారంభం కాకముందే వచ్చిన పోస్టర్లు ఇటువంటి చిత్రీకరణతో చిత్ర విజయానికి తోడ్పడుతున్నాయి. కాని ఇవి అశ్లీలతకి, అసభ్యతకి మారుపేర్లవుతున్నప్పుడు ప్రభుత్వం చర్య తీసుకోవాలి. ఇండియన్ పీనల్ కోడ్ 292 కింద పోలీసు చర్య తీసుకున్నా లాభం లేకపోతున్నది. జరిమానా కట్టి మళ్ళీ అతికిస్తారు పోస్టర్లని. వీటిని విద్యాలయాల వద్ద నిషేధించాలని తమిళనాడు గవర్నరు పట్వారీ సూచించారు. సినిమా ప్రభావం సంఘంపై ఇంతగా ఉంటున్నప్పుడు దీన్ని సద్వినియోగం చేసుకోవాలి. కళాత్మకమై ప్రయోజనాత్మక సందేశాలివ్వాలి సినిమాలు. నిర్మాతలు తమ సినిమాల ద్వారా జీవిత విలువలు నేర్పాలి. మానసిక స్థైర్యం, నీతి నిజాయితీల కాయువుపట్టయిన కథల నెన్నుకోవాలి చిత్రానికి. సంఘం పట్ల తమకుగల గురుతర బాధ్యతని గ్రహించాలి సినీ నిర్మాతలు. అప్పుడు సినిమా ప్రభావితమై సంఘం సర్వతోముఖ పురోభివృద్ధిని పొందుతుంది.

# సమాజంమీద సినిమా ప్రభావం

డాక్టర్ ఆలూరి విజయలక్ష్మి

పరివర్తనశీలమైన సమాజంలో మన రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక జీవనం అనుక్షణం మారుతూనే వుంటుంది. సామాజిక చైతన్యం లోని యీ పరివర్తనతో పాటు కళాకారుని దృష్టి కూడా మారుతూ వుంటుంది. తదనుగుణంగా ఒక దేశంలోని ఒక జాతియొక్క కళలు విభిన్న కాలాల్లో విభిన్న రూపాల్లో సాక్షాత్కరిస్తూ వుంటాయి. ఒక జాతియొక్క ఔన్నత్య, పతనాల వికాసక్రమాన్ని తెలుసుకోవడానికి కళలెంతో సహాయ పడతాయి. రాజకీయ, ఆర్థిక, సామాజిక విప్లవాలను ప్రతిబింబింపజేసే కళలే జాతియొక్క సంపూర్ణ మైన చిత్రాన్ని దర్శింపజేయ గలుగుతాయి. ప్రజా జీవితాన్నుండి ఆవిర్భవించే కళలకు, ముఖ్యంగా చలనచిత్రాల్లాంటి శబ్ద, దృశ్య కావ్యాలకు ప్రజాజీవితాన్ని ప్రభావితం చేసే శక్తి బలంగా వుంటుంది.

1895 లో ఫ్రెంచి దేశంలో కళ్ళు విప్పిన సినిమా కొద్ది నెలల్లోనే మన దేశానిక్కూడా ఎగిరొచ్చింది. అప్పటికి శతాబ్దాల పరిపాలనలో తోలుబొమ్మ లాట లాంటి కళాప్రక్రియలు క్షీణదశకు వచ్చి ప్రజల సాంస్కృతిక జీవనం స్తబ్ధతకు లోనయింది. ఆ పరిస్థితిలో యీ క్రొత్త కళా ప్రక్రియ అన్ని వర్గాల ప్రజలనూ ఆకర్షించి, ఆనందాన్ని కలిగించింది. ప్రారంభంలో వచ్చిన మూకీ చిత్రాలు, 1930 నుండి వచ్చిన శబ్ద చిత్రాలు ప్రజలకో కొత్త అనుభూతిని పంచాయి. పాశ్చాత్య దేశాన్నుండి వలసవచ్చిన యీ కళాప్రక్రియ సంగీత నృత్యాలు, నాటకీయమైన చిత్రీకరణ, నటన, సంభాషణలు, ఒకే మూసలో తయారయే కథ, కథనం మొదలైన భారతదేశపు లక్షణాల్ని సంతరించుకుంది. అప్పటినుండి చలనచిత్రాల ప్రధాన ధ్యేయం సామాన్య ప్రజలకు వినోదాన్నం దించడం.

స్వాతంత్ర్యానికి పూర్వం చాలా అరుదుగా పారతంత్ర్యాన్ని నిరసించి స్వేచ్ఛనీ, స్వాతంత్రాన్ని కీర్తించే దేశభక్తి ప్రబోధిత చిత్రాలు, సాంఘిక సంస్కరణల్ని కోరే చిత్రాలు వచ్చినా స్వాతంత్ర్యానంతర దశాబ్దిలోనే సాంప్రదాయ పద్ధతికి భిన్నంగా సృజనాత్మకమైన, కళాత్మకమైన చిత్రాల ఆవిర్భావానికి బీజాలేర్పడినాయి. కాని యిలాంటివి వినీలగగనాన ఎప్పుడో తళుక్కుమనే తారకలు. యివి లోకానికి పంచగల వెలుగెంత అనేది ప్రశ్నగానే మిగిలిపోతుంది.

అత్యధికభాగం నిరక్షరాస్యులైన మన ప్రజలకు అందుబాటులో వుండే ఏకైక వినోదసాధనమైన సినిమా ఫార్ములా పద్ధతికి అంకితమై పోయింది. ఇందులో సామాన్య ప్రేక్షకుడికి కావలసిన వెరైటీ వినోదం, డ్రామా, సంగీతం, నృత్యం, హాస్యం, గొప్ప బ్రతుకు గురించి అందమైన భ్రమలు, ఆధునిక నాగరికత గురించి అత్యద్భుతమైన కలలు వుంటాయి. త్రికోణప్రేమలు, నీతి కథలు, మంత్ర తంత్రాలు, పరమాద్భుతాలు, ఇంద్రజాలాలు, సాహస కృత్యాలతో కూడిన సినిమాకథ, అందానికి ప్రతిరూపాలైన నాయికా నాయకులు, చూపుల్లోనే క్రూరత్వం వెళ్ళగక్కే భయంకరమైన విలన్లు, హీరో హీరోయిన్లు విధివశాత్తు కలుసుకోవడం, వెనువెంటనే ప్రేమ, రొమాన్సు, డాన్సు, డ్యూయట్లు, హీరో విలన్ల ఫైటింగ్స్, హీరో ఒక్కడు అరివీర భయంకరుడై ఇరవై మందిని చితకదన్నడం, కాసిన్ని అపార్థాలు, కొన్ని లీటర్ల కన్నీళ్ళు, కొన్ని కిలోగ్రాముల వెకిలిహాస్యం, తగినన్ని అర్ధనగ్న నృత్యాలు, అర్థం పర్థం లేకుండా అష్టవంకర్లు తిరిగి చివరికి సుఖాంతం, గ్రూప్ ఫోటో- యిలాంటి మూస సినిమాలకు సామాన్య ప్రేక్షకుడు అలవాటు పడిపోయాడు. నిత్య జీవితంలో వుండే సమస్యలు, సంఘర్షణలు వీటిలో మచ్చుకు కూడా కనిపించవు. తను అనుభవిస్తూ తిట్టుకుంటున్న జీవితాన్నే సినిమాలో చూడడానికి, తన ఏడుపే సినిమాలో కనిపిస్తే భరించడానికి ఓపిక వుండదతనికి. తాను తిండిని కూడా త్యాగం చేసి వెచ్చించిన డబ్బుకు అతను ఆశించేది అద్భుతమైన ఆనందం, కాసేపన్నా పగటికలల్లో విహరించడం, సమస్యల్నించి కాసేపన్నా పారిపోవడం అతనికి కావలసినట్లుగానే, జీవితంలో అంతర్గతంగా వుండే నిరాశా నిస్పృహల్ని, ఆశాభంగాల్ని

క్రోధాల్ని, మానసిక భద్రతా రాహిత్యాల్ని మరిచిపోగల అందమైన ప్రపంచాన్ని కళ్ళముందుంచుతుంది మన ఇండియన్ సినిమా.

ఇంక చెదురుమదురుగా వస్తున్న ఆర్ట్ చిత్రాలు మామూలు ప్రేక్షకుడి స్థాయిని విస్మరించి రూపొందించబడుతున్నాయి. అర్థంకాని సింబాలిజమ్స్, నత్తనడక, కొరుకుడుపడని సిద్ధాంతాలు - ఆర్ట్ ఫిల్మ్ అనగానే సామాన్య ప్రేక్షకుడు 'బోర్' అనుకుంటూ ఆ ఛాయలకే వెళ్ళడం లేదు. ఆర్ట్ ఫిల్మ్ తీసే ప్రతి దర్శకుడు సామాన్య ప్రేక్షకుడు ప్రస్తుతం ఉన్న స్థాయినుండి ప్రారంభించి, అతని అభిరుచిని మంచి వైపుకు మలుపుతూ అతనితోపాటు పురోగమించాలి. తను బోధించదలచుకున్న సిద్ధాంతాల్ని అతని కర్థమయేంత సాదాగా చిత్రీకరిస్తూ, తను చేరుకోవాలనుకున్న శిఖరాలకు అతనితోపాటు చేరుకోవాలి. అలా చెయ్యకపోవడంవల్ల ఆర్ట్‌ఫిల్మ్ దర్శకుడు మామూలు ప్రేక్షకులకు దూరంగా వెళ్ళిపోతున్నాడు. మేధావి వర్గపు ప్రేక్షకులు మాత్రమే అతని వేగాన్ని అందుకోగలుగుతున్నారు. అటు సామాన్య ప్రేక్షకుల్ని, యిటు మేధావి వర్గాల్ని సమానంగా ఆకర్షించగల ఆర్ట్ ఫిల్మ్స్ చాలా అరుదుగా వస్తున్నాయి. యింత అరుదుగా వచ్చే ఒకటి, అర ఆర్ట్ ఫిల్మ్స్ ప్రభావం సమాజం మీద ఎంతవరకుంటుందనేది అనుమానాస్పదమే.

చలన చిత్రాల్లాంటి శబ్ద, దృశ్య కళలకు ప్రజలకు వినోదంతోపాటు విజ్ఞానాన్ని పంచగల అవకాశం ఎంతోవుంది. వివిధ విషయాల గురించి కూలంకష జ్ఞానాన్ని అందించేవి, విభిన్న ప్రాంతాల ప్రకృతి రామణీయకత, ప్రజల ఆచార వ్యవహారాలు, జీవన పద్ధతులు, ఆర్థిక స్థాయి, సాంస్కృతిక జీవనం మొదలైన వాటి గురించి తెలిపేవి, దేశ విదేశాల్లో జరుగుతున్న అనేక వింతల్ని, విడ్డూరాల్ని, సాంకేతిక, విద్యా, వైద్య రంగాలు సాధిస్తున్న అద్భుతమైన ఫలితాల్ని కళ్ళకు కట్టినట్లు చూపించేవి, మన శారీరకారోగ్యాన్ని, మానసిక సంస్కారాన్ని పెంపొందించుకోవడానికి తీసుకోవలసిన జాగరూకతలు, సౌఖ్య ప్రదమైన జీవితాన్ని అనుభవించడానికి మనం తీసుకోవలసిన

చర్యలు మొదలైన వాటి గురించి విజ్ఞానాత్మకంగా, కళాత్మకంగా చూపించేవి డాక్యుమెంటరీ చిత్రాలు. మన దేశంలో తయారవుతున్న యీ తరహా చిత్రాలు తమ బాధ్యతను సక్రమంగానే నిర్వర్తిస్తున్నట్లు తోస్తుంది.

రేపటి పౌరులకోసం యీనాడు మన దేశంలో తీస్తున్న బాలల చిత్రాలు చాలా, చాలా తక్కువ. చిదిమితే పాలుగారే వయసు పిల్లలతో కర్మాగారాల్లో, పొలాల్లో, ఇండ్లలో వెట్టిచాకిరి చేయించడం, పిల్లల్ని అమానుషంగా దండించడం, వారి మానసిక ప్రవృత్తిని గమనించకుండా వాళ్ళ ప్రవర్తనను బలవంతంగా శాసించడం, వాళ్ళల్లో చెలరేగే అసహనం, అసంతృప్తి, తపన, కసి వల్ల సమాజానికి ఉపయోగపడే వ్యక్తులుగా కాక సమాజ విద్రోహక శక్తిగా రూపొందడం మొదలైన సమస్యల్ని చర్చిస్తూ వచ్చిన సినిమాలు మరీ తక్కువ.

ఎక్కువ సంఖ్యలో విడుదలవుతూ, ప్రజాజీవితంలో తిండికంటే ముఖ్యమైన అవసరంగా మారిన మూస చిత్రాలకు మాత్రమే సమాజం మీద మంచి కాని, చెడుకాని ప్రభావం వుంటూంది. వయసు, వృత్తి, చదువుతో సంబంధం లేకుండా స్త్రీ పురుషులిరువురికి సినిమా తప్పనిసరి కాలక్షేపంగా మారింది. చాలా మందికి నిరోధించలేని వ్యసనంగా మారింది. సినిమా మనజీవితంలోకి అతి సన్నిహితంగా చొచ్చుకు పోయాక జీవితం సినిమాను అనుకరించడం ప్రారంభమయింది. అన్ని కళాప్రక్రియల్లోనూ సినిమా ప్రభావం ప్రస్ఫుటంగా కనిపిస్తూంది. అందరూ యిష్టపడే సంగీతం ఫిల్మ్ గీతాలు, నాటకాలు, నృత్య ప్రదర్శనలు, సాహిత్యం సినిమాటిక్‌గా తయారయాయి. టెలివిజన్ ప్రదర్శనలు సినిమాని అనుకరించి రూపొందించబడుతున్నాయి. స్త్రీ, పురుషుల మధ్య సాంఘిక సంబంధాలు, వేష భాషలు, సంభాషణలు, ప్రవర్తన - అన్నిటి మీద సినిమా ప్రభావం బలంగా వుంటూంది.

కేవలం సినిమాలవల్లే సమాజం చెడిపోతూందని అనడం అర్థరహితం. సినిమాలు లేకపోయినా సమాజం చెడిపోతూనే వుంటుంది. కాకపోతే అలా అవడానికి కొంత ప్రోద్బలాన్ని ఫార్ములా సినిమాలు యిస్తున్నాయని చెప్పక

తప్పదు. దీనికి కారణం సినిమాల్ని అలా నిర్మిస్తూన్న దర్శక నిర్మాతలది, వాళ్ళచేత అలా నిర్మింపజేస్తూన్న ఆర్థిక వ్యవస్థది, అలాంటి సినిమాల్ని చచ్చి నట్లు ఆదరిస్తూన్న ప్రేక్షకులది. మనిషిలోని బలహీనతలను సులభంగా రెచ్చ గొట్టగలిగే ప్రేమ సన్నివేశాలు, అర్థనగ్న దృశ్యాలు, మానభంగాలు, హింస, పగ, ప్రతీకారాలతో నిండిన సినిమాలవల్ల సమాజం మీద చెడుప్రభావం తప్ప కుండా వుంటుంది. ప్రేక్షకుడు ఆదరిస్తున్న సినిమాల్నే తీస్తున్నామని చెప్పడం పెద్ద దబాయింపు. రోగి కోరుతున్న పథ్యాన్ని కాదు పెట్టాల్సింది, రోగి ఆరోగ్యం పట్ల నాకు బాధ్యతవుంది అనే విశ్వాసంతో అతని ఆరోగ్యాని కేది మంచిదో అదే పెట్టాలి. సమాజంమీద సినిమా ప్రభావం అధికంగావున్న ప్రస్తుత పరిస్థితుల్లో సినిమా నిర్మాణంలో అత్యంత జాగరూకత, నిజాయితీ, సామాజిక బాధ్యత వుండాలి.

నిజానికి ప్రస్తుత సమాజంలోవున్న పరిస్థితులు పలాయనవాదానికి ప్రతీ కలుగావున్న ఫార్ములా చిత్రాలకు అనుకూలంగా లేవు. ఏ రంగంలో చూచినా అసంతృప్తి, తమకు జరుగుతున్న అన్యాయాలపట్ల, నడివీధిలో నగ్ననృత్యం చేస్తున్న అరాచకాలపట్ల తీవ్రమైన క్రోధం, తమ సుఖసంతోషాల్ని, ప్రాథమిక హక్కుల్ని కాలరాస్తున్న దోపిడి వ్యవస్థను కూలదోయాలన్న ఉద్రేకం, నానాటికీ అధ్వాన్నంగా తయారవుతున్న తమ బ్రతుకుల్ని చూచుకుంటే రగిలేమంటలు- యీ పరిస్థితుల్లో కావలసినవి మనిషిలోని చైతన్యాన్ని, మానవత్వాన్ని మేల్కొల్పగల చిత్రాలు. అన్యాయాల్ని ప్రతిఘటించి, సామాజిక న్యాయంకోసం చేసే పోరాటాల్ని సమర్థించే చిత్రాలు. మనిషిని నిష్క్రియాపరుడిగా, జడునిగా, అసమర్థుడిగా, అవినీతి పరుడిగా, సంఘ విద్రోహశక్తిగా మార్చే సినిమాలుకాదు కావలసింది. మానవహక్కులను ఎలుగెత్తి చాటేవి, మానవ సమస్యలను నిష్క ర్షగా, నిజాయితీగా చర్చించగలిగేవి, 'కళ' కళ కోసమూకాదు, 'కాసు' కోసమూకాదు, 'ప్రజ' కోసం, ప్రజలకు సుఖ సంతోషాల్ని పంచగల ప్రగతి కోసం, మనిషి మనిషిగా బ్రతకగల సమాజావిర్భావంకోసం అని శంఖారా వాన్ని పూరించగల చిత్రాలు.

# యశోధర

చోడవరపు సత్యవతీదేవి

పథవిహీన యశోధర వ్యథిత హృదయ
కంటి వెలుగైన బంగారు పంట వీవు
లాల పోయింతు పాలిచ్చి తాళుమయ్య
గుక్క పట్టుచు ఏడ్వకు గుండె లదురు॥

చెప్పక చేయకే చనె ని । శీథిని తండ్రిటు రాగబంధమున్
చప్పున త్రెంచి నిత్యమగు । సత్యము కన్గొను జ్ఞాన చింతతో
తప్పదు తండ్రి నాకు నిను । తాలిమితోగని సాకు టెంతయున్
తప్పదు తల్లి గుండె యిది । తల్లడ మందును బిడ్డ ప్రేమకై.

చేతుల నెత్తి పెంచెదను । జీవన రాగము పంచి యిచ్చెదన్
మాతయు తాత నేనగుచు । మప్పెద విద్యల జ్ఞానవృద్ధికై
భూత దయార్ద్ర చిత్తునకు । పుత్రునిగా నిను తీర్చిదిద్ది నీ
తాతను గూర్తు నిన్ను పతి । దర్శన భాగ్యము నాకు కల్గినన్.

మల్లెలు విచ్చు వేళ పవ । మానుడు మెల్లన వీచు వేళ తా
చల్లని వెన్నెలన్ గురియు । చంద్రుడు వచ్చిన రాత్రివేళ కో
కొల్లగ కొమ్మలన్ పులుగు । గుంపులు కమ్మగ కూయు వేళ నా
యుల్లము త్రవ్వ పాతకథ । లూరక క్రిమ్మిన మాయ పీడకన్॥

త్యాగము చేసె జీవితపు । యాగము నందున కామక్రోధముల్
భోగము వీడి తానిపుడు । బొందెను జ్ఞాన విభూతి నెంతయున్
భాగము పంచగానగును । భార్యకు స్త్రీయని త్రోసి పుచ్చకన్
సాగదు బండి స్త్రీ జనుల । సంస్కరణం బది సాగకున్నచో॥

భక్తికి ముక్తికిన్ దిగిన । భావములన్ మది నిల్పి ముక్తికై
వ్యక్తికి దారి చూపదగు । నాత్మ బలంబది యుండె స్త్రీలకున్

రక్తి విరక్తిగామలచి । రాగల కష్టము లాత్మ బోధలన్
శక్తికి మించి చేయగల సాధ్వుల నేకులు ఎంచి చూడగన్॥

పీడెను నన్ను తానిచట । పీడనునే సతి ధర్మ మెంతయున్
నాడును నేడు నా కతడు । నాథుడు రక్షకుడౌచు తాను గా
చూడగ వచ్చు నియ్యెడకు । శూన్యము నిండిన నాదు గుండెకున్
తోడగు జ్ఞానబోధ విడి । దుఃఖము వాపగ శాంతి నిల్పగన్॥

కరుణను చిందు నేత్రములు । కన్గొని నా మది మూగవోయి తా
చరణములందు సాగిలుచు । స్వస్థత కోల్పడి యుండియుండుచో
కరముల నెత్తి నన్నతడు । కౌముది నిండిన చూపు చూచి స
త్వరముగ ధర్మదీక్ష నిడి । ధన్యత గూర్చెడె నాదు జన్మకున్॥

సాధన జేసి కన్గొనిన । సత్యము పంచుచు లోకమందు స
ద్బోధలు చేయుచుండెనట । బుద్ధుడుగా జనకుండు రాహులా!
బాధలు గాధలై చనగ । బౌద్ధ మతంబును స్వీకరించి ఆ
రాధనతో తరింతమను । రాగము పంచుచు ప్రాణి కోటికిన్॥

అలుగుచు నత్త తాతనుచు । అల్లరి వెట్టుచు నింట దోగుచున్
నిలువవు చంకలో క్షణము । నీ జనకుండిటు వచ్చినంత నే
పలికెద కొంటెవాడవని । ఫక్కున నవ్వుచు పల్లవించు నీ
కులుకులు గుండెలో విరియ । కూరిమి నిల్చితినయ్య నియ్యెడన్॥

వెలుగు గన నేను పతితోడ వెడల లేక
పాల బుగ్గల పసివాని బాయలేక
ధీర గంభీరనై యింట తిరుగలేక
మధన పడుచుంటి జీవిత పథము నందు॥

శాక్య వంశ హృదయ । సౌందర్యరాసి యో
గ్గౌతముండు మనకు । కాంతి రేఖ
రాగలందు ప్రభువు రాజగృహంబందు
వేచి చూత మిచట వేయి కనుల॥

# బంగారు లోకాలు

డా॥ ఊ. లక్ష్మీకాన్తమ్మ

అవిగో అవిగో బంగారు లోకాలు అవిగో

గతంలో కాదు, కథలలో కాదు. కలలో అసలేకాదు.

ఈ ప్రస్తుతంలోనే, నా ప్రత్యక్షంలోనే ధగధగ మెఱుస్తూ ఆ బంగారు లోకాలు నన్ను లోభపెట్టూ ఉన్నాయి.

అంతేకాదు.

ఆ బంగారు లోకాలు అమృతాన్ని వర్షిస్తూన్నాయి.

ఆ అమృత వర్షధారలనుండి అందమైన ఆనందమైన, అవసరమైన బిందువులను ఏరుకొందామని తొందరగా పరుగులు పెట్టాను.

దారినిండా ముళ్లు, బలురక్కసి పొదలు-నా పయనం నా పరుగు ముళ్ల పొదల్లో సాగికూడా ఆగలేదు. ఒళ్లు గీరుకుపోయింది. ఒళ్లంతా రక్తం ముద్దర్లు ముద్దర్లుగా క్రమ్మి అరుణముద్ర వేసింది. ఇదే అమృతం కాబోలు!

ఇంతే కాబోలు నా అనుభవం అనుకొన్నాను.

ఇంతలో దిక్కులన్నీ తెగిపడి సూత్రాలు సూత్రాలుగా క్రిందకు దిగి, నన్ను పెనవేసుకొని పైకిలాగాయి.

ఉత్థానరమ్యమైన ఆ ప్రగతిపథంలో పయనించి నందనవనంలో పడ్డాను. కల్పతరుచ్ఛాయలలో పారిజాత పరిమళాల మత్తుతో ఆనందానుభవంతో పరవశించిపోతూంటే,

ఇంతలో చందమామ పరుగెత్తుకొనివచ్చి భాయీ భాయీ అంటూ పలుకరించాడు.

చందమామను చూడగానే అంతవరకూ సద్దుమణిగిన ఆకలి మళ్లీ పేట్రేగింది.

ఆత్రంగా చందమామను అమృతం అర్థించాను.

నా ఆశ ఫలించలేదు.

కోపంకొద్దీ మామయ్యను ఒడిసిపట్టుకొన్నాను-పాపం మామయ్య నా ఇనప వేళ్ల మధ్య కత్తెర్లు పడిపోయాడు.

ముప్పందుం ఉప్పుతిని ముప్పది రోజులకైనా కోలుకుంటాడేమో కాని-

కాలంతో బాటు యుక్తిగా సంధించుకొని పోయినా, సిద్ధార్థుణ్ణి కాలేక పోయాను.

రాత్రీ మాకు కూడా కొంచెం రాత్రం నేర్పు లేకపోతే లాభంలేదు.

రాత్రీభద్రం భూయాత్తంటూ ఆశీర్వదించకపోయావో చూసుకో జాగ్రత్త!

# ఒక్కటైతే !

సి. భవాని

ఒక కాలిమువ్వ కదిలి నర్తిస్తే
కవితా ప్రవాహం గలగలా కదిలిపోతుంది
ఒక మురళీస్వరం మధురంగా మ్రోగితే
హృదయ తంత్రులు కదిలి ఆలపిస్తాయి
ఒక చిరునవ్వు పసిపాప రువ్వితే
మనిషి ఎదలో మమత మొగ్గ లేస్తుంది
ఒక మరుమల్లె మెల్లగా కనులు విప్పితే,
ప్రకృతి పులకించి పరిమళం నింపుతుంది.
ఒక తుమ్మెద కమ్మగా ఝుమ్మంటే
కమలం మది విప్పి పొదుపుకుంటుంది.
ఒక తెమ్మెర ఆలవోకగా తడిమిపోతే
తనువు పులకించి పరవశిస్తుంది
ఒక వెన్నెలకిరణం జాలువారి తాకితే
అలల కిన్నెరసాని హొయలు చిలికిస్తుంది.
ఒక మేఘబాల మెండుగా వర్షిస్తే
ధరణి ఒడిలో ధాన్యం దరహసిస్తుంది
ఒక వసంతం జలతారులా మెరిస్తే
పడుచు గుండెల్లో ప్రేమ పల్లవిస్తుంది.
ఒక కెరటం ఉవ్వెత్తుగా ఎగిరితే
నింగిలోని చందమామ నిండుగా నవ్వుతుంది

ఒకగడ్డి పువ్వు గర్వంగా విరబూస్తే
పుడమి తల్లికి క్రొత్త అందాలు తెస్తుంది.
ఒక వానచినుకు సూటిగా జారితే
ముత్యమై మారి సరంలో ఇముడుతుంది
ఒక చేయి కనులతో చేయి కలిపితే
అపూర్వ దృశ్యాలు అందంగా అందిస్తుంది.
ఒక ఉలి బండరాతిపై నృత్యం చేస్తే
అద్భుత సౌందర్యాన్ని ఆవిష్కరిస్తుంది
ఒక సిరాచుక్క అక్షర రూపం దాలిస్తే
ఉప్పెనలాంటి విప్లవం ఉరకలేస్తుంది.

# ఒక తారక రాలిపోయింది—ఒక మేరువు కూలిపోయింది !!

శారదా అశోకవర్ధన్

గడచిన రోజుల్లో
గమ్మత్తు లెన్నో చూశాను !
హృదయాన్ని ఉక్కిరి బిక్కిరి చేసే
ఆనందపు సముద్రంలో
ఈతకొట్టే రోజులు కొన్ని—
జీవితాన్ని చిందర వందర చేసే
వికృత విష సర్పాలు
బుసలు కొట్టే రోజులు కొన్ని—
రెంటినీ తమాయించుకున్నాను
ఒక్క కన్నీటి చుక్కతో అవసరం లేకుండా—
రెంటినీ ఇముడ్చుకున్నాను నాలో
ఒక్క ఎదురుదెబ్బైనా తినకుండా—
కానీ,
ఈ రోజు నా హృదయం
పగిలిపోతోంది
దానికోసం కాదు—
దానికన్న సున్నితమైన
గాజు బొమ్మ జీవితాలను చూసి,
తళ తళ మెరుస్తూ, మురిపిస్తూనే

పుటుక్కున విరిగి బుగ్గిపాలైన
విషాద గాథలను చూసి !
ఉదయ భానుడిగా పుట్టి
మధ్యాహ్నపు మార్తాండునిగా వెలిగి
సంధ్యారాగంలోని అరుణిమ అందాలను
చూడకుండానే అస్తమించిన సాహసికుడు
తల్లిని
సతీమ తల్లిని
పుడమి తల్లిని
భయ శంక శోక
జలావర్తమ్ములోకి త్రోసి
అదృశ్యుడయ్యాడు సంజయుడు
అమ్మ పొత్తిళ్ల వదలి
ఆడుతూ పాడుతూ ఆనందంగా
మృత్యువు ఒడిలోకి ఒదిగిపోయాడు
'హంసలా ఆరు నెలలు చాలనుకున్నాడేమో'
నిరంతరం ధ్రువుడిలా గగన వీధుల్లో
నిలిచి వెలగాలని వెళ్ళిపోయాడు
పేరులోనేవుంది కొండశబ్దం
తీరులోనూ అంతే అదే నైజం !
పట్టుపట్టితే అంతుచూడడం
అతని తత్వం,
కట్టుగా పనిచేసి కార్యసాధన పొందడం
అతని లక్ష్యం—
సుత్తి పట్టకనే కార్మిక నాయకుడయ్యాడు
కత్తిపట్టకనే ప్రజాపాలకుడయ్యాడు

సుతి మెత్తని మాటలే అతని ఆయుధాలు !
గతి తప్పని బాటలే అతని ఆదర్శాలు !
కాల పురుషుని తాకిడికి
కొండలైనా కదలిపోవా ?
యమకింకరుల పిలుపుకి
గిరిమాత్రం లొంగిపోడా ?
అయినా, స్వర్గలోకం గొడ్డుపోయిందేమో ?
లేక, వారికీ నాయకులు లేరేమో !
ఒక బాలరాజునీ
ఒక వృద్ధ చక్రవర్తినీ
ఒకేసారి తీసుకుపోయారు,
ఒక తారకను రాల్చేసి—
ఒక మేరువును కూల్చేసి !
అయినా భయంలేదు మనకి
ప్రభంజనంలా సాగిపోతాం
మునుముందుకి
వారి అడుగుజాడలే
మనకి కర దీపికలు !
వారి సంస్మరణలే మనకి
నిత్య నూతన వికాసాలు !

# సంస్మృతి

కొలకలూరి స్వరూపరాణి

కృష్ణశాస్త్రివి భావనా రో
చిష్ణుశాస్త్రివి తెలుగునాటను
కాల్పనిక రసవత్కవిత్వా
కృష్ణశాస్త్రివిలే.
శోక -స
హిష్ణు శాస్త్రివిలే.
గీతముల నవ కవితల్లో
తెలుగు వారల కీట్సు; షెల్లీ
కమ్మ కైతకు నూక చెల్లీ
కదలి పోయితివా
నువ్వా
కన్ను మూసితివా
భోగ్య వస్తువు కాని "ఊర్వశి"
వన్నె తరుగని నిత్య షోడశి.
పతిత కాదని నీదు ప్రేయసి
పక్షివైనావా
ప్రేమా పక్షి వైనావా
ప్రకృతికే నీ భావకవితా
ప్రకృతి నవచైతన్య మిచ్చెను
మలయ పవనుడు; లలిత వంశి
ఫలవరిస్తారు
పాటల
పులకరిస్తారు
మురళి గానముకై తపించే
గోపికా హృదయమ్ము నీవై
వెత్తి "అన్వేషణము" తోడా
వెళ్ళిపోయావా
రోజులు
చెల్లిపోయేనా
చిమ్మ చీకటిలోన నీకై
చెమ్మగిలు నయనమ్ము లేదని
ఆశ త్రెంచుకు నీకు నీవె-ప్ర
వాస మేగేవా
స్వర్గ - ని
వాస మేగేవా
మధుర వేదన మేళవించి
విధుర గీతిక లాలపించి
రాగవీణా శాశ్వతముగా
మూగవోయిందా
విరిగి
ముక్కలయ్యిందా!

# నేస్తం ! ఆలోచించు

డాక్టర్ పెళ్ళకూరు జయప్రద

ఆరుబయట సన్నటి వానజల్లు
లోన మధురమైన రోధన స్వరం ||ఆ||
అల్లీ బిల్లీ ఆడుతున్న నేను ఆగాను
ఆసక్తినిండిన కళ్ళతో తొంగి మరీ చూసాను

పురిటి మంచాన పొత్తిళ్ళలో అప్పుడే ఉదయించిన నా చెల్లాయి
మా అమ్మ కనుదోయిలో నును సిగ్గుల సన్నాయి

నేస్తగాళ్ళను వదిలి పరుగెత్తాను నేను నా బుల్లి బుల్లి పాదాల్తో
నిమిరి నిమిరి మరీ తాకాను నా చిగురుటాకుల్లాటి చేతుల్తో
ఏదో మెత్తగా, నును వెచ్చగా, క్రొత్తగా తడితడిగా

నా చిరు ఊహల్ని కవ్విస్తూ
నా గుండెలోతుల్ని స్పృశిస్తూ
మా అమ్మఒడిలో ఆ పాపాయి
నా గుండె ప్రతిధ్వనుల్లో నా చెల్లాయి.

చప్పున వంగాను
నా అరచేతుల్ని మంచం కొసన ఆనించాను
ఆ లేత అధరాలమీద నా అధరాల నద్ది,
వ్యక్తీకరించాను నా స్నేహభావాన్ని,
ఆహ్వానించాను ఆ క్రొత్త నేస్తాన్ని. ||వ్య||

ఆరుబయట సన్నటి వాన జల్లు
లోన మధురమైన రోదనస్వరం

ఆ రోదన స్వరాన్ని అధిగమిస్తూ, నా ఆనందపురుషుల మధ్యగా
దూరాన, ఇంకా దూరాన, మా పశువుల కొట్టాల కావల,
కొట్టాలకన్నా హీనంగా వున్న గుడిసెలో
అదే స్వరం, మరో స్వరం, మధురమైన రోదన స్వరం.
పరుగెట్టాను నేను నా బుల్లి బుల్లి పాదాల్తో
నిమిరి నిమిరి మరీ తాకాను చిగురుటాకుల్లాటి నా చేతుల్తో
ఏదో మెత్తగా, నును వెచ్చగా క్రొత్తగా, తడి తడిగా

నా చిరు ఊహల్ని కవ్విస్తూ,
నా గుండె లోతుల్ని స్పృశిస్తూ
చిరిగిపోయిన పొత్తిళ్ళలో ఆ పాపాయి
ఆ మాలతల్లి కనుదోయిలో నును సిగ్గుల సన్నాయి

చప్పున వంగాను
నా అరచేతుల్ని మంచంకొసన ఆనించాను
ఆ లేత అధరాలమీద నా అధరాల నద్ది,
వ్యక్తీకరించాను నా స్నేహ భావాన్ని
ఆహ్వానించాను ఆ క్రొత్త నేస్తాన్ని. ॥వ్య॥

ఇంతలో ఉరుములు, మెఱుపులు
అవి బయట మేఘాల సరాల్లో కాదు
బానిస భావం జీర్ణించుకున్న నా కాపలాదారుల ముఖాల్లో

"ఏంటాపని చిన బాబూ !" వాళ్ళనోళ్ళు కోరస్ పాడాయి
నా గుండెలు దడ దడ లాడాయి
"తప్పేం చేశాను నేను ?" నా చిరుపెదాల మీద ఉదయించిన ప్రశ్న
"మాలపిల్లను తాకుతావా ?" వాళ్ళ బానిస కళ్ళలో ఒకింత జుగుప్స

నా కర్థమయింది నా నేరం మసక మసగ్గా, అప్పుడే
అనుకరించడం ప్రారంభించాను నేను నా పూజ్య పూర్వీకుల్ని,
గౌరవ సూచకంగా

ఆ మసక మసక సందేశాలమధ్య పెద్దవాణ్ణవుతున్నాను
జవాబురాని ప్రశ్నలతో సతమత మవుతున్నాను
ఆ రోజుల్లో ఓ రోజు

మా చెల్లాయి, ఆ పాపాయి
పరుగెడ్తూ, పరుగెడ్తూ, పడ్డారు బొక్కా బోర్లా
ఇద్దరి రక్తనాళాల్లో నుండీ, చర్మాన్ని వల్చుకుని. తృళ్ళిన రక్తస్రావం
వాళ్ళ ఓర్పును అధిగమించి వెలువడిన రోదనస్వరం

పాఠ్యపుస్తకాల్ని బట్టీ పెడ్తున్న నేను తృళ్ళి పడ్డాను
కంగారుగా పరుగెట్టాను నా ఎదుగుతున్న పాదాల్తో

తొలగి తొలగి చూసాను ఆసక్తి నిండిన కళ్ళతో
ఇద్దరి రక్తమూ ఎఱ్ఱగానే వుంది,
తడిమి తడిమి చూసాను నా వేళ్ళ కొసలతో
ఇద్దరి రక్తమూ వేడిగానే వుంది
చప్పున ఇద్దరి వేళ్ళూ నోట్లో ఉంచుకున్నాను
ఇద్దరి రక్తమూ ఉప్పగానే వుంది.

ఇద్దరి రక్తమూ ఎఱ్ఱగానే వుంది
ఇద్దరి రక్తమూ వేడిగానే వుంది
ఇద్దరి రక్తమూ ఉప్పగానే వుంది

అంతే ఆ తర్వాతెప్పుడూ అనుకరించలేదు నా పూజ్య పూర్వీకుల్ని
ఆలోచించేవాణ్ణి శాస్త్రీయంగా నా మేధస్సుతో నేను
ఆచరించేవాణి ఏది సమంజసమన్పిస్తే దాన్ని
అనుసరించేవాణ్ణి ఏది యోగ్యమనిపిస్తే దాన్ని ||ఆ||

అందుకే నేస్తం ఆలోచించు, ఆలోచించు, ఆలోచించు.
ఇప్పుడు చెప్పు అంటరానితనాన్ని ఆహ్వానిస్తానంటావా
ఆహ్వానించ తగిందనిపిస్తే తప్పులేదు భయ్యా ! ఆచరించు
కానీ నాకు తెలుసు నువ్వాహ్వానించవు దాన్ని నిజంగా ఆలోచిస్తే
కానీ నాకు తెలుసు నువ్వాహ్వానించలేవు దాన్ని నిజంగా ఆలోచిస్తే!

# అపుత్రస్య గతిర్నాస్తి

ఎమ్. హైమవతి

——— ——— ——— ఆ రోజు

మబ్బులు ముసిరి

మసకబారిపోయాడు జాబిలి

తప్పిపోయిన చుక్కల పాపల

జాడ తెలీక బిక్క చచ్చిపోయింది

ఆకాశమాత

అది స్వార్థం కోడెనాగు

బుసకొట్టిన విషపు వాటిక

మానవతకు తలవంపులు తెచ్చిన

కౌటిల్యం ముసిరిన కుటీరం

ఆశల తైలం ఇంకిన

కొడిగట్టిన ప్రభాత దీపంలా

కుక్కి మంచంలో మూలగడానిక్కూడా

ఓపికలేని శవాకారంలా ఓ ముసలమ్మ

చీకటి నిండిన ఆ యింట

చిరుదివ్వె వెలిగించే దిక్కులేదు

దాహంతో అలమటించే ప్రాణికి

గుక్కెడు మంచినీళ్ళిచ్చే ఆసరాలేదు

జీవన సంధ్యాసమయంలో

చెట్టంత కొడుకు నీడలో

తన బ్రతుకును వెళ్ళమార్చుకొందామనే
కోరిక తీరక
ఆప్యాయంగా పిలిచే 'అమ్మా'
అనే పిలుపుకు కరువువాచి
అంతిమ ఘడియలోనైనా
ఏకైక పుత్రుడు వస్తాడేమోనని
కళ్ళలో వత్తులు వేసికొని
ఎదురు చూస్తున్న ఆమె కనులు
బ్రతికి ఉండగా ఎప్పటికీరాని
ఆ వంశోద్ధారకుని కోసం
ఎదురుచూచి ఎదురుచూచి
చప్పుడుగాకుండా మూసుకుపోయాయి
కవితావస్తువు కాదిది కొందరు కవులకు ఈ గాధ
కన్నీరు కార్పించదు ప్రజలకు ఈ వ్యధ
కాదుగదా ఇది పేవ్‌మెంట్ మీద
మరణించిన శవం

* * *

సురభిళ రమ్యం యౌవన సుమం
వాడకముందే వీడిపోగా పతి-
తానే తల్లియై తానే తండ్రియై
కొడుకుకు కష్టాల ఎండ కన్నెరుగకుండ
తన సుఖాల ఆత పత్రచ్ఛాయల
నమర్చిన తల్లి
కరుణా మహితవల్లి ఆమె
తల్లీ కొడుకుల మధ్య
అవిచ్ఛిన్నమైన అనురాగ వాహిని

కొండయై ప్రవాహాన్ని నిరోధించే కోదలు
అప్పటివరకు కుమారునకు
అమ్మ అమృతవాహిని
ఇపుడు విషానల జ్వాల
కాయకష్టం చేయడానికి
పరువు ప్రతిష్ఠలడ్డం—
అడుక్కోవడానికి
అభిమానం ప్రతిబంధకం—
అడుగడుగునా ప్రత్యక్షం
నిశ్శబ్దపు మిథ్యాగౌరవపు సంకెళ్ళు
పస్తులుండి...పస్తులుండి
గుట్టుచప్పుడు గాకుండా ఇలా
మరణించిన వారెందరో
ఆలస్యంగా వచ్చిన కొడుకు
అపరకర్మ మాత్రం నిర్వహించాడు శాస్త్రోక్తంగా !

* * *

బ్రతికినపుడు యోగక్షేమాలు
విచారించి పట్టెడన్నం పెట్టకపోయినా
చచ్చినాక ప్రతిఏటా తద్దినం మాత్రం పెట్టే
సుపుత్రులు వీరు—
'అపుత్రస్య గతిర్నాస్తి' అని కొడుకు కోసం
నలుగురు ఆడపిల్లల్ని కని భరిస్తారు వీరు
పక్కింటివాడు పస్తున్నా
పట్టనట్టుండే నిర్లిప్తులు
ఏ దేశంలోనో సర్వం కోల్పోయినవారికి
సహాయం చేసే ఉదారస్వభావులు వీరు—

ఎఱిగినవాడు

చావు బ్రదుకుల మధ్యనున్నా
ఏ మాత్రం అంతగా వుండకపోగా
ఎక్కడో ప్రపంచంలో ఎవరో
మరణించిన వారికి ఇక్కడ సభలు చేసి
ప్రగాఢ సంతాప సందేశా లందించే
వసుధైక కుటుంబ వాదులు వీరు—
చీమలకు పంచదార పెట్టి
పాములకు పాలుపోసి
గోవుల్ని పూజించే
జీవకారుణ్య దృష్టిగల
పరమ మానవతావాదులు వీరు—
'మాతృ దేవోభవ' అని తల్లిని పూజిస్తూ
ముసలితనం ముసరినాక విసరికొట్టు వీరు
ఏ మహోన్నత సంస్కృతికి వారసులు ?
ఏ ప్రాచీన నాగరకతకు ప్రతీకలు?
ప్రపంచంలోని దుఃఖితుల సంక్షేమం కోసం
పాటుపడే ముందు
నీ పొరుగువారి దుఃఖాన్ని తొలగించు
రాతిబొమ్మకు నైవేద్యం పెట్టేముందు
ప్రాణమున్న మనిషికి పట్టెడన్నంపెట్టు
మనుషుల్ని దేవతలుగా పూజించవద్దు
దయచేసి మనిషిగా చూస్తేచాలు.

# కవిత - వనిత

కుమారి జె. వి. సుబ్బలక్ష్మి

చిత్రబొమ్మ రింగ్లను చేయంగ నేర్చును;
ప్రాజెక్ట్ డిజైన్లను వ్రాయ నేర్చు;
చిలుకకు పలుకులు చెప్పంగ నేర్చును;
విద్యార్థులను చదివించ నేర్చు;
తోటలో కలుపుల తొలగింప నేర్చును;
చెడిన దేహము సరిచేయ నేర్చు;
హంస కొయ్యారంపు టడుగుల నేర్చును;
కడగి విమానాలు నడుపనేర్చు;

పిల్లి పిల్లల తగవు లాపింప నేర్చు;
న్యాయవాదిగ న్యాయమ్ము చేయనేర్చు;
గరిత యడుగుల నిడని రంగమ్ము లేదు;
వనిత చూపింప లేనట్టి ప్రతిభ లేదు;

ఆవకాయల పెట్టు చేవ యొక్కటె కాదు -
చురుకు కవితల వ్రాయు సూక్ష్మబుద్ధి
పిండి వంటల చేయు పెంపొక్కటే కాదు -
మంచి నవలల నిర్మించు గరిమ
చిరు ఫలాహారముల్ చేయు శక్తియెకాదు -
చిన్న కథానికల్ చెప్పు తెలివి
కాఫీలు షర్బతుల్ కలుపు నేరుపెకాదు -
వ్యంగ్యార్థ చిత్రముల్ వ్రాయు పటిమ

షడ్రసోపేతమై యొప్పి చవులు గూర్చి
ఉదరమును నింపు పాకమ్ము లొకటె కాదు -
నవరసస్ఫోరకమ్ములై చెవుల త్రుప్పు
వదలగొట్టెడు రచనలు వనిత సొమ్ము.

# ఈ సహారాకు ఏ సమీరాలూ రావు

ఘంటసాల నిర్మల

వెన్నెల వెదజల్లుతూ స్నిగ్ధంగా
సున్నితంగా సమీరంలా
చలిరాతిరి తెలి నక్షత్ర కిరణంలా
వస్తున్నావు-ఎవరు నువ్వు!
ఈ ఒంటరి రథ్యా
వ్యర్థపదం సాగుతూన్న నా కోసం
రెల్లుపూల నవ్వుతో
ఎవరూ నేస్తం నువ్వు!!
ఎక్కడో నిన్ను చూసిన గుర్తు!
కనుదోయిలో ఆ వసంతపు మినుకు
ఏనాడో చూసినట్టు జ్ఞాపకపు చినుకు!!
ఎ...ప్పు...డో...
ఏ ప్రాచీన స్వప్నంలోనో
కలలూ కలతలూ కలబోసుకుంటూ
ఈ దారంట...
నా మెడవంపుపై నీ గోరంట వేళ్ళ
గిలిగింతల స్పర్శతో...
అనుభూతిలో త...డు...స్తూ...
న...డు...స్తూ...నేను!
గాలిజోలకి ఊగులాడే పొన్నపువ్వులా
నువ్వూ ఆనాడే
జతగా సాగిన గో..ర్వే..చ్చని గుర్తు!
ఆ వెన్నెల బాటలో
వెలిసిపోయిన ఈ వెదురుబద్దల్ని
హద్దులకు బద్ధుల్ని వెక్కిరిస్తూ
నువ్వూ నేనూ నవ్వులు మీటినట్టు!!
అంచులేని ఆహ్లాదాన్ని అద్దుకుంటూ
నీ వాలిన తేనెవన్నె రెప్పల చాటున
పూచే నీలిరాగం
నాలో కాంతి రచిస్తూంచే
వేణువూదే సొగసుతో
వేదన తాకని మనసు త్రుళ్ళిపడినట్లు!
కానీ...నేస్తం...
అది ఓ నాటి దివ్య స్వర్గం!
ఇగిరిపోయిన దివ్య స్వప్నం!!
ఆనాటి
స్వచ్ఛపు ముత్యాలు, స్వేచ్ఛా మల్లెలు
లేవిప్పుడు తెలుసా!
గుచ్చుకునే నీ ఎద నొచ్చుకునే
పల్లేర్లూ పరచుకొన్న ముళ్ళూనూ!
అయినా, ప్రియతమ్

వెన్నెల్ని వెక్కిరిస్తూ
నిరాశ నిశీథిలా కురుస్తుంటే...
నా చుట్టూ
వీళ్ళందరి కర్కశత్వం కసికత్తులు
విసురుతుంటే...
మొదటిసారిగా
విషాదపు ముత్యాల్తో వీడ్కోలిస్తూ
నీతో అన్లేదూ
నా దరిదాపుల కెప్పుడూ రావొద్దనీ!
ఈ చీకటితోపుల తొంగిచూడొద్దనీ!
నువ్వు వస్తే...నన్ను చూస్తే...
నీలో కదిలే నీలపు తడి...
నేను చూడలేననీ!
నీ సానుభూతికి నీడ లేదనీ!!

గుర్తు లేదూ, నా ప్రియతమ్!
నువ్వు నా ఆలోచనకి అనుభూతికి
మాత్రం పరిమితం!
వెళ్ళిపో నేస్తం!
ఈ విషాదానికి ఇక ప్రత్యూషం లేదు!
ఈ సహారాకు ఏ సమీరాలూ రావు!!
వేగం వెళ్ళిపో...
ఈ స్తబ్ధతనీ స్తంభితనీ విడచి...
మన ఓనాటి దివ్యస్వర్గాన్నీ దివా
స్వప్నాన్నీ మరచి
వెనక్కి తిరిగి చూడకు
వెలిసి పోయిన ఈ వెన్నెల్నీ...
నా అలసి పోయిన కన్నుల్నీ...!

# పల్లకీ దిగిరా

శీలా సుభద్రాదేవి

ఆహా ! ఓహో అంటూ
ఈ కోటల్ని ఏలిన
తరాల క్రిందటి వైభవానికి
పరవశించిపోతూ
ఆ రాజుల
మీసాల సంపెంగనూనె వాసనల
కోసం
ముక్కుని ఎగబీలుస్తూ
వెతుకుతున్నావు కానీ—
తరతరాలుగా
అధికారం ఉక్కుపాదాల క్రింద
పడి నలిగిపోయి
మానాభిమానాలు కోల్పోయి
బ్రతుకు శిథిలం చేసుకున్న
ముక్కుపచ్చలారని
కన్నెపిల్లల కన్నీటిగాధలు
ఇక్కడ ఏ శిథిలగోడల నడిగినా
చెమ్మగిల్లిన
పసకబారిన
ఏగుళ్ళకళ్ళతో రాలుస్తూ

తాను చూచిన కథల్ని
నిట్టూర్పుల చవుడు రాలుస్తూ
చెప్తాయి.
ఆనాటి రాణుల వైభవం
ఊహించి అసూయపడకు-
అంతఃపుర పంజరాల్లో
బంధింపబడి
రాచరికపు ముళ్ళకిరీటం
నెత్తిమీద గుచ్చుకుంటుంటే
అవసరానికి ఆటబొమ్మలైన
ఆనాటి రాణుల గుండెల్లోని
గుసగుసలు
పాతబడిన అంతఃపుర తలుపుల
కిరుకిరులలో
వినిపిస్తూనే ఉంటాయి.
రాజ్యాలు పోయినా
రాజులు తరాజులైనా
ఆనాటి కోటలు విహారస్థలాలైనా
అక్కడ సంఘటనలకు లోటులేదు
అమ్మానాన్నలతో వచ్చిన

ఆకుచాటు మొగ్గో
ప్రియునితో వచ్చిన
ఆరవిచ్చిన పువ్వో
కొత్తచోటులో దారితప్పిన
ఆ ముగ్ధ మందారాన్ని
రక్షిస్తానని చెప్పి
ఉక్కుబూట్లతో
రేకులు రాల్చేసిన
భక్షక భటుడి ఉదంతాన్ని

మొండిగోడల మీంచి
తొంగిచూసిన గాలి
నీ చెవుల్లో ఊదటంలేదా?
ఇకనైనా ఊహల పల్లకీదిగి
తరతరాలుగా
అధికారానికి, అహంకారానికి
తలవంచుతున్న ఆడపిల్లల సరసన
నడచి
వాళ్ళచేత తలెత్తించు.

# ఎగసిరా

లక్ష్మీరమణ

ఎగసిరా, ఎగసిరా
ఎందున్నాసరే
ఎగసిరా, ఎదిగిరా
పగటి కలల
వలలు తెంచుకొని,
ప్రగతి విహంగమై
ఎగురుతూరా.
కష్టల కోరలు
పీకేసి,
శాంతి బుగ్గవై
పొంగుతురా
అనర్థాలను
అరికట్టేందుకు
ఏకువైనాసరే-
మేకై రా.
తనవాడే గద
దేవతని
అమృతాన్నంతా
అక్కడే ఒలికించేవ్!
దానవుడయినా
మానవుడైనా
ధారి తెన్నూ కానని వాడ్ని

చితుకుతు చీకుతు
బతికే వాడ్ని,
నడ్డి నీల్గిన గాని
నాల్గు మెతుకులు
గతక లేనోడ్ని,
ఓ కంట కనిపెట్టి
గట్టుకు నెట్టుకురా
గుట్టుగ నెట్టుకురా
చచ్చిన వాడ్ని
స్వర్గాన ఒదిలేసి
సంఘం కంట్లో
దూరని వాడ్ని
చతికిలబడి
చితికిన వాడ్ని
గడ్డి కరుస్తూ
నీళ్ళు నములుతూ
మూల్గే వాడ్ని
చేయూతిచ్చి
జట్టుగరా
జతకట్టుకురా
అభ్యుదయోన్ముఖివై
అలరుతురా

# హాంళక్కి భాస్కరులు

బుద్ధరాజు సులోచన

ఏమిటి మిత్రమా ! ఏమిటలా-
చూస్తున్నావు - అదే పనిగా !
ఓరగా - కోరగా
గుబ్బుగా - మిట్టి మిట్టి !
ఈ గ్రహరాశిలో
నేనే గ్రహాన్ననా ?
సందేహం లేదు - నీ ఊహ కరెక్ట్!
శనిగ్రహాన్ని నేనే !
నిజం ! నమ్ము — నా మాట !
ఈ గ్రహకూటం వల్ల
ప్రమాదం లేదు - ప్రళయం రాదు
ఎకాదమీ 'గురుడు' - 'వీక్షిస్తున్నాడు' !
'స్పందన' పురోహితులు
దానధర్మాలు - జపతపాలు
దండిగా జరిపి, చేయిస్తున్నారు-
గ్రహశాంతి !
డోంట్ ఫియర్ మై ఫ్రెండ్! బిలీవ్ మి!
ఏకాదశ రుద్రులు - ద్వాదశాదిత్యులు,
ఏలుతున్నారీ లోకాన్ని!
"వ్హేర్ ది మైండ్ ఈజ్
విథౌట్ ఫియర్" అని - ఆవేదన

వెలిగక్కాడో - కవి 'రవి',
"మరో ప్రపంచం - మరో ప్రపంచం"
అంటూ - మండిపడ్డాడో - మధ్యాహ్న సూర్యుడు !
ప్రజాతంత్రులను మీటి
'రుద్రవీణ' ను పలికించాడా 'రుద్రుడు'!
'స్త్రీల తిరుగుబాటు'తో
'మరో ప్రపంచం' వెలుస్తుందన్నాడో చంచల - రవి !
'అగ్నివీణ' మీటిన వారూ,
'అగ్నిపూలు' పూయించిన వారూ,
'నయాగరా'లో 'నగారా' మ్రోయించిన వారూ-
'మరో ప్రపంచం' కోసం-కలలు కంటూ
కాలాన్నీ - కలాన్నీ వినియోగించే—
'ఛాయావాద' - 'రొమాన్టిక్' - 'కాల్పనిక' - రుద్రులూ,
ప్రోగ్రెసివ్ - రివల్యూషనరీ - ఆదిత్యులూ-
సాహితీ లోకాన - ఎందరెందరో!
మంత్రాలకు - చింతకాయలు రాలలేదు!
ఏ రుద్రుడూ - ప్రళయాన్ని సృష్టించలేదు!
ఏ సూర్యుడూ - లోకాన్ని మండించలేదు!
సాహితీ రాకెట్‌లో - ఎంత
వేగంగా ప్రయాణించినా
ఆ 'మరో ప్రపంచం' - దరిదాపుల్లో
కనుచూపు మేరల్లో - కానరావటం లేదు!
మహిళల కన్నీటి గాథలను
మనోవైజ్ఞానిక భూతద్దంలో
చూపిన - 'బెంగాలీ' సూర్యుడు
కూలి జీవాల - కష్టార్తి జీవితాన్ని

సగటు మనిషి - కంఠంలో కన్నీటినీ;
కళ్ళకు కట్టించిన - 'హిందీ' సూర్యుడు
కడజాతి కరుణామయ గాథలను
'దప్పు' మ్రోయించి - వినిపించిన 'కన్నడ' సూర్యుడు;
'పదండి ముందుకు - పదండి త్రోసుకు'
అంటూ త్రోసుకెళ్ళే - తెలుగు సూర్యుడు;
'ఐయామ్ సిటిజన్ అఫ్ ది వరల్డ్'
అని- నిప్పులు కురిపించిన - ఆంగ్లరవి;
ఎందరెందరో! అయినా —
సూర్యుడు - పడమటే అస్తమిస్తున్నాడు!
ఏ 'చీకట్లూ' - చిట్లిపోలేదు!
కట్నాల 'ఇన్‌ఫెక్షన్' కి
'క్రిమిసంహారు' లు - కాలేదు!
వీరు 'రాయని భాస్కరులు'?
కాదు- వ్రాసే భాస్కరులు?
హుళక్కి- భాస్వంతులు!
జాజ్వల్యంగా వెలుగుతారు
జ్వాలలు రేపలేరు!
ఏ 'క్రిమి' నీ భస్మం చేయలేరు!
నిజం మిత్రమా! నా మాట నమ్మ!
ఈ 'కీలు గుఱ్ఱం' - ఆకాశంలో
పల్టీలు కొట్టిస్తుంది - నేలమీద నిలబడలేదు!
ఈ 'గారడీమొక్క' - కాయలు కాయదు!
ఈ 'మాయలోకం' - మూణ్ణాళ్ళముచ్చటే!
ఈ 'గ్రహాలు' - ఎప్పుడోకానీ కలవ్వు;
డరో మత్‌యార్! సచ్ కహతీహూఁ మైఁ

ముఝ్‌పె విశ్వాస్ రఖో!
మేమంతా వాయసగాంధ్రం! గోలచేస్తాం!
అరుస్తాం! అది మా నైజం!
కరిచేవాళ్లంకాదు- భయంలేదు.
'నల్లబజార్లో' హాయిగా తిరుగు
ప్రక్కవాడినించి నీక్కావలసింది-
తీసుకో-దాచుకో!
మధ్యతరగతివాణ్ణి
మట్టికొట్టుకు పోనీ!
నీకేం? నాకేం!
అందాల అపరంజి బొమ్మలు
ఆపర 'యువభారతు'లు - 'ముడుపు' కట్టి
కాచుకో నున్నారు - నీ కోసమే!
ఎంచుకో - నీక్కావలసిన - పెద్దముడుపు!
ఆడదాన్నవమానించటానికి
వెనకాడకు - నీ ఆడపడుచులు కారుగా!
'సంస్థలు' పెట్టు - పడగొట్టు
అత్తారిసొత్తే - పెట్టు తాకట్టు!
నమ్మ మిత్రమా! నా మాట నిజం!
నేనున్నా - నీ అండన!
నా 'వీక్షణ' - చాలా మంచిది!
నీ 'దశ తిరిగింది' - పట్టింది
'శనిమహర్దశ' యోగం!
నీకు తిరుగులేదు!
ఖూబ్ ఖాలో! పీలో! గానా గావో!
ఖుషామత్ కరో! ఫికర్ కరో మత్! యార్!
సోజావో! ముఝ్‌పె విశ్వాస్ రఖో!

# భావనాపథంలో బందరు

—సి, వేదవతీదేవి

సభల కోసం బందరుకు బయలుదేరితే
పాతికేళ్లనాటి పాత జ్ఞాపకాలు
సంపెంగ పరిమళంలా సన్నజాజి తావిలా
గుండెలనిండుగా కుదురుగా నిలిచి
నన్ను మురిపించి కలం పట్టించాయి
సభల కోసం బందరు వెళ్లాలి
అనుకుంటూ వార్తలకోసం పేపరు పట్టుకోగానే
ఆకట్టుకున్న దొక వార్త
ఆయిల్ బుస్సుమంటూ పొంగిందని
బందరు తీరం బంగారం పండిస్తుందని
ఎంతటి శుభవార్త!
బందరు పట్టణం ప్రాచీనతకు
సంస్కృతికీ సకల కళలకూ నిలయ్యం
సద్వర్తనకూ సంప్రదాయానికీ
సరసతకూ సారస్వత వికాసానికీ
కాణాచి బందరు పట్టణం
కవులు-కళా తపస్వులు
మేధావులు మహనీయులు
నడయాడిన నందనవనం ఇది;
పంచదార నల్లబజారులోకి పోయినా
బందరు లడ్డులో తీపితనం తగ్గలేదు!
మనుషుల్లోనూ ఆ మంచితనం

మనసులలో మార్దవం
ఇసుమంతయినా ఇగిపోలేదు!
ఈ మూడు రోజులుగా
స్పందనవారు - బందరువారు
మాకు అందించిన ఆతిథ్యం
మంచి గంధపు సౌరభంలా
పన్నీటి జల్లులా
చిరకాలం గుండెల్ని తాకుతుంది!
స్పందన
చైతన్యానికి చిహ్నం!
స్పందన
కదిలించేదీ కలం పట్టించేదీ
స్పందన
సాహితీలోకానికి రసస్పందన
ఈ మూన్నాళ్ల పేరంటానికి
ముచ్చటగా పిలిచి హాజరుగా నిలిచి
పూట పూటా ఆత్మీయమైన విందు భోజనం అందించి
సమర్ధంగా పలకరించి
స్పందన కేవలం
సాహితీ రస స్పందనగానే కాక
సుహృత్ భావస్పందనగా
నిలిచింది ఈనాడు
ఇది వీడ్కోలు కాదు
ఒక కృతజ్ఞతాంజలి
మళ్ళీమళ్ళీ సాహితీ వనవిహారంతో
కలుసుకుందాము
భావాలు కలబోసుకుందాము.

# గెలిచాను! నేనే గెలిచాను!!

కె. వసుంధరాదేవి

పంచాయితీ ఎలక్షన్లలో
ప్రజా ప్రతినిధిగా నిలబడ్డాను.
నిలబడి గెలిచాను !
నాకు నేనే గెలిచాను !!
నన్నెవ్వరూ గెలిపించలేదు.

ప్రజలకు మేలు చేద్దామని
ఊరును బాగు పరుద్దామని
నిలబడలేదు ఈ పోటీకి,
తరతరాలుగా వస్తున్న
మా పెత్తందారీతనాన్ని నిలుపుకోవాలని
'హుజూర్' అనే గులాముల
సలాములు అందుకోవాలని
నిలబడ్డాను ఈ పోటీకి.

ఈ మూర్ఖ ప్రజలు కూడా తెలివిమీరి పోయారు
ఓట్లు అడగటానికి వెళితే ముఖం చూచినవాళ్ళే లేకపోయారు
ఇది కాదు పని అని
'ధనమూల మిదం జగత్' అని
నోట్లు వర్షంలా కురిపించాను.
ఆడవాళ్ళకు పసుపు కుంకుమలతోపాటు
చీరా రవికా కూడా ఇప్పించాను,
అనుమానంగా వున్న లేబరంతటినీ

నాలుగు రోజుల ముందే తెప్పించాను
గొడ్ల దొడ్లో పెట్టించి,
తిండి, తిప్పలు సమకూర్చాను
నడచి వెడితే మధ్యలో మారిపోతారేమోనని
ఎవరైనా మనసు మార్చి వేస్తారేమోనని
వాహనాల మీదే పోలింగు సెంటరుకు చేర్పించాను.
అయ్యో ! ఏం చెప్పుకోను !
నా బాధ ఎవరు పంచుకోను !
'మీకే మా ఓటు' అన్న వాళ్ళంతా
నా ప్రత్యర్థికే వేసేశారు.
అయినా గెలిచాను !
ఒక్క ఓటు; ఒకే ఒక్క ఓటు !
అదీ, నా ఓటుతోనే గెలిచాను !
నా ఓటుతోనే గెలిచానని
ఎందుకంటున్నానంటే,
ప్రక్కవూరిలోని ప్రతినిధి ఒకాయన
అందరితో ఓట్లు వేయించుకుని
ఆ సంతోషంలో తన ఓటు
వేసుకోవటం మర్చిపోయాడట !
పాపం ! అందుకే ఓడిపోయాడట !
దేవుడు కరుణించబట్టి
నా ఓటు నాకే వేసుకున్నాను మేలు
ఎలాగో గెలిచాను, అదే పదివేలు!

# కోయిలా - పాడవే

డా॥ వాసా ప్రభావతి

ఓ! కొత్త కోయిలా
వసంతం వచ్చిందని
రెక్కలు కట్టుకు వాలావా!
అసలు ఆమని అందాలన్నీ నీవేగా.
అనువుగా పదును లేనున్న
అరుణరంజిత ఆమ్రకిసలయ రసములు
ఆవురావురంటూ మెక్కి
గళానికి పదును పెట్టుకొని
నీ ఆనందాన్ని అందరికి పంచాలని
గొంతెత్తి పిలుస్తున్నావా?
ఎదవిప్పి పాడుతున్నావా?
అసలు నీ పిలుపును అందుకొనే దెవరో
నీ పాట తీపిదనాన్ని పంచుకొనే దెవరో
నీకు తెలుసా?
నీ పాటను అనుకరిస్తే
నువ్వు పంతాని కొచ్చి
కసరుకొనే
ఆ చిన్నారి పిల్ల లెక్కడున్నారో
ఇప్పుడు నీకు తెలుసా?
మోయలేని పుస్తకాల భారాన్ని
భుజాన్ని తగిలించి
మండు ఎండలో
ఆగని బస్సుల కోసమై
ఎదురు చూసి చూసి

క్రిక్కిరిసిన బస్సులను
పట్టుకు వ్రేలాడుతున్నారు
గుండెలను చేతపట్టి
పయనిస్తున్నారు
అందంగా నీతో పలకాలని వున్నా
నీ పిలుపును అందుకోలేరు వారు
ఇక అద్దాల మేడలో
అందాల గదిలో
తప్ప తాగిన మైకంలో
నీ పాటలోని మాధుర్యాలను
హృదయానికి అద్దుకొనే దెవరు?
నీకోసం ఎదురుచూసే దెవరు?
ఇక సామాన్య దంపతుల మాటంటావా?
వీరు ఆ ప్రబంధ కాలపు
ప్రేయసీ ప్రియులు కారు
పెండ్లినాడే ఆఫీసులకు
రెక్కలు కట్టుకు ఎగిరే
విరహ పక్షులు వీరు
అందుకే కోకిల గానాలు
చల్లని పిల్లగాలులు
సరిపడవని తెలుసుకున్న ప్రకృతి
మాడ్చే ఎండలను
మలమల వీచే గాలులను
ఎగసం తోస్తోంది
నోటిదగ్గర కూటిని
కొట్టుకు పోతోంది
అందుకే వీరికి ప్రేమ-ప్రణయం-సుఖం
ఇలాటి పదాలకు అర్థాలు తెలుసుగాని
అనుభవంలో లేని
అమాయకులు వీరు;
ఈ విధంగా ప్రకృతే ఎదురు తిరిగి

వికటాట్టహాసం చేస్తుంటే
ఇవి చాలక
కక్షలు కట్టి కత్తులు దూసే దొకడు
నోటికి పనిచెప్పి సంఘాన్ని దులిపే దొకడు
చేతికి చిక్కింది దోచుకొనే దొకడు
అసలు ఒకరి మాటంటే ఒకరికి విషం
ఒకరి సుఖమే వీరి కసలు ఆటంకం
అందుకే నీ పాటను అందుకోలేరు వీరు
అంతేకాదు
బ్రతుకనేర్చిన మనిషి
సామాన్యునిపై సవారి చేస్తుంటే
నలిగిపోయిన మనిషి
నోరు తెరచి చూస్తున్నాడు
కాలు కదిపే శక్తి లేక ఆగిపోతున్నాడు
నీ పాట వినే ఓపిక లేక అలసిపోతున్నాడు
అందుకే ఓ కోయిలా
నీ పాట అందరూ అందుకోలేదని
అలుక బూనకు
నీకై ఎదురు చూసే
సామాన్య గుండెలింకా
కొన్ని కొట్టుకుంటున్నాయి
నీ పాటను అందుకునే
మనసులింకా మెదలుతున్నాయి
వారికోసమే నువ్వు పలకాలి
వారి కోసమే నువ్వు పాడాలి
నీ పాట పన్నీటి జల్లులు కురిపించి
ఎండిన వారి హృదయాలను
మొలకెత్తించాలి
మూగవోయిన వారి గళాలను
పలికించాలి.

11)

# నిద్రపట్టని రాత్రి

కొండేపూడి నిర్మల

నిన్న రాత్రి...
నిద్రపట్టని రాత్రి...
చిటికెడు కన్నీటి భిక్ష కూడా
వెయ్యని
ఎడారి దేశంలా మరీ విశాలంగా
వుంది
ఆకాశం !
అంత విశాలమైన ఆకాశాన్నీ
చిన్న దీర్ఘ చతురస్రంగా కత్తి
రిస్తున్న
కిటికీ !
కిటికీ చువ్వల్లోంచి వెలుగు చారిక
మనిషి కోరికలాగా భయంకరంగా
ఎదిగి
నేలను పెనవేసిన వేళ...
అది రాత్రి సరిగ్గా రెండు నిలువు
గీతల సమయం !
కొబ్బరాకుల నిలువు పాపిట మీద
మంచు బొట్టొకటి మిసమిసా నాకేసి
చూస్తోంది
ఎదలోపల ఎక్కడో ఖరీదైన
జ్ఞాపకం కాలుతోంది

గుండె లోపల పండిన మొగలిరేకు
గుచ్చుకున్నట్లు...
చివ్వుమన్న బాధ ! రివ్వుమన్న
సువాసన !
బ్రతుకు ఉలిపిరి కాగితం మీద
సగం సగం అల్లిన ప్రణయ
గీతాన్నీ...
భయంతో ఆగిపోయిన పెండ్యులం
గుండెనీ...
నుసి మసిగా రాలుతున్న అగరువత్తి
కొసనీ...
వొంటరిగా వదిలిపెట్టి
చివ్వున లేచింది నా నీడ...
పొగ చూరిన గోడ...
అందమైన అద్దంపై నిలువెత్తు
మరకలా వుందది
యింత రాత్రి వేళ...
నగరం యావత్తూ నిద్ర కెరటాల
మీద
కలల కాగితప్పడవలా తేలుతున్న
వేళ...
నాకెవరిచ్చారీ మెలకువ !?

తొలి నక్షత్రపు మినుకులా...
గుండె లోపలి ఉలిపిరి స్వప్నాలన్నీ
ఉరి తీసుకు కలాడితే
మృత్యువులాంటి వెత్తిలోకి
నిండు సున్నాలా నన్ను నేనే
చుట్టుకున్న మగతలో
సగం కాలిన శవం లాంటి జీవితం
మీద
ఎక్కడిదీ !?
యింత మెత్తటి కన్నీటి చుక్క !
చితికిన వెన్నెల బిందువులా...
అప్పుడెప్పుడో
కొన్ని వేల వెన్నెల రాత్రుల వెనక
ఒక ఉదయం
ఉదారంగు ఎండలో
ఉల్లాసాన్ని జీవితపు థ్రిల్లునీ
నిలువెల్లా చల్లుకుంటూ
నడుస్తున్నప్పుడు
నిశ్శబ్దం తంత్రులమీద రిమరిమలా
నులివెచ్చటి మధురిమలా
ని...షా...ని...షా...గా
వినిపించింది...
నీ పాట !
ఆశ ఆశగా సోకిన నా చూపుకి
దూరంగా
మంచు ముల్లుమీద విచ్చుకున్న

తూరుపు పువ్వులా
నువ్వు !
మత్తెక్కిన నా నాజూకు
మస్తిష్కంలోకి
జీవించే నీరెండ చురుకులా
నీ నవ్వు !
ఇప్పటికీ తెలుసు నాకు
ఆ ప...చ్చ...టి ఎండలో
నీకోసం
ఈ వంటరి పాదాల జంట
పొడి పొడిగా తడబడుతూ
రెక్కలురాని భ్రమరంలా
నీముందు నేను కదిలినప్పుడు
చురుక్కున వెనుదిరిగిన నీవెనక
విస విసలాడే వాల్జడ కొస మాత్రం
కనిపించింది
ఆగిపోయిన పాట
విరిగిన వజ్రపు ముక్కలా
తలపుల్లో గుచ్చుకుండే
పండుతూ గుండె నిండుతూన్న
అనుభూతి
అచుంబిత స్వప్నంలా మిగిలిపోతే
కన్నుల గాజు గోళాల్లో
కేంద్ర బిందువు లాంటి ఆ పాట
నరాల వయొలిన్లపై
చూపుడు వేలులాంటి ఆ పాట
యిప్పటికీ ఓ స్మృతి !